# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 37 | జనవరి, 1978 | సంచిక 1

నూరు సంవత్సరాలలో, అంటే ఈనాడు జీవించివున్న వారెవరూ ఎరుగని కాలంలో, ఎన్నడూ జరగని ఒక మహాప్రళయం ఆంధ్రదేశంలో సంభవించింది. నూరేండ్లకు పూర్వం, అంటే 1864 లో బందరు నగరాన్ని దెబ్బకొట్టిన గాలివానను గురించి, ఆనాడు దానివల్ల దెబ్బతిన్నవారూ, దానిని గురించి విన్నవారూ వ్రాసిన వ్రాతలను యీనాడు చదివితే, ఒక్క భూకంపం తప్ప మరోవిధంగా ప్రకృతి అంత ఘోరంగా విలయ తాండవం చెయ్యగలదా అనే ఆశ్చర్యం కలిగేది.

ఈ శతాబ్దంలో ఇండియాలో నాలుగు పెద్ద భూకంపాలు సంభవించాయి. 1934 జనవరిలో బీహారు భూకంపంలో సుమారు పదివేల మంది చనిపోయారు; 1935 మే నెలలో క్వెట్టా భూకంపంలో సుమారు 60,000 మంది చనిపోయారు. 1950 ఆగస్టు నెలలో అసాంలో భూకంపంలో సుమారు వెయ్యిమంది చనిపోయారు. పదేళ్ళనాడు కోయినా భూకంపంలో వెయ్యిమందికి లోపే మరణించారు. ఆ భూకంపాల అనంతరం, వాటివల్ల దెబ్బతిని జీవించివున్న వారికి అనేకవిధాల సహాయం జరిగింది.

సముద్రం పొంగి, గ్రామాలు తుడిచిపెట్టుకొనిపోయి, వేలాది ప్రజలు చనిపోవడమూ, లెక్కలేనన్ని వేల ప్రజలు కనపడకుండా పోవ

డమూ, 1977 నవంబరులో, ఆంధ్రదేశపు సముద్ర తీర జిల్లాలలో సంభ వించింది. ఇలాటి ప్రళయం, కొన్ని వేల సంవత్సరాలనాడు ద్వారకా నగరానికి సంభవించిందని పురాణాలలో చదవడం తప్ప, మళ్ళీ ఎన్నడూ ఎరుగము.

1977 నవంబరులో తమిళనాడులో విపరీత వర్షాల వల్ల సుమారు ఆరువందలమంది చనిపోయారు. కొన్ని వేల గుడిసెలు కొట్టుకొని పోయాయి. కొన్ని వందల యిళ్లు దెబ్బతిన్నాయి రెండు, మూడు లక్షల ఎకరాలలో పంటలు దెబ్బతిన్నాయి. ఈ వర్షాలు అంతటితో ఆగ కుండా, ఆంధ్రదేశం వైపు ప్రయాణం చేసి, సముద్రతీరపు జిల్లాలను ముంచెత్తివేస్తూ వుండగా, ఒక మహా ప్రళయంలాగ వుప్పెన వచ్చి, సముద్రం పొంగి తీరంనుంచి సుమారు 30 మైళ్ళు నేలమీదకు 18 అడుగుల ఎత్తున వచ్చి పడి, దాదాపు 40 గ్రామాలను సముద్రంలోకి యీడ్చుకొని పోయింది. నూరేళ్ల నాడు బందరును దెబ్బకొట్టిన వుప్పెన, మొన్న నవంబరులో కృష్ణా, గుంటూరు జిల్లాలను ధ్వంసం చేసిన వుప్పెన ముందు గాలిపాటు మాత్రమే.

అధికారరీత్యా 1977 డిసెంబరు 5 నాటికి తెలుస్తున్న వార్తలను బట్టి, మృతుల సంఖ్య సుమారు, 9000 కాగా, కొద్దో గొప్పో దెబ్బతిన్న గ్రామాల సంఖ్య, 2,800 తమకు వున్న సర్వస్వాన్నీ కోల్పోయినవారూ, ఏదో ఒకవిధంగా నష్టపడినవారూ, మొత్తం 71 లక్షలమంది. ఇళ్ళు, వాకిళ్లూ పూర్తిగా పోయి. నిరాశ్రయులైనవారు 30 లక్షలకు పైబడి వున్నారు. పూర్తిగా రూపం లేకుండా కూలిపోయిన యిళ్ళూ, ఎంతో కొంత దెబ్బతిన్న యిళ్ళూ సుమారు తొమ్మిది లక్షలు. సుమారు నాలుగు లక్షల పశువులు నశించాయి. ముప్ఫయి లక్షల ఎకరాలలో పంటలు దెబ్బతిన్నాయి.

పైన చెప్పినవన్నీ అధికారరీత్యా తెలుస్తున్న అంకెలు. అధికారులు ఇంకా నష్టాలను పరిశీలిస్తూనే వున్నారు. రోజు రోజుకూ పైకి తీయబడుతున్న శవాల సంఖ్య పెరుగుతూనే వుంది. దొరికిన శవాల సంఖ్యా కాకుండా, సముద్రంలోకి యీడ్చుకొని పోబడిన ప్రజల సంఖ్య ఎంతో తెలియడానికి చాలా రోజులు పడుతుంది. కొట్టుకుపోయిన గ్రామాల పరిస

రాలలోని గ్రామస్తులు చెప్పేదానినిబట్టి, కొన్ని గ్రామాలలో బ్రతికి బైటపడినవారు చెప్పేదానినిబట్టి, మృతుల సంఖ్య యాభై వేలకు పైనే వుండేటట్టు కనిపిస్తోంది. చనిపోయినవారిని గురించి, కన్నీరు విడవడం తప్ప, జీవించి వున్నవారు చేసేది ఏమీలేదు. కాని, వున్నది సమస్తమూ సముద్రంపాలై, నిరాశ్రయులైన 80 లక్షలమంది ప్రజలను మాటలతో ఓదార్చడం కాకుండా, మళ్లీ తమ మామూలు జీవితాన్ని సాగించుకోవడానికి వారికి అన్నివిధాల సహాయం చెయ్యడమే ప్రస్తుతపు కర్తవ్యం. ఇది సామాన్యమైన పనికాదు. దీనికి సుమారు మూరుకోట్ల రూపాయలైనా కావాలి. ఇళ్ళు పోయినవారికి తల దాచుకొనేపాటి వసతినైనా కల్పించాలి. కుటుంబాలను పోషించే వ్యక్తులు చనిపోగా, దిక్కులేనివారికి పోషణ మార్గాన్ని చూపించాలి. పంటలు నాశనమైనవారికి, పన్నులు రద్దు చెయ్యడం కాకుండా, మళ్ళీ తమ పొలాలను సాగులోకి తెచ్చుకొనేటట్టు సహాయం చెయ్యాలి. కొన్ని లక్షల పొలాలలో, సముద్రపు నీరు నిలిచిన చోట చవుడు ఏర్పడుతుంది. దానిని తొలగించి, ఎరువులు వేయించి, ఆ పొలాలను సేద్యయోగ్యం చెయ్యాలంటే నెలలే పడుతుందో, సంవత్సరాలే పడుతుందో? ఎన్నాళ్లు పట్టినా, నిర్విరామంగా కృషిచేయవలసిన అవసరపరిస్థితి యిది

ఉప్పెన బాధితులకు సహాయం చెయ్యడానికి, మనదేశంలోని అన్ని ప్రాంతాల నుంచే కాక, విదేశాల నుంచి కూడా సహాయం వస్తున్నది. అవసరమైన సహాయాన్ని అందచెయ్యడంలో ఏమాత్రము సంకోచం వుండదనీ, కేంద్ర ప్రభుత్వం అన్నివిధాలా సహాయపడుతుందనీ ప్రధానమంత్రి రాష్ట్ర ప్రభుత్వానికి హామీ యిచ్చారు. అలాటి, అవసరమైన సహాయాన్ని పూర్తిగా వినియోగించుకోవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానిది.

ముఖ్యమంత్రి వెంగళరావుగారి నాయకత్వంలో, నిర్విరామమైన కృషి తుపాను బాధితులకు సహాయం చెయ్యడానికి జరుగుతూనే వుంది. ఈ కృషి కొన్ని నెలలపాటు జరగవలసిన కృషి. రాజకీయాలకు, యీ సందర్భంలో ఎంతమాత్రమూ తావు యివ్వకూడదు. పక్షపాతాలు ఎంత మాత్రమూ వుండకూడదు. పైగా, దీనులకు సహాయం చెయ్యడంలో, స్వార్థాన్ని చూసుకొనే మహామహావులు కూడా కొందరు వుండవచ్చును.

అలాటివారికి, యీ సహాయ కార్యక్రమాలలో ఏమాత్రము తావు యివ్వకూడదు. ఇదంతా ఒక కంటితో కనిపెట్టి, బాధిత ప్రజలకు సహాయం చెయ్యడంలో అవిరామ కృషి చెయ్యగల ఉద్యోగులనే, యీ పనికి నియోగించాలి కొన్ని సందర్భాలలో సహాయం పొందినవారికే ఒకసారికి రెండు సార్లు సహాయం అందుతూ వున్నట్టూ, కొందరికి అసలే సహాయం అందనట్టూ వార్తలు పత్రికలలో వస్తున్నాయి. అలా జరగకుండా చూడడానికి తగిన వ్యవస్థను ఏర్పాటుచెయ్యాలి. ముందుగా అందరికీ కనీసపు సహాయం లభించేటట్టు చూసి తరువాత అవసరాన్నిబట్టి అదనపు సహాయాన్ని యివ్వడం సక్రమమైన పద్ధతి. ఈ విధంగా ఏర్పాట్లు చేసి, రెండు మూడు నెలల లోపున, బాధితులందరికీ ఆనందాన్ని చేకూర్చకపోయినా, వారి కన్నీటినైనా తుడవడం జరుగగలదని ఆశిస్తున్నాము

ఈ దారుణ పరిస్థితిలో, సహాయం చెయ్యదలచిన వారంతా, తామిచ్చే విరాళాలను, యితర వస్తు సామగ్రిని ఒక కేంద్రీకృత సంస్థకు అందచెయ్యడం మంచిది. దానివల్ల, సక్రమమైన పంపకం జరుగుతుంది.

———



# ఫేర్‌వెల్ మై ఫ్రెండ్

చెల్లూరి శ్రీరాజేశ్వరరావు

ఆ విషయాన్ని ఎలా చెబుదామాఅని అనంతయ్య రెండు రోజులనుంచి ఆలోచిస్తున్నాడు. చివరికి తర్జన భర్జన పడి ఎలాగో చెప్పేశాడు.

రవి నిశ్చల చిత్రంలా నిల్చుండిపోయాడు.

"ధరలు పడిపోవడంతో వ్యాపారం తల క్రిందులై పోయింది బాబూ అప్పులు పోను ఎకరం మిగులుతుందేమో! దాంతో సంసారమే పోషించనా...నీ చదువుకే ఖర్చు పెట్టనా? నీ చదువు మధ్యలో ఆగిపోవడం నాకు మాత్రం యిష్టమా చెప్పు! విధి నిర్ణయం అలాగుంది నువ్వేదో వుద్యోగం వెతుక్కుంటే నాకు కాస్త తేలిపిగా వుంటుంది" అనంతయ్య కొడుక్కేసి చూడకుండా పాఠంలా చెప్పాడు

వరండాలో శశి, మురళి గాలిపటాల కోసం దెబ్బలాడుకుంటున్నారు. కుటుంబ కష్టాలు పట్టించుకోని బంగారు కాలమది. కాని రవి ప్రాజ్ఞుడు. ఈ సంవత్సరం

చదివితె యం.కాం. డిగ్రి వస్తుంది. జీవితంలో స్థిరపడతాడు. తెలివిగల విద్యార్థిగా ఎంతో ఆశావంతమైన భవితవ్యం కోసం కలలు కంటున్న రవి కిది ఆశాభంగమే కలిగించింది.

ఒక వైపు తండ్రి కష్టానికి సానుభూతి వున్నా, మరో వైపు మధ్యలో చదువు ఆగిపోవడం గుండెల్ని నలిపి వేస్తోంది.

"ఫీరు యాభై పంపించండి చాలు... ట్యూషన్లు కుదుర్చుకుని ఎలాగో సర్దుకుంటాను. యూనివర్సిటీ ఫస్టు తెస్తానని ప్రొఫెసర్లందరికీ ఆశగా వుంది నాన్నా."

కొడుకు భవిష్యత్తు చెడగొట్టడం అనంతయ్యకి మాత్రం యిష్టమా? వ్యాపారం చితికిపోవడంతో ఆయన దెబ్బతిన్నాడు. అప్పులు తప్ప ఆదాయం కనిపించడంలేదు. రవి తెలివైనవాడని తెల్సు బుద్ధిమంతుడని తెల్సు. ఎదర ఎదర కొడుకు ప్రయోజకుడవుతాడని తెల్సు. అన్నీ తెల్సినా డబ్బు అసమర్థుడ్ని చేస్తోంది.

తండ్రి మౌనంగా వుండటంతో రవికి ఆశ కల్గింది. "ఇప్పుడు చదువు మానేసినా వెంటనే ఏం వుద్యోగం దొరుకుతుంది నాన్నా. ఈ సంవత్సరం కష్టపడితే మంచి వుద్యోగం వస్తుంది.

"రోజూ ఓ యుగంలా గడుస్తోందిరా. ఇంకా తమ్ముడూ, చెల్లాయి వున్నారు. వాళ్ళని చూడాలి గదా! కాస్త పరిస్థితులను అర్థంచేసుకో" అనంతయ్య కఠినంగా అన్నాడు.

మహాలక్ష్మి వంట చేస్తున్నా... ఈ సంభాషణ వినిపిస్తూనే వుంది. మారిపోయిన పరిస్థితులవల్ల ఆమెకి వ్యధగానే వుంది. కూర పొయ్యిమీదనుంచి దింపి హాల్లోకి వచ్చి, "ఏమాత్రం వీలున్నా మీ నాన్నగారు నీ చదువు ఆపుతారా బాబూ! అన్నీ అలా వచ్చాయి మరి... ఏం చేస్తాం చెప్పు." రవికి నచ్చ చెప్పింది.

రవి ఓ నిర్ణయానికి రాలేకపోతున్నాడు మధ్యలో చదువు ఆపడం భరించలేనిదిగా వుంది. తండ్రి ప్రమేయం లేకుండా చదువుకోవడం ఎలాగాఅని ఆలోచిస్తున్నాడు. ఏ పద్ధతీ ధైర్యాన్ని యివ్వడంలేదు.

"కొండలరావుగారు తమ కంపెనీలో టెంపరరీగా నీకు వుద్యోగమిస్తానన్నారు. మూడు వందలు యిస్తారుట. నీ జీతంతో సంసారం గడిచిపోతే, నేను మళ్ళా లేవడానికి ప్రయత్నిస్తాను" అనంతయ్య భవిష్యత్తుని చర్చించసాగేడు.

"ఉద్యోగం చేసుకుంటూ చదువుకునే వాళ్ళు ఎంతమంది లేరు? తెలివైనవాడు ఎందులోనైనా రాణిస్తాడు బాబూ." మహాలక్ష్మి లోపలి కెళుతూ అంది.

రవి శూన్యంగా చూడసాగాడు.

అనంతయ్య లాల్చీ వేసుకున్నాడు. చెప్పులు వేసుకుని "నేను కొండలరావు

అని బయటకి వెళ్ళాడు.

రవి మంచంమీద అచేతనంగా పడి వున్నాడు. చెదిరిపోయిన కల అశాంతి నిస్తుంది. సాహసమైన మంచి నిర్ణయం తీసుకోవాలని మరోవైపు జిగీష హెచ్చ రిస్తోంది.

అంతరంగంలో కామరాజు గారు కనిపించారు. కొండంత ధైర్యం కల్గింది. కాని అంతలోనే నిరాశ ముంచుకొచ్చింది విశాఖపట్నం చేరుకోవాలంటే కనీసం పాతిక రూపాయిలేనా వుండాలి. తన దగ్గర పాతిక పైసలుంది. అంతే...దీని కోసం తండ్రి నేమని అడుగుతాడు ?

పన్నెండున్నరకి ఎండలో అలసి పోయి అనంతయ్య వచ్చాడు. మహాలక్ష్మి యిద్దరికీ వడ్డించింది. రవి యాంత్రి కంగా కూర్చున్నాడు భోజనం ముందు.

"సాయంత్రం నిన్ను కనిపించ మన్నారా." అనంతయ్య చెప్పాడు.

"ఆ వుద్యోగం వద్దు నాకు!"

అనంతయ్యకు చిరాకు ఎక్కువైంది. "కలక్టరుద్యోగం వస్తుందనుకుంటు న్నావా ?"

మహాలక్ష్మి ఆవేదన పడింది. "ఈ పరిస్థితిలో మూడొందలు మనకి మూడు వేలతో సమానం నాయనా! మూర్ఖానికి పోక...మంచిది దొరికిన్నాడు మానే యచ్చుగా."

వుద్యోగంలో మాత్రం చేరను."

అనంతయ్య చిరాగ్గా చూశాడు మండి పడుతూ "మళ్ళీ మొదటి కొచ్చావు మాట. నా మాట వినకపోతే యిక నీ గురించి మాకు బాధ్యత వుండదు. ఎలా ఏడ్చినా సరే...మాకేం సంబంధం వుండదు. ఉన్నదంతా నీ కూడ్చిపెడితే ఆ పిల్ల వెధవల నేంచేయమంటావ్ ? ఆ మాత్రం వివేకంలేదా ?" చివాట్లు వేశాడు. .

మహాలక్ష్మి భర్తకి సర్దిచెప్ప బోయింది.

"నువ్వు నోర్మూయ్." పెళ్ళాన్ని గద్దించాడు.

రవి పులుసు అన్నంలోనే చెయ్యి కడిగేసుకున్నాడు. మహాలక్ష్మి పిలుస్తున్నా వినలేదు. చొక్కా వేసుకుని రోడ్డు ఎక్కాడు. కిళ్ళీ బడ్డీ దగ్గర బర్కిలీ సిగరెట్ వెలిగించి నిండుగా పొగ వదిలాడు.

మురళీధరం పంచాయితీ బోర్డునుంచి యింటికి వెళుతున్నాడు. కూడా నలుగు రైదుగురు రైతులున్నారు.

రోడ్డుమీద అడిగితే బాగుండదు. ఇంటికి వెళితే సరి చిన్ననాటి స్నేహి తుడు. మామని బట్టి హైస్కూలుతో చదువు ఆపి రాజకీయాల్లో దిగిపోయాడు. రెండు టరముల నించి అతడే సర్పంచ్. విశాఖ వెళ్లడాని కేదైనా సాయం చేయక పోతాడా ? రవి నీడలా అనుసరించాడు.

మురళీధరం అరుగుమీద పసుపు అర బెడుతున్న పాలేరుతో ఏదో మాట్లాడు తున్నాడు. రవికి అప్పుకి తిరిగే సన్ని వేశం కొత్తది. అనుభవం లేనిది తడుము కుంటూ చివరి కెలాగయితే చెప్పేశాడు.

"అరె...ఒక్క నిముషం ముందర వచ్చి వుంటే అయిదు వందలయినా యిచ్చే వాడ్ని. ఇప్పుడే ఆచారిని పట్నం పంపేశాను."

రవి చిన్నగా నవ్వి రోడ్డెక్కాడు. మురళీధరం రాజకీయాలు నేర్చు కున్నాడు. తనలాంటి అనామకుడ్ని ఆదుకునే ఔదార్యం ఎందుకుంటుంది?

ఆకాశం మబ్బులతో నిండి వుంది. చినుకులు పడుతున్నాయి. రవి కంగా రుగా కిరాణా కొట్టులోకి వెళ్ళాడు. మాణిక్యం పాత చందమామ చదువు కుంటోంది. 'రా రవి బాబూ' అంటూ గోనె పరచింది.

మాణిక్యానికి ముప్పయే ళ్ళుంటాయి. నల్లగా వున్నా ఆకర్షణీయంగా వుంటుంది. రవి యస్సెల్సీ ప్యాసయ్యాక నాలుగు నెలలపాటు ఆ కొట్లో గుమస్తాగా పని చేశాడు. మాణిక్యం మొగుడు లేక పోయినా వ్యాపారం చేసెయ్యగలదు.

"ఇశాపట్నం ఎల్లలేదా?"

"వెళ్ళాలి. వెళ్ళక్కర్లేదు."

మాణిక్యం నిండుగా నవ్వింది.

"అదేటి?"

"అవును మీ నాయన దెబ్బతినేశాడు. మంచోరికే కష్టాలు. మరేటి చేస్తావ్. చదువు మానేత్తావా?" బాధగా ప్రశ్నిం చింది.

"విశాఖపట్నం వెళ్ళి ప్రయత్నిం చాలి. ప్రొఫెసరుగారు సాయం చేస్తారని వుంది. అసలు వెళ్లడానికే డబ్బులేదు."

"నేనిస్తాను పట్టుకెళ్ళు."

"మాణిక్యం!" ఆమె మంచితనానికి నివ్వెరపోయాడు.

"ప్రయత్నించు. అదృష్టం కలిస్తే ఏం కావాలి?" గల్లాపెట్టి తీసి యాభై నోటు యిచ్చింది.

"పాతిక చాలు మాణిక్యం."

"వుంచవయ్యా...పట్నం మెలితే నాలుగురూపాయిలు దగ్గరుండాలి."

వాన పెద్దదయింది. ఉరుములు మెరు పులు. గాలి కూడ వీస్తోంది. చెట్లు లయ బద్ధంగా వూగుతున్నాయి. మాణిక్యం గోనె పట్టాలు దింపింది జల్లు కొట్టకుండా! ఆ వాన రెండుగంటలసేపు అలా కురుస్తోనే వుంది.

మాణిక్యం టీ కాచి యిచ్చింది. రవి వచ్చేస్తూ అనేక విధాల కృతజ్ఞతలు తెలియపరిచాడు. నాల్గింటికి వాన పూర్తిగా వెలిసింది. ఎండకూడ వచ్చింది. నీరెండలో తడిసిన పల్లె వింతగా మెరుస్తోంది.

రవి బట్టలు సూట్‌కేస్‌లో సర్దు

లేదు.మహాలక్ష్మి బియ్యం చెరుగుతోంది.

"విశాఖ వెళుతున్నాను." అని మాత్రం చెప్పి రోడ్డెక్కాడు. ఇంకా నిలబడితే తల్లెం ప్రసంగం చేస్తుందోనని భయపడ్డాడు.

సెంటర్‌లోకి వచ్చాడు. ఆ రోజు బస్సు రాలేదని తెల్సింది. వర్షం కురిస్తే ఆ వూరి బస్సుకి సెలవు. ఎక్స్‌ప్రెస్ కోసం ఆరుమైళ్ళు వెళ్ళాలి. నలుగురు ప్రయాణికులతో కలిసి జట్కా ఎక్కాడు రవి.

మైలు దూరం వెళ్ళేసరికి వాన. బండి బురదలో దిగిపోయింది. అంతా సమీపంలోవున్న పాకలో కూర్చున్నారు.

చీకటిపడేసరికి తుప్ప ర లో కి దిగింది. బండి ఎలాగో బయలుదేరింది. ఏడున్నరకి చేరుకుంది.

విశాఖ బస్సు యింకా రాలేదు. కాఫీ హోటల్లో టిఫిన్‌చేసి సిగరెట్ వెలిగించుకున్నాడు. అప్పటికే చాలా దుకాణాలు వాన కారణంగా మూసివేశారు. కాఫీ హోటలు వరండాలో నలుగురైదుగురు ప్రయాణీకులు బాబాలగురించి గట్టిగా చర్చించుకుంటున్నారు.

అరగంట ఆలస్యంగా సూపర్ ఎక్స్‌ప్రెస్ వచ్చింది. బస్సుదగ్గరికి ఆయిదారుగురు పరుగెత్తారు. బస్సు నిండుగా వుంది

"ఒకటే ఖాళీ. విశాఖయితేనే ఎక్కగానే బస్సు బయలుదేరింది. టికెట్ తీసుకుని చివరికి వెళ్ళి కూర్చున్నాడు. మనస్సు సుఖాలమీద లేదు. ప్రొఫెసర్ కామరాజుగారి మీద వుంది. తను మెరిట్ స్టూడెంట్‌నని ఆయనకి అభిమానమే. ఫస్టియర్‌లోనే తను ఆయన్ని ఆకర్షించాడు. తన యింట్లో వుండమని అన్నారు కూడాను. ఇప్పుడు తను అడిగితే ఏమంటారో ? కామరాజు గారు కాదంటే......

తొలి వెలుగు వచ్చేసరికి కామరాజు గారింటి దగ్గర వున్నాడు రవి. పని మనిషి ముగ్గులు పెడతోంది.

పరిచితమైన రవిని చూసి "అయ్యగారు లేరు బాబూ" అంది. రవి నిరాశ పడ్డాడు.

"కాంచన ?"

"అమ్మాయిగారింకా లెగలేదు... చూడండి మేడమీద."

రవి పైకి వెళ్ళాడు. వరుసగా నాలుగు గదులున్నాయి. చివరిగది తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. రవి తోశాడు. ఫాను తిరుగుతోంది. కాంచన శాలువ కప్పుకుని గాఢనిద్రలో వుంది.

"కల్సుకునే వెళదాం ........."
వరండాలో రౌండ్ టేబిల్ చుట్టూ నాలుగు కుర్చీలున్నాయి. రవి అలసటగా కూర్చున్నాడు. నిద్ర పట్టేసింది.

వచ్చింది.

కాఫీతో కాంచన.

"గెస్టురూంలో పడుకోబోయారా ?" అంది కాఫీ త్రాగుతూ.

"అప్రయత్నంగా పట్టేసింది."

వాష్‌బేసిన్ దగ్గర ముఖం కడుక్కుని కాఫీ అందుకున్నాడు.

"కాలేజీ తెరిచి నాలుగురోజు లయింది. మీరు వచ్చారేమోనని విశ్వంని అడిగాను. కనబడలేదన్నాడు."

"నాన్నగారు లేరా ?"

"విజిటింగ్ ప్రొఫెసర్‌గా కెనడా వెళ్లారు."

"ష్" రవి నిట్టూర్పు విడిచాడు. దరిద్రుడు ఎక్కడికి వెళ్ళినా వడగళ్ల వానే. కామరాజుగారు ఆరు నెలలదాకా రాడు.

"నాన్నగారితో పని వుందా ?" కాంచన అడిగింది ముందుకు జరిగి.

రవి చెప్పేశాడు.

"అరె...దీనికి మీరింత సంకోచ పడటమెందుకు ? నాన్నగారు లేక పోయినా మీకేం లోటు రాదు. ఇవాళే కాలేజీలో చేరండి."

"కాంచనగారూ !"

"కాని ఒక్క షరతు."

"ఏమిటో చెప్పండి."

"నాన్నగారు వచ్చేదాకా మీ రిక్కడే నాకు."

"అలాగేనండి" రవికి ఎగిరి గంతె య్యాలని వుంది. తను ఎంతో బాధ పడిన సమస్య దూదిపింజలా ఎగిరి పోయింది.

"ఇవాళే నాన్నగారికి వుత్తరం రాస్తాను. మీకు సాయపడగలిగినందుకు ఆయన చాలా సంతోషిస్తారు" అంది కాంచన లేస్తూ.

* * *

రవి సాయంత్రం యూనివర్సిటీ నుంచి రాగానే లైబ్రరీనుంచి తెచ్చు కున్న రిఫరెన్స్ పుస్తకం చదువు కుంటున్నాడు.

"రవీ......" అరుస్తూ కాంచన వచ్చింది.

రవి గదినుంచి బయటికి వచ్చి ఆమె చేతిలోనుంచి టీ కప్పు అందుకుని "మీరు తేవాలా...నేనే వచ్చేవాడ్నిగా." నొచ్చుకున్నాడు.

"మీకు భౌతిక అవసరాలు గుర్తుంట వని నేనే తెచ్చాను. సరస్వతి గర్ల్ ఫ్రెండులా కూడా వుంటోందే ?"

రవి సిగ్గుపడ్డాడు. ఇరవై నాలుగు గంటలూ అతడికి పుస్తకాలే లోకం. అవకాశం కలిసివచ్చినందుకు పూర్తిగా వినియోగించుకోవాలని అతడి పట్టుదల.

(ముగింపు వచ్చే సంచికలో)




అనంతమ్మ తెలతెలవారుతుండగా లేచి, పెసరట్లు వేసి, వేడివేడిగా ఉండాలని పెనంమీదనే ఉంచి, కాఫీ డికాషన్ తీసి సిద్ధంగా ఉంచింది. అప్పటికి ఆరుగంటలు ఇంకా కొట్టలేదు. భర్త లక్ష్మయ్యను లేపి ముఖం కడుక్కోమని చెప్పింది. అప్పటి కది రెండోసారి కావటంవల్ల మాటలో కాస్త విసుగుదల ధ్వనించింది.

"ఏమిటా తొందర ?" అతడు ముసుగు తియ్యకుండానే దూకుడుగా ప్రశ్నించాడు.

"అమ్మాయి వచ్చేవేళ కాలేదటండీ ? ఆరుగంటలు దాటిపోయింది. అది వచ్చేదాకా ఇంకా ముసుగుపెట్టుకునే పడుకుంటారా ?"

"మనమ్మాయే కదుటే ? పెళ్ళివారొచ్చినంత తొందర చేసేస్తున్నావు ?"

"ఉత్తరం చదివింది మీరేగా ? అమ్మాయితోపాటు దాని స్నేహితురాలు వస్తోందని రాసిందిగా ?" అనంతమ్మ ఇల్లు నాల్గు మూలలా ఊడ్చింది. వాకిట

వెళ్ళి పొయ్యిమీద నీళ్ళకాగు పెట్టి మంటచేసింది.

మళ్ళీ వాకిట్లోకి వచ్చి చూసింది. లక్ష్మయ్య ఇంకా ముసుగు తియ్యలేదు.

"అయితే మీరు బస్సు దగ్గరికి వెళ్ళటం లేదన్నమాట !" అంటూ వంట యింట్లోకి వెళ్ళి పనిచూసుకోవటం మొదలెట్టింది.

"అది బస్సు దిగి రాలేదంటావా ?" లేచి కూర్చున్నాడు లక్ష్మయ్య.

"వస్తుందనుకోండి కానీ— వెంట స్నేహితురాలుందిగా ! సామాను మోయటాని కయినా మనిషిని మాట్లాడి తీసుకురావచ్చు. మీరు వెళ్ళితే మన వెంకడిని పంపిద్దామంటే పిల్లవాడికి జబ్బుగా ఉందని వైద్యుడి దగ్గరికి వెళ్ళాడట" లక్ష్మయ్యతో సూటిగా వెళ్ళమని చెప్పలేకపోతోంది అనంతమ్మ. అవసరాన్ని గ్రహించుకునేపాటి చురుకుదనమూ సమయస్ఫూర్తి అతడిలో లేవని బాధపడే అనంతమ్మ తన అవస్తంతా కూతు రెక్కడ కనిపెట్టేస్తుందో నని భయపడుతూ ఉంటుంది.

"రావే గంగా లోపలికి ! ఇదే మా యిల్లు. ఈ పల్లెటూళ్ళోకి ఇదే కాస్త ఇల్లనిపిస్తుంది." గలగల్లాడుతూ ఇందిర స్నేహితురాలి చెయ్యిపట్టుకొని లోపలికి తీసుకువచ్చింది.

"అప్పుడే బస్సు వచ్చిందటే ! ఇంకా నాన్న లేవనేలేదు. లేచి బస్సు దగ్గరికి వెళ్లమని చెబుతున్నాను." కూలివాడు తీసుకువచ్చిన సామాను ముందు గదిలో పెట్టించింది అనంతమ్మ.

"సరేలే. నాన్న లేచేవరకూ బస్సు రాకుండా ఉండాలంటావా ఏమిటి ? ఇక్కడికి తెల్లవార్లూ బస్సులో కూర్చుని నిద్రలేక ఎప్పుడు దిగుతామా అని మేము చూస్తుంటే ? అమ్మా, ఈ అమ్మాయి గంగ అని నా స్నేహితురాలు. మేము అక్కడ తినని వన్నీ నీవు చేసిపెట్టాలి మాకు. గంగా, ఈవిడ మా అమ్మ. నేను వచ్చినపుడు ఆవిడకు ఇరవైనాలుగు గంటలూ చాలవు. ఎప్పుడూ ఏదో ఒకటి చేసి తినేవరకూ చంపేస్తుంది. ఈ ఊరినుంచి నేను బయలుదేరిం తరువాత పదిరోజులపాటు అన్నం సరిగ్గా తినలేను. ఎందుకో తెలుసా ? అజీర్ణం !" పగలబడి నవ్వేసింది ఇందిర.

"నమస్కారమండి. ఇందిర ఇట్లాగే కబుర్లు చెప్పి అందరినీ నవ్విస్తూ ఉంటుందండీ." ఒక మూలకు చెప్పులు విడిచి గోడ కానుకుని నిలబడ్డది గంగ.

"రండమ్మా రండి. ముందు ముఖాలు కడుక్కోండి. కాఫీ అదీ తయారుగా ఉంది." వంటయింట్లో రెండు పీటలువేసి మంచినీళ్ళ గ్లాసులు పెట్టింది అనంతమ్మ. టిఫిను పెట్టటానికి పళ్లెలు తుడుస్తూ ఆయన ముఖం కడిగేడో. లేదో నని మనసులో అనుకుని హాల్లోకి వచ్చింది.

పెసరట్టు తుంచి నోట్లో వేసుకుంటూ మధ్య మధ్య కాఫీ చప్పరిస్తూ "అమ్మా, ఇంకా పదిరోజులయితే నేనే వచ్చేదాన్ని కదా. సెలవుల్లో అమరావతీ శిల్పాలు చూద్దామనుకున్నాం మేమందరంకలిసి. ఇంతలోకే తొందరగా బయలు దేరిరమ్మని ఎర్రసిరాతో ఉత్తరం! ఏదో కొంప మునిగిపోయిందనుకుని ఈ గంగను వెంబడేసుకుని వచ్చాను," ఇందిర తల్లి ముఖంలోకి చూసింది.

"ఆ సంగతి తరువాత మెల్లగా చెబుతాగాని ముందు కాఫీ టిఫిన్ తిని స్నానాలుచేసి కాసేపు పడుకోండి," కూరగాయలబుట్ట పెరటి వసారాలో పెట్టుకుని కత్తిపీటముందు కూర్చుంది అనంతమ్మ.

"అయితే కొంప మునిగిపోయే పని కాదన్నమాట. నా సరదా అంతా చంపేశావు. నా స్నేహితుల కెంత ఆశాభంగమయిందో తెలుసా? చూడు గంగా! ఈ పెద్దవాళ్లవల్ల వచ్చే పాట్లు ఒకటా రెండా?" విసుక్కుంది ఇందిర.

అంతలో లక్ష్మయ్య తువాలుతో ముఖం తుడుచుకుంటూ లోపలికి వచ్చాడు. ఆయనను చూడగానే లేచి కాఫీ టిఫిన్ చేతికిచ్చింది అనంతమ్మ.

"ఏమిటి నాన్నా నువ్వు కూడా అమ్మలాగ తొందరపడతావు? ఎందుకా అర్జంటంటూ కార్డు వ్రాశావు? నా ప్రోగ్రామంతా పాడుచేశా రిద్దరూ కలిసి. ఎందుకు రాశావు? ఏమిటి సంగతి?" తండ్రిని నిలదీసింది ఇందిర.

"మీరిద్దరూ స్థిమితంగా కాఫీ టిఫిన్ తీసుకోండి. నీకంతా వివరంగా చెబుతాలే. అందరం కూర్చుని మాట్లాడుకుందాము. ఆ అమ్మాయి కొత్తపిల్ల కదా. సరిగా టిఫిన్ తిననివ్వకుండా తొందరపెట్టకు." తండ్రి హాల్లోకి వెళ్ళాడు.

గంగకు వీళ్ల సంభాషణలవల్ల అనేకంగా ఆలోచనలు కలుగుతున్నాయి, ఇందిరకు పెళ్ళి చూపులా? లేక ఇందిరకు ఇదివరకే పెళ్ళిఅయి భర్త తీసుకు వెళ్లటానికి వస్తున్నాడా? ఏమిటి వీళ్ల అంతర్యం?

ఇందిరలో చిలిపితన మెక్కువ. హాస్యం అధికం. వ్యంగం మోతాదు మీరి ఉంటుంది. ఎంత తనతో కలిసి తిరిగేవాళ్లకయినా తన మనసు తెలియ నివ్వదు. కాని ఎదటివారిచేతనే వాళ్ల మనసులోని మాట చెప్పించి పూర్తిగా చేస్తుంది.

"అమ్మాయీ స్నానం చేస్తావా ? వేడి నీళ్ళు పెట్టించాను," అనంతమ్మ కూరగాయలు తరుగుతునే అడిగింది.

"అబ్బ ! నీళ్లకు కూడా తొందర పెట్టేస్తావు కాస్తాగు. ఇంతలో సునందను ఒకసారి చూసివస్తాను," చెప్పులుతేసుకుని గబగబా బయటికి వచ్చింది ఇందిర.

"ఇందిరా అగు ! సునంద ఊళ్ళోలేదు. పెళ్ళిచూపులకని వాళ్ల మామయ్య తిరుపతి తీసుకువెళ్ళాడు. అక్కడ ఒకటి రెండు సంబంధా లున్నాయట. చూపించి నిశ్చయం చేస్తారట," కత్తిపీట మడిచి ఒక మూలకు పెట్టి లేచింది అనంతమ్మ.

హాల్లో నిలబడ్డ గంగ ఇందిర ముఖంలోకి చూస్తోంది. లక్ష్మయ్య పొగాకు కాడలతో చుట్ట చుట్టుకుంటున్నాడు.

"అయితే గంగా ! నీవు స్నానం చెయ్యి ముందు" గంగను నీళ్లగదిలోకి పంపించి తల్లి దగ్గరి కొచ్చింది ఇందిర. తల్లీ తండ్రీ నిదానంగా వాళ్ల పనులు వాళ్ళు చేసుకుంటూ తన నెందుకు పిలిపించారో చెప్పడం లేదని ఇందిరకు చిర్రెత్తుకొస్తోంది.

"అమ్మా ! ఏమిటని ఇంతగా మొత్తుకుంటుంటే ఒక్కరయినా అసలు సంగతి చెప్పరేం ?" రెండు చేతులతో తలమీద కొట్టుకుంది ఇందిర.

"ఇందూ ! తొందరపడకు. నిదానంగా మధ్యాహ్నం చెబుతాను. భోజనాలు చేసి కాసేపు పడుకోండి. రాత్రంతా బస్సు ప్రయాణం కుదుపూ."

"సర్లే. ఆ చెప్పేదేదో ఇప్పుడు చెప్పగూడదూ ? చావు కబురు చల్లగా ఎప్పుడో చెప్పకపోతే ?" పళ్ళు కొరుక్కుంది ఇందిర.

అనంతమ్మ వినిపించుకోకుండా పెరట్లోకి వెళ్ళిపోయింది. లక్ష్మయ్య చుట్ట కాలుస్తూ వీధి అరుగుమీద కూర్చున్నాడు. చుట్ట పొగ అంటే ఇందిరకు గిట్టదు. అందుకని లక్ష్మయ్య చుట్ట తాగేటప్పుడు ఎంత అవసరమున్నా మాట్లాడదు.

విసుక్కుంటూ ఇందిర గదిలోకివెళ్ళి పెట్టెతెరచి బట్టలు బైటకు తీసుకుంది. గంగ నీళ్ల గదిలోనుంచి బైటకి రాగానే తాను బట్టలు తీసుకుని లోపలికివెళ్ళింది.

గంగ ఆలోచనలు ఇంకా సాగుతూనే ఉన్నాయి. ముప్పై ఏళ్ళు దాటిన ఇందిరకు ఈ పల్లెటూరి వాళ్ళు ఇంకా పెళ్ళిచేయకుండానే ఉన్నారా ? ఎందుకు?

ఇందిరలో ఎవరయినా మొదటిచూపులోనే మెచ్చి పెళ్ళిచేసుకునే అంత ఆకర్షణ ఉంది. చామనఛాయ అయినా కనుముక్కుతీరు బాగుంది. అవయవాలు పొందికగా అమర్చినట్లున్నాయి. చురుకైన కళ్ళు, చాకులాంటి పిల్ల. చాలామంది మెచ్చే బారెడు జడ. ఆమె ఆలోచనలు ఒకతీరానికి చేరటానికి అవకాశం యివ్వటంలేదు ఇందిర. గబగబా నీళ్ళగదిలోనుంచి చీర చుట్టుకుని వస్తూ "గంగా ! నీకు కనక నిద్ర రాకపోతే కాలవఒడ్డుకు వెళ్ళి కాసేపు కూర్చుని వద్దాం రా. ఎండెక్కినా వెచ్చ వెచ్చగా బాగుంటుందిలే." తొందరపెట్టేసింది. ఇద్దరూ గబగబా జడ అల్లుకున్నారు. ముఖాలకు పౌడ రద్దుకుని తిలకం దిద్దుకున్నారు. చెప్పులు వేసుకుని బయలుదేరారు.

"చాలా దూరమా కాలవ ?" అడిగింది గంగ.

"అంటే ఒక అరమైలు ఉంటుంది. నడవలేవా !" అడిగింది ఇందిర.

"నేను నడవలేనని కాదు. ఎంత దూరమని అడిగాను, అంతే." ఇందిర వెనక నడిచింది గంగ.

వాళ్ళు అవతలికి వెళ్ళగా చూసి లక్ష్మయ్య లోపలికి వచ్చి భార్య ముఖంలోకి చూశాడు.

ఆమె కళ్ళు పెద్దవిచేసుకుని సాలోచనగా అతడినే చూస్తోంది. "ఎట్లా నచ్చచెబుతావో నీ కూతురికి !" అన్నాడు లక్ష్మయ్య.

"అది నా కూతురా ? ముమ్మూర్తులా మీ కూతురే ! మీరే చెప్పాలి."

"నా కూతురు కనకనే నేను చెప్పలేను. నా మాట కెదురుతిరిగితే తందా మనిపిస్తుంది. మెల్లగా నీవే చెప్పి వినిపించాలి."

"నాచేతనేమవుతుంది ? ఆ మాటే దాని ముందర ఎత్తలేకపోతుందే ?"

"మనిద్దరిలో ఎవరో ఒకరు చెప్పక తప్పదు. నీవు దగ్గర కూర్చోబెట్టుకొని సాధకబాధకాలు చెప్పి ఒప్పించు."

"ఆ బాధ్యత కూడా నా మీదే పెట్టండి. మొత్తానికి తండ్రీ కూతుళ్లు నన్ను ఇరుకున పెట్టాలని చూస్తారు."

"అమ్మాయి వస్తుంది. జాగ్రత్తగా ఆలోచించుకో. అవును గానీ - ఆ పిల్ల నొకదాన్ని తీసుకువచ్చింది ఎందుకు, మనం స్వేచ్ఛగా మాట్లాడుకోవ టానికి వీలు లేకుండా ?" కనుబొమ్మలు ముడిచాడు లక్ష్మయ్య.




"నాన్నా ! ఈ ఊళ్ళో కాలవగట్టున శవాలను కాలుస్తారా ? మేము వెళ్లే టప్పటికి ఒక శవాన్ని అటు తీసుకువెళ్తున్నారు. ఇంకెందుకని వచ్చేశాం" దూకుడుగా లోపలికి వచ్చి చెప్పులు విడిచి మంచం మీద వాలింది ఇందిర.

* * *

పగలంతా బింకంగా నిద్రపోకుండా కూర్చున్న గంగాఇందిరలకు అనంతమ్మ రాత్రి ఎనిమిది గంటలు కాగానే వేపుడుకూరతో అన్నం పెట్టేసరికి నిద్ర ముంచుకు వచ్చింది. ఇద్దరూ కాసేపట్లో నిద్రలోకి జారుకున్నారు.

అనంతమ్మ భోజనం చేసి తన మంచం మధ్యహాలులో వేసుకుంది. భోజనాలు కాగానే మళ్ళీ లక్ష్మయ్య అనంతమ్మను కదిలించాడు.

"ఏమని చెప్పనండీ దానితో ? పోనీ ఒక పనిచేస్తే ? దానితో చెప్పకుండానే అతడిని పిలిచి కాఫీ టిఫిన్ ఇద్దాము. పెళ్ళిమాట ఎత్తకుండా ఒకరినొకరు చూసుకుంటారు. తరువాత మెల్లగా నచ్చాడా అని అడుగుదాము. ఏమంటారు ?" తనిచ్చిన సూచన ఆయనకు తప్పకుండా నచ్చి తీరుతుందని ఆశపడ్డది.

"అయ్యో పిచ్చిదానా ! అదంత తెలివితక్కువదా ? ఎం.యస్సీ ప్యాసయి ట్రైనింగయి కాలేజీలో లెక్చరరు పనిచేస్తోంది. అది చిన్నపిల్లా ? నీ కాకమ్మ పిచ్చికమ్మ కథలు నమ్మటానికి ?"

ఎ౯న యిచ్చిందిఁ

"దాని స్నేహితురాలు గంగ ఉంది చూశావా ? కాస్త నెమ్మదిగా కనబడు తోంది. ఆ అమ్మాయి చెబితే మన పిల్ల వింటుందేమో చూద్దాం. ఆ అమ్మాయికి సంగతంతా చెప్పి నచ్చచెప్పమని అడుగుదాం."

"అది ఏ స్నేహితురాలికీ లొంగే ఘటం కాదు" కచ్చితంగా తన మనసులో ఉన్నమాట వెళ్లగక్కింది అనంతమ్మ.

"అయితే నన్నేం చెయ్యమంటావు ?" కాస్త బిగ్గరగానే విసుగ్గా అన్నాడు.

గంగకు మెలకువ వచ్చింది. దాహంగా ఉంది. అనంతమ్మ తమ మంచాల దగ్గర మంచినీళ్ళ చెంబుపెట్టటం మరిచిపోయింది. గొంతు తడి ఆరిపోతోంది. పెదవులు ఎండి పోతున్నాయి. లేచి వెళ్ళి అడిగితే తమ మాటలు విన్నదేమో. నని బాధపడతారు. ఎట్లా ?

మంచమ్మీదనే అటూ ఇటూ మసులుతున్నది.

అంతలోకే మళ్ళీ ఆలోచనలు. ఇందిరంటే తల్లిదండ్రులకు ఎంత భయమో ! వాళ్ల నేదో సమస్య పీడిస్తున్నది. అది ఇందిర పెళ్ళి సమస్యే కాని అంత భయమెందుకు ! ఇందిర అంత మొండిదా ? లేచి దీపం వెలిగించింది మంచినీళ్ల ప్రయత్నంలో.

చటుక్కున మంచంమీద కూర్చున్నవాడల్లా లక్ష్మయ్య తన గదిలోకి వెళ్ళాడు. అనంతమ్మ లేచి గదిలోకి వస్తూ "అమ్మాయ్ ఏం కావాలమ్మా ?" అడిగింది.

"మంచినీళ్ళండి."

"అయ్యో ! మర్చిపోయాను కాబోలు ! తీసుకో అమ్మా. మీకని తెచ్చిన మంచినీళ్ళ చెంబు ఈ కిటికీలో పెట్టాను." గ్లాసులోకి ఒంపి ఇచ్చింది.

తాగి గ్లాసు కడిగి ఆమె కిచ్చివేస్తూ "ఇంకా పడుకోలేదండి !" అన్నది ఆవలిస్తూ గంగ.

"లేదమ్మా, త్వరగా నిద్రపట్టదు నాకు. అందులో పెద్దతనం వస్తోంది. ఏవేవో మనసులో కలతలు రేగుతూ ఉంటాయి" అన్నది ఉపోద్ఘాతంగా.

"ఒక్క అమ్మాయి. చీకూచింతా లేకుండా బాగా చదువుకుని ఉద్యోగం చేసుకుంటోంది. చాలా తెలివిగలది. లోకాన్ని జయించుకు రాగల శక్తివంతురాలు. మీకా-ఇంట్లో ఏ లోటూ లేదు. ఎందుకండీ దిగులు ! అదంతా మాబోటి వాళ్ళకు" గంగ ఆశగా ఆమె ముఖంలోకి చూసింది. ఆమెకు ఇందిర చూడ

కుండా తన మనసులోని వ్యధను అనంతమ్మతో చెప్పాలని ఉన్నది. ఆమె సహాయం కోరాలని ఉంది. అందుకే ఇందిర అడగగానే ఒప్పుకుని ఇంత దూరం వచ్చింది. ఇందిర తనకు స్నేహితురాలేగాని – మానవుడిలోని బలహీనతను క్షమించదు.

అనంతమ్మ దీర్ఘంగా శ్వాస విడిచింది. కాసేపటిలో ఒక్క ముక్కలో తన గోడు ఆ చిన్న పిల్లకు ఏం చెప్పుకుంటుంది ?

"పిన్నిగారూ ! మీరు నాకొక సహాయం చెయ్యాలి. నాకు మీకంటే ఆప్తులు లేరు. పెద్దదిక్కు అంతకంటే లేదు. మీరే నన్ను ఒక దరికి చేర్చాలి." అనంతమ్మ రెండు చేతులూ పట్టుకుంది గంగ.

అనంతమ్మ నివ్వెరపోయింది. ఈ పిల్ల ఇంత ఇదిగా వేడుకుంటోంది. ఇదేం సంగతో ? దీని కెన్ని సమస్య లొచ్చిపడ్డాయో ? ఏమిటో ఆడపిల్లలు ? ఆమె చేతులు గంగ తలను నిమిరాయి. వెన్ను తట్టాయి. కళ్ళు ప్రశ్నించాయి.

"పిన్నిగారూ ! ఇందిరకు చెప్పకండి. చెబితే నన్ను మనిషిలా చూడదు. నా చేతిలో చెయ్యి వెయ్యండి" గంగ అనంతమ్మ ఎదలో తల దూర్చింది.

"చెప్పు తల్లీ ! నే నెవరికీ చెప్పను. ఏమిటి నీ బాధ ! ముందు చెప్పు – అసలు నీకు పెళ్ళైందా ! నీ వేం చేస్తున్నావు ? మా ఇందిర ఎన్నాళ్లనుంచీ తెలుసు ?" తలవెంట్రుకలు సవరించి కళ్ళు తుడిచింది.

"నేను ఇందిరతో కూడా పనిచేస్తున్నానండి. ఇద్దరం మంచి స్నేహితులం. అయినా ఇందిరంటే నాకు భయమండి. మనసులో మాట చెప్పలేనండి."

"మేమూ అంతేనమ్మా" అని అనబోయింది అనంతమ్మ. కాని మాట పైకి రాలేదు.

"నీకు పెళ్లయిందా ? ముందీ మాట చెప్పు ?" అనంతమ్మ గంగను మంచ మ్మీద కూర్చోబెట్టింది.

"అయింది" గంగ తలవంచుకుంది.

"ఎక్కడున్నాడు ?"

"ఉన్నాడు. నేను ఉన్న ఊళ్లోనే ఉన్నాడు."

"ఉద్యోగమా ?"

"ఒకప్పుడు ఉండేది. కాని ఇప్పుడు లేదు.

"ఏం జరిగింది చెప్పు ? మీ రిద్దరూ ఒక ఊళ్లోనే ఎందుకు విడిగా ఉన్నారు ?"

"నీకేం భయంలేదు. చెప్పు. ఇందిర నిద్రపోయిందంటే మధ్యలో లేవదు. మెల్లగా భయపడకుండా చెప్పు."

"మా నాన్న నాకు పెళ్ళిచేసేటప్పుడు పదహారేళ్లండి. మా సవతితల్లి నన్ను వదిలించుకోవటానికి తొందరగా పెళ్ళిచెయ్యమని నాన్నను కోరుతూ ఉండేది. బి.ఏ చదివి టైపిస్టుగా పనిచేస్తున్న ఒక అబ్బాయిని వెదికి తీసుకు వచ్చాడు నాన్న. మా పిన్నికి తెలియకుండా నాలుగువేలు కట్నమిచ్చాడు, పెళ్ళి చేశాడు. అతడు తల్లిదండ్రులు లేనివాడు. ఇల్లుచూసుకుని నన్ను తీసుకువెళ్తానని ఉత్తరాలు రాస్తూ ఏడాది గడిపాడు. మా పిన్నికి విసుగు పుడుతోంది. నాన్న మాట్లాడడు. నాకా ఇంట్లో చాకిరీ ఎక్కువైంది. బాధలు ఎక్కువైనాయి మెట్రిక్ పరీక్షకు చదువుతున్నాను. నన్ను సరిగ్గా చదువుకో నివ్వదు పిన్ని. ఒకనాడు నాన్న నన్ను తీసుకువెళ్లి ఆయన దగ్గర దింపి వచ్చాడు."

తలవంచుకుని తన సంగతి చెబుతున్న గంగ ముఖం అనంతమ్మకు సరిగ్గా కనబడటంలేదు. కాని కన్నీళ్లు కారుస్తున్నట్టు లేదు. విషాదమంతా గూడుకట్టు కున్నట్టుంది కంఠధ్వని.

"నిన్ను బాగా చూడలేదా ? బాధించాడా ?" ఆమె ధోరణిచూసి అటువంటి వాడై ఉంటాడనుకుంది అనంతమ్మ.

తల అడ్డంగా తిప్పింది గంగ.

"మరేమిటి ? మంచివాడు కాదా ?"

"ఇంటికి పిలవకుండా వచ్చినదాన్ని అన్నము తినమని అయినా అనకుండా పదిహేను రోజులు గడిపాడు. పదహారో రోజున నా చేతిలో ఒక సర్టిఫికెటు పెట్టి టికెట్టు కొని రైలెక్కించాడు."

అనంతమ్మకు సర్టిఫికెటు అంటే అర్థంకాలేదు. రైలు ఎక్కించదలచుకున్న వాడు సర్టిఫికెటు చేతిలో పెట్టటమేమిటి ? సర్టిఫికెటు దేనికి ?

"ఏమిటమ్మా అది ? ఒక వేళ నీకు ఉద్యోగంకోసం తెప్పించాడేమో కదూ సర్టిఫికెటూ ? అంతేనా ? తన దగ్గర ఉంచుకోలేకపోయినా నీకో ఉద్యోగం ఇప్పిద్దామనుకున్నాడేమో !"

"అయ్యో ! పిన్నిగారూ ! అది ఉద్యోగంకోసం ఇచ్చిన సర్టిఫికెట్ కాదు. నేను ఆడపిల్లను కానని ఒక డాక్టరుచేత ఇప్పించిన సర్టిఫికెట్ అది."

గుండె ఝల్లుమన్నది అనంతమ్మకు. పిల్ల పైకి చూడటానికి బాగాన ఉందె ! అయినా ఏదో అనుమానం పీడించింది.

"నిన్ను డాక్టరు దగ్గరికి తీసుకువెళ్ళాడా ?"

"లేదండి. నాతో మాట్లాడలేదు. నన్ను ఎక్కడికీ తీసుకువెళ్ళలేదు."

"మరి నీవు మీ పిన్నిదగ్గరికి వెళ్ళి ఈ సంగతి చెప్పావా ? మీ నాన్న ఏమన్నాడు ?" ఆలోచన సాగక ఏదో ప్రశ్నించింది అనంతమ్మ.

"పిన్ని పెట్టిన బాధలకు మళ్ళీ ఆ యింటికి వెళ్తానా పిన్నిగారూ? నాన్న ఉన్నా ఆమె చెప్పినట్టు వింటేనే ఆయనకు తెల్లవారేది. నేను తిన్నగా మా స్కూలు టీచరు హైమావతిగారింటికి వెళ్ళి సంగతంతా చెప్పాను. ఆమె మా పెళ్ళి-కాపురం విషయాలలో జోక్యం కలిగించుకోలేదు. కాని తనకు ఇంట్లో సహాయం చేస్తే చదువు చెప్పిస్తానంది. దానికే సంతోషించి ఆమెకూ ఆమె పిల్లలకూ చాకిరీ చేసి చదువుకున్నాను. ఆమె నాకు ఉద్యోగం కూడా ఇప్పించింది. కన్నతల్లిని నేను కంటితో చూడలేదు కాని హైమవతిగారు తల్లికంటె ఎక్కువగా కాపాడి నన్ను ఇంతవరకూ తీసుకువచ్చారు," కథ అంతటితో అయిపోలేదన్నట్టుగా ఆగింది గంగ.

"పోనీలే. సంపాదించుకుంటున్నావు. నీ కాళ్ళమీద నీవు నిలబడ్డావు. నీ తండ్రికి ఈ సంగతి తెలిసిందా !"

"తెలిసిందో లేదో తెలియదు. నాకు అప్పుడప్పుడు ఆయనమీద ప్రాణం కొట్టుకుపోతుంది. కాని ఆయనది అసహాయస్థితి. ఆయనను నేను నిందించను. నా మనసును గట్టిచేసుకున్నాను. బంధాలను తెంచుకున్నాను."

మరిప్పు డేమిటి అన్నట్టు చూసింది అనంతమ్మ.

"ఇప్పుడు నా కొచ్చిన సమస్య ఏమిటంటే మాతో పనిచేసే లెక్చరరు రమణమూర్తి నన్ను వేధిస్తున్నాడు తనను పెళ్ళిచేసుకోమని."

వింతగా గంగ ముఖంలోకి చూసింది అనంతమ్మ. గంగ పెనిమిటి ఇచ్చిన సర్టిఫికెట్ ఆమెకు తటాలున స్ఫురించింది. "అమ్మాయీ ! నీవు మొదట భంగపడ్డావు. ఇప్పడల్లా కాకుండా ఇతడకి మొట్టమొదలే నీ సంగతి చెప్పి దూరంగా ఉంచు" అన్నది సాలోచనగా.

"అలా కాలేదండి. అతడికి భార్య లేదు. నలుగురు పిల్లలు. తనను వివాహం చేసుకోమని అడగకుండా - ముందు స్నేహంగా ఉంటూ వచ్చాడు. తన యింటికి ఆహ్వానించేవాడు. తన పరిస్థితులను జాలిగొలుపుతూ చెప్పే

వాడు. తన జీవితం తెరచాప లేని నావలా ఉందని బాధపడేవాడు. నాకు ఆయనమీద జాలి అనండి - ఒక విధంగా ప్రేమకలిగిం దనండి - ఏదయితే నేమి అతడికి పెళ్ళి చేసుకుంటానని మాట ఇచ్చాను. పెళ్ళి రిజిస్టరయింది. పెళ్లయిన తర్వాత ప్రేమగానే చూశాడు. నేనూ అతనిపట్ల ప్రేమతోనే మెలిగాను. అతడి పిల్లలను బాగా నాలుగేళ్ళపాటు సంరక్షణ చేశాను. నాకు నాలుగు నెలల గర్భము. సరిగ్గా ఈ సమయంలో ఆ మొదటి ఆయన నే నెక్కడ ఉన్నానో తెలుసుకుని ఈయనకు ఉత్తరం రాశాడు. మా కిద్దరికీ మొదట పెళ్ళిఅయినట్టూ నేను ఇష్టంలేక వచ్చేసినట్టూ కల్పనచేసి రాశాడు పెద్ద ఉత్తరం. ఈయన నేను తనను మోసంచేసినట్టు అర్థంచేసుకుని ఇంట్లో నుంచి వెళ్ళిపొమ్మన్నాడు. ఇంటి నుంచి వచ్చేశాను. హాస్టల్లో ఉంటున్నాను." ఆయాసం తీర్చుకోవటానికి కొంతసేపు ఆగింది గంగ.

"అయితే అప్పుడిచ్చిన సర్టిఫికెట్ అబద్ధపుది అన్నమాటేగా ?"

"అవును. అప్పు డల్లా ఎందుకు జరిగిందంటే ఆయనకు ఇంకో భార్య ఉన్నది. ఆమె కాన్పుకు పుట్టింటికి వెళ్ళింది. ఆయనకు జీతంచాలక చేసిన అప్పు పెరిగింది. పిన్ని ఎవరికయినాసరే పెళ్ళిచేసి పంపించాలన్న ధోరణిలో తొందరపడి, కుటుంబాన్ని గురించి సరిగా విచారించలేదు. నాన్న రహస్యంగా ఇచ్చిన కట్నము అతడికి అప్పులు తీర్చుకోటానికి ఉపయోగపడ్డది. ఇప్పు డతడికి భార్య చనిపోయింది. అందుకు నేను జ్ఞాపకం వచ్చాను. ఆరా తీసి భయపెడుతూ ఉత్తరం రాశాడు. నేను వెళ్ళితే నన్ను భార్యగా ఆదరించడు గాని - తన పిల్లలకు చాకిరీ చెయ్యటానికి ఉపయోగించుకుంటాడు." ఇంత సేపూ రాని కన్నీళ్ళు ఇప్పుడు వచ్చాయి గంగకు.

"దేనికమ్మా కన్నీళ్ళు ? అప్పటినుంచీ ధైర్యంగా ఉన్నట్టు కనబడ్డావు ?" వెన్నుమీద చెయ్యివేసి నిమిరింది అనంతమ్మ.

"కన్నీళ్ళు కాకేమిటి పిన్నిగారూ ! రెండవసారి చేసుకున్న ఆయన నేను మోసగించానని పొమ్మన్నాడు. మొదటి ఆయన 'తాళి కట్టాను కదా ఇంటికి వచ్చి చాకిరీ చెయ్యి అంటున్నాడు. ఈ స్థితిలో నేను నాలుగు నెలల గర్భవతిని" నొసట కొట్టుకుంది గంగ.

ఆమె చేతులు పట్టుకుంది అనంతమ్మ. "వాళ్లు ఏం చేస్తే ఏమి ? చక్కగా పండంటి బిడ్డతో నీ జీవితంలో సుఖించు" అన్నది.

"సుఖమా ? నాకా ? పిన్నిగారూ ! అదెట్లా ఉంటుందో నేను ఇంతవరకూ



చవిమాడలేదు. మొదటి ఆయన నామీద కక్షకట్టాడు. బజారుకు ఈడుస్తా నంటున్నాడు. నా బ్రతుకు ...... నా బ్రతుకు ...... బండలై పోయింది" కన్నీళ్ళు జాలువారాయి గంగకు.

"కడుపుతో ఉన్న పిల్ల కన్నీళ్లు కార్చకూడదు. నీ వేం చేయాలను కుంటున్నావు ?"

"నేను ఇటువంటి మనుషులతో వేగలేను. నేను రామకృష్ణ మఠంలో చేరిపోతాను."

"మరి బిడ్డ ?"

"మీరు అనుమతిస్తే మీ యింట్లోఉండి పురుడుపోసుకుని బిడ్డను మీ కిచ్చేసి వెళ్లిపోతాను."

ఆమె ఆలోచనకూ తల పెట్టిన అఘాయిత్యానికీ అనంతమ్మ కొంచెం ఉద్రిక్తురాలయింది. తరువాత సర్దుకుంది గంగ ముఖం చూసి.

"తొందరపడకు తల్లీ. ఇది చాలా పెద్ద సమస్య. నీకే కాదు—మాకు కూడా."

"నేను అందుకు తగిన డబ్బు ఇస్తాను పిన్నిగారూ ! బిడ్డ పెరిగేవరకూ అయే ఖర్చు ఇస్తాను." అభ్యర్థనగా ముఖం అదోలా పెట్టింది.

"ఇస్తావు. బాగానే ఉంది. కాని ఈ బిడ్డ ఎవరి బిడ్డగా నేను పెంచాలి ? నా పరిస్థితులు వింటే నీ గుండె కూడా అదిరిపోతుంది. ఈ పరిస్థితులలో నేను ఒక పసిబిడ్డను పెంచుతుంటే అందరూ ఏమనుకుంటారో తెలుసా ? ఇందిర

రహస్యంగా కన్న బిడ్డ అంటారు."

"ఇందిర కింకా పెళ్ళి కాలేదుగా పిన్నిగారూ ?"

"కానట్టే ఉందనుకో. పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాం గదా ?"

"అందుకేనా పిన్నిగారూ ఆమెను అర్జంటుగా పిలిపించింది ?"

"అవును. కాస్త నీవు అందుకు సహాయం చేయాలి."

"చెప్పండి పిన్నిగారూ ! నా చేతనైనంత సహాయం చేస్తాను. చెప్పండి." కళ్లు తుడుచుకుని సంతోషంతో అడిగింది గంగ.

"చెప్తాలే. తెల్లవారనీ. నీవు వెళ్ళి నీ పక్కమీద పడుకో." దీపం ఆర్పేసి మంచినీళ్లు తాగి మంచమ్మీద వాలింది అనంతమ్మ.

లక్ష్మయ్య గురక వినబడుతూనే ఉన్నది. గంగ ఆలోచనలు ఒక మలుపుకు తిరగబోతున్నాయి అనంతమ్మకే కళ్లు మూతపడలేదు.

* * *

మధ్యాహ్నం నుంచి అనంతమ్మ పొయ్యిదగ్గరే కూర్చుంది. కారప్పూస దూసింది. స్వీట్ చేసింది. చిక్కటి కాఫీ డికాక్షను తీసింది. ఐదింటికల్లా హాల్లో సామానంతా తీసి శుభ్రంగా ఊడ్చి జంపఖానా పరిచింది. వంటయింట్లో టిఫిన్ ప్లేట్లూ మంచినీళ్ళ గ్లాసులూ కడిగి పెట్టుకుంది.

పొద్దున గంగా ఇందిరలు స్నానాలు చేసి పదకొండింటికి భోజనాలు కాగానే "అమ్మా ! గంగకు మన ఊరూ, ఆ పొలాలు చూపించి వస్తాను. ఇంట్లో కూర్చుంటే విసుగ్గా ఉంది. నిన్న బయలుదేరగానే శవ మెదురు వచ్చింది." అన్నది చెప్పులు వేసుకుంటూ ఇందిర.

"వెళ్ళండి. కాని తొందరగా రండి."

"ఎందుకు ? ఏదయినా పనుందా చెప్పు ?" తల్లి కెదురుగా వచ్చి నిలబడ్డది

"ఏంలేదులే. ఊరికే బయట తిరగటమెందుకని అలా అన్నాను." అంటూ వెనక్కి తిరిగింది అనంతమ్మ.

"పనేం లేదుకదా !" నవ్వుకుంటూ వెళ్ళి గంగ చెయ్యి పట్టుకుని గబగబా అడుగులు వేసుకుంటూ గడప దాటింది ఇందిర.

ఊరి బయట ఒక కాలువ ఉంది. దానిలో ఎప్పుడూ నీరుండదు. ఇసక ఎర్రగా ఉంటుంది. చలమలు తీసి మంచి నీళ్లు బిందెల్లో నింపుకుంటారు గ్రామస్తులు. వర్షాకాలంలో నీళ్లు వస్తాయి. అప్పుడప్పుడు ఒడ్డు లొరుసుకుంటూ నీళ్లు ప్రవహిస్తాయి. కాలవ ఒడ్డున అక్కడొకటి అక్కడొకటి పెద్ద మాను

కట్టిన చెట్లున్నాయి. ఒకటి రెండు చెట్లకు వేళ్లు బైటపడి కూర్చోటానికి బెంచీల్లా ఉంటాయి. వాటిమీద కూర్చున్నా రిద్దరూ. చిన్నతనం కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ కాళ్లూపుతూ కూర్చున్నారు.

గంగ కేదో ఇందిరకు చెప్పాలని మనసు ఆరాటపడుతుంది.

ఇందిరకు గంగకు ఏదేదో చెప్పి తన బరువు తగ్గించుకోవాలని ఉంది.

కాని ఇద్దరికీ ఎలా వ్యక్తంచేయాలో తెలియక అర్థంలేకుండా నవ్వుకుని కాలేజి కబుర్లలోకి వచ్చారు.

"అచ్యుతరామ్‌తో సినిమాకు వెళ్లావట రెండుసార్లు? నన్ను రమ్మంటే నేను వచ్చేదాన్నిగా?" సన్నటి ఈనెపుల్ల నోట్లో పెట్టుకుని వేళ్లతో తుంచు తోంది ఇందిర.

పగలబడి నవ్వింది గంగ. "నీతో సినిమాకు వెళ్లటానికి నా కేమభ్యంతరం? కాని–అతడు నన్ను ఎందుకు బలవంతంచేసి సినిమాకు తీసుకువెళ్ళాడో తెలుసా? పెళ్ళి మాటలకు–పెళ్ళి మాటలకు!" మళ్ళీ నవ్వింది కడుపు పట్టుకుని గంగ.

"పెళ్లేమిటి? తనకా? నీ తోనా?" నోరు తెరిచింది ఇందిర.

"అలా అతడిని ఎగతాళి చేయటానికి మనకేం అధికారం ఉంది? తలమీది వెంట్రుకలు రాలిపోయినంత మాత్రాన నవ్వటమేనా?" గంభీరంగా ఉంది గంగ ముఖం.

"పళ్లు జారిపోవటం-నలభై ఏళ్లు ఒంటిమీదికి రావటం-వాటి సంగతి?"

"అవి కూడా నిజమే. అవన్నీ అలా ఉంటే ఏం? అతడికి ఆశలు ఉండ కూడదా? అమ్మాయిలను అడిగి చూడాలనిపించటం తప్పా?" గంగ ముఖం అదోలా పెట్టింది.

"అయితే ఒప్పుకున్నా వన్నమాట? ఆ సంగతి నాకు మొదలే చెబితే ఎగతాళి చెయ్యనుగా?"

"నా మాటల్లో ఒప్పుకున్నానన్న అర్థంఉందా? లేదు, ఒప్పుకోవటం ఒప్పు కోకపోవటం నా యిష్టంలో ఉన్నది. కాని అతడికి అడిగే అధికారం ఉందని అంటున్నాను."

"అలాగా! అయితే నిన్ను అడిగాడన్నమాట! అడిగి ఊరుకున్నాడా? ఒప్పుకోమని బలవంతం చేశాడా?"

"నేను కోపగించుకోనని మాట ఇచ్చిన తరువాతనే అడిగాడు. బాగా

ఆలోచించుకో మన్నాడు. నా ఆలోచనకు ఏడాది టైము కూడా ఇచ్చాడు."

"అయితే నీవు ఇంకా ఒప్పుకోలేదా? మనలో మాట-నీ మనసేమంటోంది?"

"నా మనసా? తొందరపడకు. నిదానించు అంటోంది."

"నా దొక చిన్న సలహా. వింటావా?"

"నీ మాజా-నీ సలహా వినకపోతే నాకు భూమిమీద నూకలు చెల్లించేస్తావు. చెప్పు?"

"అతడు కాకపోతే మరెవరయినా అన్ని విధాలా నీకు నచ్చినవాడు దొరికితే ఇప్పుడే చేసేసుకో. ఇంకా వయసు పెరిగినకొద్దీ ఎవడో ఒకడని కక్కుర్తి పడాల్సి వస్తుంది. పెళ్ళాం పిల్లలున్నవాళ్ళనూ పిల్లలుండి భార్యలేనివాళ్లనూ, డబ్బుండి వయసుమళ్ళినవాళ్ళనూ ఏరుకోవలసి వస్తుంది నీ వయసిప్పుడు పెళ్ళికి సరిగ్గా తగిన వయసనుకో. ఈ మిసమిసలమీద మంచి సంబంధాలు వస్తాయి. అందులో సంపాదనపరురాలవు కూడాను."

గంగ ఇందిర ముఖంలోకి చూసింది. ఆమె మాట్లాడిన మాటల్లో ఎగతాళి ఎక్కడా కనబడలేదు. నిజాయితీ కనబడుతోంది

"నే నొక్కమాట నిన్ను గురించి అడగటానికి అనుమతిస్తావా?" గంగ అనుమానంగా చూసింది ఇందిర ముఖంలోకి.

"అడుగు. నన్ను అడగటానికి నీకు భయంగానీ సందేహంగానీ అక్కర్లేదు. నేనెట్లా నిన్ను నిలవదీసి అడుగుతున్నానో నీవూ అలాగే అడుగు. నీకా అధికారం ఉంది. నేనెంత కఠినురాలినో అంత న్యాయంగా మాట్లాడుతూ ఉంటాను."

"సరే. హామీ ఇచ్చావు కనుక నాకు ప్రాణభయం లేదు. మరింక అడగనా? ఆలోచించుకో మరోసారి చెబుతున్నా వన్...టూ...త్రీ..."

"అడగమన్నావా? అడగకుండా వన్-టూ-త్రీ ఏమిటి?"

"నా కంటె నీవు పెద్దదానవు. ఇప్పుడు నాకు చెప్పిన పెళ్ళిసూత్రాలను నీ వెందుకు విస్మరించావు?"

ఇందిర ముఖంలో నెత్తురుచుక్క లేదు. కాని-మరింత గంభీరమయి పోయింది. నోట మాటలేదు. తల వంగిపోయింది.

పావుగంటసేపు ఇద్దరి మధ్య భరించరాని నిశ్శబ్దము సంచరించింది.

గంగ ఇందిరముఖం చూసి తను తప్పుచేశానా అని క్షణం ఆలోచించింది.

అయినా అడిగినదానిలో తప్పు ఏముంది? మామూలు మాట. అందరూ అడిగేదే-అడిగించుకునేదే ! ఆమె హృదయానికి గాజుతలుపు లేమయినా ఉన్నాయా? నా ప్రశ్న ఆ గాజుతలుపులకు రువ్విన రాయిలా తగిలిందా? ఈ గాజు తలుపుల మనిషి ఏ ప్రశ్నయినా అడగమని ఎందుకు హామీ ఇచ్చింది?

ఆలోచిస్తూ వెర్రిచూపులు చూస్తున్న గంగ. "ఆఁ! గంగా! నీ ప్రశ్నకు జవాబు చెబుతాను. కాని-ఇవాళ కాదు. కాని—నీ ప్రశ్నకు నేను భయపడ్డానని కాని—అందరికీ ఒకటి చెప్పి నేనొకటి చేస్తానని కాని అనుకోకు" అని అంటున్న ఇందిరను చూసి ఉలిక్కిపడి—దిగ్గున లేచి నిలబడ్డది.

"ఏం? అప్పుడే ఇంటికి వెళ్ళాలని ఉందా? అమ్మ చేస్తున్న స్వీట్సు తినాలని తొందరపడుతున్నావా?" మందహాసం చేసింది ఇందిర.

"తినాలని కాదు. ఇంటికి వెళ్ళితే అమ్మకు కాస్త సహాయం చెయ్యొచ్చు కదా అని అన్నాను. పాపం! ఒక్కతే అన్ని పనులూ చేసుకోవాలి కదా."

"ఏం ఫరవాలేదు. మా అమ్మ అవసరంవస్తే నూరుమందికి వంటచేసి వడ్డిస్తుంది. ఆమెకంత దేహబలం లేకపోయినా మనోబలం ఉంది. దానితోనే గెలుచుకు వస్తుంది. అంతేనా? నీకింకేమయినా ఆలోచన ఉన్నదా?" మనసు నొచ్చిన జాడలు ఆమె ముఖంలో మచ్చుకయినా కనబడటంలేదు గంగకు.

"సరే. మరింకేవయినా కబుర్లు చెబుతావా? నీ విప్పుడు అట్లా మాట్లాడకుండా ముఖం దించుకుంటే నా కెంత బాధేసిందో తెలుసా?" బుంగమూతి పెట్టింది గంగ.

హాయిగా పసిపిల్ల నవ్వినట్టుగా నవ్వేసింది ఇందిర. "నేనట్లా ముఖం పెడితే నీవేమంటావో చూద్దామని!" చిన్నపిల్లలా ఎగిరి గంతులేసింది.

"చంపావు పో. నా ప్రశ్నకు నీ వెంత బాధపడ్డావోనని బెదిరిపోయానో తెలుసా? నన్ను నేనెంతగా తిట్టుకున్నానో?" గంగ మనసు తేలికపడ్డది. ముఖమ్మీద ఆనందరేఖలు కొట్టవచ్చినట్టు కనబడ్డాయి.

"పరీక్షలో తప్పిపోయావు. నీకు నిబ్బరమూ లేదు. అవగాహనా లేదు. పద. ఇంటికి పోదాము. నిజంగా నీ వన్నట్టు అమ్మ ఒంటరిగా ఏంతంటాలు పడుతున్నదో?"

చేతులు పట్టుకుని ఇద్దరూ తాపీగా అడుగులు వేస్తూ ఎండిపోయిన కాలవను చూసి నవ్వుకుంటూ నడుస్తున్నారు.

"ఈ నది పేరేమిటో తెలుసా గంగా! గోదావరి కిది ఒక పాయ. పేరు

ఆనందసాగరము. గోదావరేమో నది—దాని పాయ పేరు సాగరం! మెచ్చుకో వద్దూ ఈ పేరు పెట్టినవాళ్ళను ?" బాల్యచేష్టలు వీడని ఇందిర నవ్వుతో గంగ తన నవ్వును కూడా కలపక తప్పలేదు.

"మీ ఇద్దరికోసం అమ్మ ఎదురుచూస్తోంది. ఇంతసేపు ఎక్కడ కూర్చున్నారు ? పదండి పదండి" అంటూ ఎదురుగా వచ్చిన లక్ష్మయ్యను చూసి గతుక్కుమన్నది గంగ.

ఇందిర వంక చూసింది ఏమంటుందోనని. ఇందిర మాట్లాడకుండా తండ్రి వెనక అడుగులు వేయటం మొదలుపెట్టింది. గంగ ఆశ్చర్యంతో వాళ్ళ వెనక నడిచింది.

హాల్లో జంపఖానాల మీద కూర్చున్నవారు కాఫీ టిఫిన్లు ముగించినట్టున్నారు. గ్లాసులూ పళ్లేలో పక్కకు నెట్టారు. బిగ్గరగా మాట్లాడుకుంటున్న వాళ్ళల్లా లక్ష్మయ్య వెంట వచ్చిన అమ్మాయిలను చూసి మాటలాపేసి వాళ్ళనే చూడటం మొదలుపెట్టారు

"ఈ అమ్మాయి పేరు ఇందిర. మా కొక్కర్తే అమ్మాయని చెప్పాను కదా. ఎం. ఎస్సీ. ప్యాసయింది. కాలేజీలో లెక్చెరరుగా పనిచేస్తోంది. ఈ అమ్మాయి దీని స్నేహితురాలు. పేరు గంగ. ఇద్దరూ ఒక కాలేజీలోనే పనిచేస్తున్నారు. నిన్ననే ఊరినుంచి వచ్చారిద్దరూ."

లక్ష్మయ్య గబగబా లోపలికి వెళ్ళాడు.

"కూర్చోండమ్మా కూర్చోండి" అన్నారు కూర్చున్న వాళ్ళలోకి వయసు మళ్ళిన ఆయన.

గడప దగ్గరగా గోడకానుకుని కూర్చున్నారిద్దరూ.

ఆ వయసు మళ్ళిన ఆయన మళ్ళీ ప్రశ్నించాడు "మీ రిద్దరూ ఏం పాఠాలు చెబుతారమ్మా ?"

"నేను బోటనీ చెబుతాను. మా గంగ ఫిజిక్సు." టక్కున జవాబిచ్చింది ఇందిర.

వాళ్లల్లో ఇద్దరు, ఈ అమ్మాయిలను పరీక్షగా చూస్తున్నారు. పోలికలను బట్టి చూస్తే తండ్రీ కొడుకుల్లా కనబడుతున్నారు.

హాల్లో కూర్చున్న వాళ్ళందరినీ ఒకసారి కలయజూసింది ఇందిర. తండ్రీ కొడుకులను బాగా కనిపెట్టి చూస్తున్నది.

"జీతం ఎంతిస్తారమ్మా ! పాఠాలు చెప్పే పంతులమ్మలు చాలామంది

ఉన్నారా మీ కాలేజీలో ?" వయసు మళ్ళిన ఆయన మళ్ళీ ప్రశ్నించాడు.

"ప్రస్తుతం పన్నెండుమందిమి ఉన్నామండి. మాకు అన్నీ కలుపుకుని ఏడు వందలు చేతికి వస్తాయి." ఇందిర చాలా సౌమ్యంగా—ఇంత మర్యాదగా మాట్లాడటం అనంతమ్మకే కాదు-గంగకు కూడా ఆశ్చర్యంగా ఉంది.

ఇందిర వాళ్ళ నేమయినా ప్రశ్నిస్తుందేమోనని లక్ష్మయ్య భయపడుతున్నాడు. అనంతమ్మ అంతకంటె ఒణికిపోతున్నది.

"మంచిదండి వెళ్ళివస్తాము. మన రామయ్య గారున్నారు కదా ! వారు రేపు మీ దగ్గరికి వస్తారు లెండి" అందరూ లేచి చెప్పులు వేసుకుని గడప దాటుతుంటే లక్ష్మయ్యకు మనసులో పేరుకుపోయిన దిగులూ భయమూ మాయమయినట్లనిపించింది. అమ్మయ్య అనుకుంటూ వాకిటి గడపదాటిన తరువాత కూడా పది గజాలు వాళ్లతో నడిచి సాగనంపాడు

లోపలికి వచ్చిన లక్ష్మయ్యను అనంతమ్మ నోటితో ప్రశ్నించలేదు. ఆమె కళ్లతో ప్రశ్నించినదానికి లక్ష్మయ్య 'తొందరపడకు' అన్నట్టు కళ్ళతోనే జవాబిచ్చాడు.

గంగ, ఇందిర అనంతమ్మ పెట్టిన కాఫీటిఫిన్లు తిని గదికి చేరుకున్నారు. ఇందిర పడుకుని కళ్లు మూసుకుని పక్కకు తిరిగింది.

గంగ తమతో కూడా తీసుకువచ్చిన నవల ఒకటి చేతబట్టింది.

సాయంకాలము ఆరుగంటలకు ముఖాలు కడుక్కొని నైలెక్సు చీరెలు కట్టుకుని గదిలోనుంచి బయటికి వస్తూ "నాన్నా! ఏం సినిమా ఆడుతోంది ఇప్పుడు?" అడిగింది ఇందిర.

"ఇప్పుడు కొత్తవేం తెప్పించటం లేదమ్మా ఈ ఊరివాళ్లు. నిన్నటివరకూ బ్రహ్మచారి నడిచింది ఇవాళ గులేబకావళి అని బోర్డు పెట్టారు. వెళ్తారా ?"

"అవును నాన్నా ! ఏం తోచటంలేదు. మేమిద్దరం వెళ్తాంలే." గబగబా అడుగులువేస్తూ వెళ్లారు. ఆ ఊళ్లో ఎక్కడికి వెళ్ళినా కాలినడకనే వెళ్లాలి. దేనికయినా దూర మెక్కువ ఉండదు.

చిత్రం చూస్తున్నంతసేపూ ఇందిర ఒక్క మాటయినా మాట్లాకపోవటం గంగకు విచిత్రంగానే ఉంది. గోల్డుస్పాట్ విశ్రాంతి సమయంలో ఇద్దరూ తీసుకున్నారు.

జవాన్ని తోసుకుంటూ బయటికి వస్తుండగా గేటుదగ్గర లక్ష్మయ్య కనబడ్డాడు.




"ఈ చీకట్లో ఎందుకు వచ్చావు నాన్నా! మేమిద్దరం ఉద్యోగాలు చేసుకునే వాళ్ళం, ఇంటికి రాలేమూ?"

"వస్తార్లే. దీపాలు సరిగ్గా లేని ఈ ఊళ్ళో జనం మనుషులనయినా పశువులను తోసుకుంటూ పోయినట్టు పోతారు. అందుకని వచ్చాను" వాళ్ళకు రెండడుగులు ముందుగా నడుస్తున్నాడు లక్ష్మయ్య.

"ఎక్కడయినా ఇంతే. మనుషులే పశువులు—పశువులే మనుషులు. ఎలా మార్తారో ఎప్పుడు మార్తారో తెలియదు." మనసులోనే గొణుక్కుంది ఇందిర.

ఇంటికి వెళ్ళిన తరువాత భోజనాలు చేసి ఎవరికి వారే మాట్లాడకుండా పక్కలు చేరారు.

అందరూ మసులుతున్నారేగాని నిద్రపోవటం లేదని ప్రతిఒక్కరికీ తెలుసు.

* * *

దశరథరామయ్య తులశమ్మ పిల్లను చూడటానికి వచ్చి లక్ష్మయ్య అనంతమ్మలు చేసిన మర్యాదలకు పొంగిపోయారు. పిల్ల పదిహేడేళ్లది. చూడ ముచ్చటగా ఉంది. అన్నిటికంటె వాళ్ళిస్తామని సూరిశాస్త్రి చెప్పిన కట్నం—అదే పదిహేనువేలు చాలా ఆకర్షణీయంగా ఉంది.

ఇంటికి వెళ్ళి ఏ సంగతి చెప్పి పంపుతామని అయినా అనకుండా అక్కడి కక్కడే పిల్ల తమకు నచ్చిందని చెప్పేశారు.

"అబ్బాయి మాట? ఈ రోజుల్లో పిల్లలు ఒకరి నొకరు చూసుకోకుండా

పెళ్ళిళ్ల ఎట్లా నిశ్చయం చేస్తాము ? అబ్బాయిని కూడా పిలిపించండి'' అన్నాడు లక్ష్మయ్య.

"ఇదిగో మా అబ్బాయి ఫొటో. వాడిప్పుడు అమెరికాలో ఉన్నాడు. సంబంధం చూడమని మాకు నచ్చితే తనకు నచ్చినట్లేనని రాశాడు. వచ్చేనెలలో వస్తున్నాడు. అబ్బాయిని చూసిన తరువాతనే నిశ్చయం చెయ్యండి. ముహూర్తం కూడా అప్పుడే," అన్నారిద్దరూ ఒక మాటగా.

తన చేతిలో ఉన్న ఫొటోను తిప్పి తిప్పి చూసి లక్ష్మయ్య అనంతమ్మ చేతికిచ్చాడు. ఆమె మురిసిపోతూ కూతురుచేతి కిచ్చింది.

ఇందిర కప్పుడు పదిహేడేళ్లే. కాని మెట్రిక్ ప్యాసయి ఇంటరు చదువుతోంది. ఆలోచనలు ఉన్నాయి. ఆమె మనసు నిండా ఆశలూ ఆశయాలూ ఉన్నాయి. చూడనట్టే ఆ ఫొటోను మనిషిగా ఊహించి-బాగా చూసింది. పలకరిస్తున్నట్టున్న ఆ కళ్లను తప్పుకుంటూ చూసింది. మందహాసం చేస్తున్నట్టుగా ఉన్న ఆ ముఖాన్ని ఓరకంటితో చూసింది. తల్లీ తండ్రీ అందంగా లేకపోయినా ఇతడెట్లా ఉన్నాడో మన్మథుడిలా అనుకుంది. స్వయంగా చూస్తే రంగెటువంటిదో తెలుస్తుంది. అయినా రంగెలా ఉంటే ఏం ? అందం రంగులో ఉంటుందా అని ప్రశ్నించుకుని సమాధానపడ్డది.

"పేరేమిటన్నారు ?" లక్ష్మయ్య ప్రశ్నను ఇందిర వినిపించుకోనేలేదు.

"శ్రీపతి. అదే మా తాతగారి పేరు లెండి. మా నాయనగారు దగ్గరుండి పెట్టించారీ పేరు" నవ్వుతూ చెబుతున్నాడు దశరథరామయ్య.

శ్రీపతి అమెరికా నుండి రాగానే మళ్ళీ వచ్చారందరూ. ఇందిరను చూశారు. సూరిశాస్త్రి నక్యం పట్టుబడుతూ మంచి లగ్నాలు ఉన్నాయని చెబుతున్నాడు.

ఇందిర శ్రీపతిని పరికించి చూసింది. ఫొటో ఎంత మాత్రం ఇతడికి భిన్నంగా లేదు. ఫొటోలో ఎంత హుషారుగా ఉన్నాడో మనిషి కూడా అంతగా ఉన్నాడు. నవ్వులతో వినోదాలతో వరసలాడుకుంటూ పెళ్ళివారు వెళ్ళారు.

ఆ పదిరోజులకే ముహూర్తం పెట్టారు. ఒక్కగా నొక్క పిల్లంటూ అనంతమ్మ పెళ్ళివారు అడిగినదల్లా ఇచ్చింది. కోరిన మర్యాదలన్నీ చేసింది. లాంఛనాలు తీర్చింది. ఏ విషయంలో కూడా ఆలోచించలేదు. వెనకడుగు వెయ్యలేదు. ఖర్చుకు వెనుదియ్యలేదు.

బంధువులూ ఊళ్ళోవాళ్ళూ అందరూ పెళ్ళికూతురి అదృష్టాన్ని ఘనంగా పొగిడారు. అందగాడు-చదువుకున్నవాడు-అమెరికాలో ఉద్యోగం చేస్తున్న

వాడు అల్లుడుగా రావటమింది మాటలా అసలక్ష్మయ్యను ఆకాశానికి ఎత్తేశారు.

మరునటిరోజు రాత్రి లక్ష్మీదేవిలా కళకళలాడుతూ పాలగ్లాసుతో వచ్చిన ఇందిరను చూస్తూనే పాలగ్లాసందుకుని ఆ దగ్గరలో ఉన్న కుర్చీలో కూర్చోమన్నాడు శ్రీపతి.

ఇది విదేశీయుల మర్యాద కాబోలు అనుకుని ముసిముసి నవ్వులతో కొంగు దగ్గరికి లాక్కొని కూర్చుంది ఇందిర.

"ఈ కాగితాలమీద సంతకం పెట్టు" అన్నాడు శ్రీపతి.

"ఏం కాగితాలివి ?" చేతిలోకి తీసుకుంది ఇందిర, ఇది కూడా ఏదో కొత్త సంప్రదాయం కాబోలనుకుంటూ.

"ఈ పెళ్ళి 'నా కిష్టం లేదు.' అని సంతకం పెట్టు. నేను కట్టిన సూత్రం నా కిచ్చెయ్యి" గంభీరంగా ఉన్నాయతడి మాటలు.

"పెళ్ళి నా కెందుకు ఇష్టంలేదు ? నేనలా ప్రవర్తించానా ? లేదే ?" తెల్లబోయింది ఇందిర.

"నీకు కాకపోతే నా కిష్టం లేదు "

"మరి పెళ్ళి కెందుకు ఒప్పుకున్నట్టు ?"

"కట్నం కోసం. కట్నం అమ్మానాన్నల కిచ్చి నేను రేపు వెళ్ళిపోవాలి. వెళ్లేముందు విడాకు లిచ్చినట్టుగా ఈ కాగితాలమీద సంతకాలు కావాలి. ఆ తరువాత నీ బాధ నా కుండదు. నా బాధ నీకుండదు."

"సంతకం చేయాలంటే నాకు మీరు టైమివ్వాలి."

"టైము లేదు నేను రేపే వెళ్ళిపోవాలి. మదరాసునుంచి ఢిల్లీ వెళ్ళి అక్కడి నుంచి స్టేట్స్‌కు వెళ్ళిపోతాను."

"అయితే మళ్ళీ రారా ?"

"రాను. నేనూ పెళ్ళిచేసుకోవటానికి అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాము. ఇంక అక్కడే ఉండిపోతాను."

"అయితే ఇదేం పెళ్ళి ?"

"చెప్పానుగా ! నాన్న అమ్మల కోసం చేసుకున్న డబ్బుపెళ్ళి. దీనితో నా కేమీ సంబంధంలేదు."

ఇందిరకు ఏడుపు రావటంలేదు. ఆశ్చర్యం కలగటంలేదు. ఆందోళనకరంగా మనసు ఊగిపోవటంలేదు.

గుండె ఛగ్గుమన్నది.

'ఇటువంటి మనిషిచేత నేను తాళి కట్టించుకున్నానా? నమ్మిన మనిషిని గోతిలోకి తోసే ద్రోహేనా ఇతడు? మనసు నిండా అమృతం నింపుకుని నేను వస్తే, విషం నింపుకుని వచ్చాడా ఇతడు!'

ఆమెకు అగ్నిహోత్రం తనలోనే రాజుకున్నట్టుగా ఉంది.

"ఇదిగో నీవు కట్టిన మంగళసూత్రం. తీసుకువెళ్లు. నిన్ను నేను కలలో కూడా తలుచుకోను. ఇంకా సంతకం ఎందుకు? నీవు కట్టిన సూత్రాన్ని నేను పట్టుకుని వ్రేలాడుతుంటే కదా సంతకాలు కావలసి వచ్చేది? మనం మళ్ళీ ముఖాలు చూసుకోంగా? బై బై..." చివాలున లేచి మంగళసూత్రం అతడి ఒడిలో పడేసి తలుపు తెరుచుకుని వెళ్ళిపోయింది.

క్రిందటి ఉదయమే పెళ్ళివారంతా వెళ్ళిపోయారు. దశరథరామయ్య తుల శమ్మలు కూడా వెళ్లుతూ పెళ్ళికూతురినీ పెళ్ళికొడుకునూ మూడు నిద్రలయిం తరువాత పంపమని చెప్పి వెళ్ళారు. లక్ష్మయ్య, అనంతమ్మ అలసిపోయి నిద్రల కొరిగారు. పెళ్ళికూతురు వైపు బంధుజనమంతా ఆ మధ్యాహ్నమే బస్సులో వెళ్ళారు.

ఇందిర తన గదిలోకి నిశ్శబ్దంగా ప్రవేశించింది. ఆ చీరె అలంకారాలూ తీసే సింది. తన మామూలుచీరె ఒకటి తీసుకుని కట్టుకుంది. ముఖం కడుక్కుని బొట్టు మామూలుగా పెట్టుకుంది. పారాణి పోయేటట్టుగా పాదాలు రాచి రాచి కడుక్కున్నది. బరువైన పూలజడ విప్పి-తలవెంట్రుకలు దువ్వి జడ అల్లు కుంది మామూలుగా.

మంచమ్మీద ఒరిగి విసురుకుంటూ కోపావేశాన్ని తగ్గించుకోవటానికి సకల ప్రయత్నాలూ చేస్తున్నది.

మూడుగంటల రాత్రికి శ్రీపతి తన సూట్‌కేసు పట్టుకుని వెళ్లటం కిటికీలో నుంచి చూసింది.

నిద్రలోనుంచి లేచి "ఛీ! ఏం పాడుకల వచ్చింది!" అని ముఖం చిట్లించు కుంటూ మళ్ళీ పడకమీద వాలింది ఇందిర. ఇదంతా కలా? ఎంత నిజమను కునేట్టుగా వచ్చింది కల?

తెల్లవారిన తరువాత తన గదిలోనుంచి వచ్చిన ఇందిరను చూసి తల్లీ తండ్రీ తెల్లబోయారు.

కలే అయినా ఎంత బాధగా ఉంది? ఎంత పాడు కల!

ఎనిమదేళ్ళనాటి దుస్స్వప్నము మళ్ళీ ఇవాళ వచ్చిందేమిటి? చివాలున

పక్కమీద నుంచి లేచి గ్లాసెడు మంచినీళ్ళు తాగింది. మంచమ్మీద పడుకో బుద్ధి పుట్టలేదు. తల్లీ తండ్రీ గాఢనిద్రలో ఉన్నారు.

గంట చూసుకుంది చేతికున్న వాచిలో. మూడు గంటలయింది.

సరిగ్గా ఆనాడు కలలో శ్రీపతి వెళ్ళిపోయిన వేళ !

లేచి ఇటూ అటూ తిరిగింది ఆ గదిలోనే మెల్లగా అడుగులువేస్తూ.

"గంగా ! గంగా ! లే. నిద్ర బాగా పట్టిందా ?" లేపి కూర్చోబెట్టింది.

"ఏమిటి నీ వప్పుడే లేచావా ? ఇంకా తెల్లారలేదు – పడుకో." మళ్ళీ పడుకోబోయింది గంగ.

"గంగా ! పడుకోకు, లే." చేతులు పట్టుకుని లేపింది.

"నీకు నిద్ర పట్టడంలేదా ? ఏదయినా చెడ్డకల వచ్చిందా ?" కళ్ళు నలుపుకుంటూ లేచింది గంగ.

"గంగా ! పెళ్ళికొడుకు ఎట్లా ఉన్నాడు !" గంగ మంచమ్మీద కూర్చుని అడిగింది భుజంమ్మీద చెయ్యివేస్తూ.

"పెళ్ళికొడుకా ?" ముసిముసిగా నవ్వుతూ కళ్ళు పెద్దవిచేసి చూసింది గంగ.

"అవును. పెళ్ళికొడుకే. ఎలా ఉన్నాడు ?" జడ సవరిస్తూ అడిగింది.

"బాగానే ఉన్నాడు."

"వయసు ?"

"ముప్పై దాటీ దాటకుండా ఉన్నాయి"

"ఉద్యోగం ?"

"ఉద్యోగానికేం ? నిక్షేపంలా ఉంది. సెంట్రల్ ఎక్సైజు ఇన్‌స్పెక్టరు. రోజూ బంగారం కళ్ళజూస్తాడు."

"మొత్తానికి అంతా బాగానే ఉందంటావు అంతేనా ? చేసుకోవచ్చంటావు ?"

"నా కే ఆక్షేపణా కనబడలేదు. అన్ని విధాల బాగుంది"

"నీ మనస్ఫూర్తిగా చెబుతున్నావా ! నిజమనుకోమన్నావా ?" రెట్టించింది ఇందిర.

"అన్ని విధాలా నచ్చాడు. నా మనస్ఫూర్తిగా చెబుతున్నాను" కోర్టులో ప్రమాణం చేసినట్టు చెప్పింది గంగ.

"అయితే గంగా ! నీ వతడిని పెళ్ళిచేసుకో" చటుక్కున గంగచెయ్యి పట్టుకుంది ఇందిర.

వెనకాముందూ చూసుకుని మాట్లాడాలి" కోపగించుకుంది గంగ.

"గంగా !"

ఆ పిలుపు హాస్యాలకూ నవ్వులకూ చాలా దూరంగా గంభీరంగా ఉంది. ఒక మహారాజు మంత్రిని పిలిచినట్టుగా ఉంది. ఆజ్ఞాపూరితంగా ఉంది. గంగ తుళ్ళిపడ్డది.

"ఏమిటి ఇందిరా ?" ఎంతో మెల్లగా సాధ్యమైనంత సౌమ్యంగా పలకరించింది గంగ.

"గంగా ! నేను నీతో హాస్య మాడటంలేదు. నిజంగా చెబుతున్నాను. నీ కతడు బాగా నచ్చా డంటున్నావు కనుక నీవు పెళ్ళిచేసుకో. నేను నీకు కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తాను. నీవు సరే అను. తెల్లవారగానే అమ్మకూ నాన్నకూ చెబుతాను. ఏదీ – నీ చెయ్యి ఇట్లా తే. మొట్టమొదలు నన్ను అభినందించనీ" కరచాలనం చేసింది అభినందపూర్వకంగా.

"నీ కేమయినా మతిపోయిందా ఇందిరా ? మీ అమ్మా నాన్నా వింటే ఏమంటారు ? వాళ్ళు ఎన్నాళ్ళు తపస్సుచేసి ఈ సంబంధం తెచ్చారో ? వాళ్ళ కిట్లా ఆశాభంగం కలిగిస్తే గుండె పగిలిపోతుంది వృద్ధాప్యంలో. నీ కని తెచ్చిన సంబంధం నేను ఎట్లా చేసుకుంటాననుకుంటున్నావు ? అసలు నీ కీ ఊహ ఎట్లా కలిగింది ?" మందలించింది గంగ.

"గంగా ! నా సంగతి నీకు తెలియదు. నేను పెళ్ళిచేసుకోను. పెద్దవాళ్ళు ఏవో ఆశలు పెంచుకుంటారు మమతకొద్దీ. నే నిదివరలో కలలోనే అనుకో, ఒకసారి పెళ్ళిపీటలమీద కూర్చున్నాను. తాళి కట్టించుకున్నాను. అతడడిగితే మళ్ళీ ఇచ్చేశాను. నాన్నా అమ్మా వాళ్లు ఉండగానే పెళ్ళిచేసి నేను సుఖంగా సంసారం చేస్తుంటే చూడాలన్న ఆశతో ఇతణ్ణి పిలిపించారు. నా మనసు వాళ్ళకు తెలియదు. పాపం! కాదనలేక ఉత్తరంరాగానే నిన్ను తీసుకువచ్చాను."

"వాళ్ళమీద అంత దయగలదానవు – చేసుకోరాదూ ? నీ కిదివరకే పెళ్ళయిందా ? చెప్పలేదే నా తోటి ? నీ స్నేహమంతా ఉత్తిత్తిదని ఇవాళే తెలిసింది," మూతి ముడిచింది గంగ.

"నీవు మరోలా అనుకోకు గంగా ! నీకు పెళ్ళి చేయాలనీ – అందుకు అబ్బ ! అదంతా కల అని చెప్పానా ? నేను ఎటువంటి సహాయమయినా చేయాలనీ ఎన్నాళ్లనుంచో అనుకుంటున్నాను నా కీ అవకాశము కల్పించు.

అతడు ఒప్పుకుంటే వెంటనే లగ్నం పెట్టించేస్తాను. ఈ ఊళ్లోనే గుడిలో పెళ్లి, వింటున్నావా ?" జడపట్టుకొని లాగి దగ్గరగా కూర్చోబెట్టుకుంది.

"ఇందిరా ! ముందు నీ సంగతి చెప్పు. ఈ కాసేపటిలో నా మనసంతా చెరువులా చేసిపెట్టావు. ఆ శ్రీపతి అనే ఆయన మళ్ళీ రాడా ? అంత కట్నం తీసుకుని ఆ అత్తమామలు అట్లా చేతులు దులుపుకుని వెళ్ళిపోయారా ?" రెండు చేతులతో తలపట్టుకుంది.

"ఆ ! వెళ్ళిపోయారు నా కలలో. ఆ పెళ్ళికోసం అయిన ఖర్చుకు నాన్న తన తండ్రి యిచ్చిన మేడ ఐదు ఎకరాల సుక్షేత్రాన్ని అమ్ముకుని చేతులు దులుపుకున్నాడు. నలుగురిలో తల ఎత్తుకోలేక - ఈ ఊరు మా అమ్మ తండ్రి ఊరు – ఇక్కడికి వచ్చారు. అమ్మకు రెండెకరాలు తండ్రి ఇచ్చాడు. ఈ ఊరు వచ్చి ఈ పూరిల్లు కట్టుకుని కాలక్షేపం చేస్తున్నారు. సరేనా ! చాలా ఇంకా చెప్పాలా ?"

"మరి నీ చదువు ఎట్లా సాగింది. ? అంత మంచి ఇల్లాలు మీ అమ్మ. ఆమెకీ కష్టాలా ?"

గలగల నవ్వింది ఇందిర. "జనసామాన్యం మాట్లాడే మాటే నీవూ మాట్లాడావు. ఆ దశరథరామయ్యగారు కట్నం తిరిగి ఇవ్వనన్నాడు. మా నాన్న వారినీ వీరినీ పట్టుకుని అమెరికాకు బెదిరిస్తూ ఉత్తరాలు రాస్తే పదివేలు వచ్చాయి. దాంతో నా చదువు అయింది. వెంటనే ఉద్యోగం వచ్చింది. కథలాంటి కల పూర్తయింది. కాకులు కూస్తున్నాయి, లే, లే. ముఖం కడుక్కుని కాఫీ తాగితేగాని పనితోచదు"

ఇద్దరూ లేచి పెరట్లో బాదంచెట్టు క్రింద కూర్చుని పళ్లు తోముకున్నారు.

*　*　*

మధ్యాహ్నం వేళ. భోజనాలు చేసి వాకిటి వరండాలో కూర్చుని పొగాకు చుట్ట చుట్టుకుంటున్నాడు లక్ష్మయ్య. అనంతమ్మ లాంతర్లు తుడుస్తున్నది.

పెళ్ళివారు పంపించిన రామయ్యగారు వక్క నములుతూ వచ్చాడు. ఆయనను చూడగానే లక్ష్మయ్యకు గుండె గబగబ కొట్టుకున్నది. అనంతమ్మ లాంతర్లు తుడిచి లోపల పెట్టి వచ్చింది.

"అమ్మాయి నచ్చిందంటున్నాడు అబ్బాయి. తండ్రిగారుకూడా ఒప్పుకున్నారు. మగవాళ్లకు కట్నకానుకల మీద ఆశలేదు కాని - పిల్లవాడి తల్లికి ఉన్నది. తన కూతురికీ తనకూ వెయ్యేసి రూపాయల లాంఛనాలు కావాలట.

ఖర్చుల కోసం నాలుగువేలు ముందు కావాలట. పెళ్ళి ఎట్లా చేసినా సరేనట" అంటూ ఒక చుట్ట తనకూ్కడా చుట్టి యిమ్మని చేతిసైగ చేశాడు.

"దానికేం భాగ్యం" మరింత లావుగా చుట్ట చుడుతున్నాడు లక్ష్మయ్య.

"అంత ఆశటండీ ఆవిడకు ?" అనంతమ్మ బుగ్గలు నొక్కుకున్నది.

"అమ్మా అనంతమ్మగారూ ! రోజులు అట్లా ఉన్నాయి. మనం ఎవరినీ అనడానికి వీలులేదు," రామయ్య దృష్టి చుట్టమీదనే కేంద్రీకృతమై ఉంది.

గదిలో నవల చదువుకుంటున్న ఇందిర బయటకి వచ్చి చూసింది.

"ముఖంలో ఎంత కళ ! ఎంత కళ !" అంటున్నాడు రామయ్య ఇందిరను చూసి.

"ఏమండీ ! పెళ్ళికూతురు నచ్చిందా వాళ్లకు ?" ఇందిర అడుగుతుంటే తుళ్ళిపడి చూశారు అనంతమ్మా, లక్ష్మయ్యా.

"పెళ్ళికొడుక్కు మాబాగా నచ్చిందమ్మా పెళ్ళికూతురు. ఇంక పెద్దవాళ్ళ మాట వేరే చెప్పాలా ?" నవ్వాడు రామయ్య.

"అయితే వాళ్ళు అడిగినంతా ఇస్తామని చెప్పండి ముహూర్తం పెట్టించి కబురు చెయ్యమనండి. పెళ్ళి రాములవారి దేవాలయంలోనని చెప్పండి" లోపలికి వెళ్ళి వేడి వేడి కాఫీ కప్పు తెచ్చి ఆయన చేతి కందించింది ఇందిర.

సమస్య ఇంత తొందరగా తేలిపోతుందనుకోలేదు లక్ష్మయ్యా అనంతమ్మా. కాని అంత డబ్బు పుట్టేది ఎట్లా ? ఇందిర కూడబెట్టిన డబ్బు ఇంత ఉన్నదా ? తేల్చుకోలేక తబ్బిబ్బయిపోతున్నారు.

రామయ్య వెళ్లగానే అనంతమ్మ లేచి వచ్చి ఇందిర బుగ్గలు తడిమి "నా తల్లి జీవితం ఇంతటితోనయినా గాడిలోపడితే మా జన్మలు తరించినట్లే" అని గడప దాటబోయింది.

"అమ్మా ! కూర్చో. మీ కిద్దరికీ ఒక సంగతి చెప్పాలి. ఈ పెళ్ళికొడుకు గంగకు బాగా నచ్చాడు. గంగ కూడా అతడికి నచ్చినట్లే ఉంది. అతడు కూర్చున్నంతసేపూ గంగనే కన్నార్పకుండా చూశాడు. వీళ్లిద్దరికీ పెళ్ళి చేసేద్దాం." సర్దుకుని గోడ కానుకుంది ఇందిర.

"ఏమిటీ ? గంగకు నచ్చాడా పెళ్ళికొడుకు ? ఆ పిల్ల నెవరడిగారు ? నీ సంగతి చెప్పమంటే !" అనంతమ్మ గావుకేకలు పెట్టింది.

లక్ష్మయ్యకు నిలువుగుడ్లు పడ్డాయి.

"అవునమ్మా. ఈ సంబంధం నాకు నచ్చలేదు, గంగకు నచ్చింది.




గడపలోకి వచ్చిన సంబంధం చెయ్యిజారిపోనీయటం నా కిష్టంలేదు. గంగకు చేద్దాం" అన్నది మామూలు మాటగా.

"ఇంత కష్టపడి యిన్నాళ్లూ వెతికి వెతికి ఈ సంబంధం తెస్తే గంగకు చేస్తావా ? నీ కెందుకు నచ్చలేదు ?" అనంతమ్మకు ఎప్పుడూ లేవని గొంతు ఇప్పుడు బాగా లేచింది.

"ఎందుకు నచ్చలేదంటే ఏంచెప్పను ? నచ్చలేదంతే" కట్టె విరిచినట్టు అన్నది ఇందిర.

లక్ష్మయ్య శ్రోతగా నిలిచిపోయాడుగాని మాట్లాడలేకపోతున్నాడు.

"ఆ పిల్లకు పెళ్ళి కావలసివచ్చిందా ఇప్పుడు ? రెండుసార్లు ఇప్పటికి పెళ్ళి చేసుకుందట. ఏదీ కలిసిరాలేదు. చేసుకుంటే ఇది మూడోది అవుతుంది. పైగా నాలుగు నెలల గర్భిణి కూడాను. వాడికి కళ్ళుమూసి పెళ్ళిచెయ్యాలి" పళ్ళు కొరికింది అనంతమ్మ.

"నీకు మంచి కథ చెప్పింది గంగ. నీవు నమ్మేవా అమ్మా ! గంగ చెప్పిన దంతా ?" విరగబడి నవ్వింది ఇందిర.

"నీకేం తెలుసు అదేం చెప్పిందో నాకు ? రెండుగంటలసేపు చెప్పింది. సవతి తల్లట - ఏదో సంబంధం చేస్తే వాడు సర్టిఫికెటు ఇచ్చాడట. ఇంకోడు ......"

"వాడు కూడా ఏదో ఇచ్చాడా ? గంగ అందరితో ఇలాగే చెబుతుందమ్మా. పెళ్ళి చేసుకోవాలని కోరిక. సంబంధాలుచూసి పెళ్ళిచేసేవాళ్ళు ఎవరూ లేరు. ఒక మేనమామ ఉండేవాడు. ఆయనా రెండేళ్ళనాడు చనిపోయాడు. అప్పటి నుంచీ లోకంలో ఉన్న బాధలన్నీ తనకు వచ్చినట్టే అందరికీ చెబుతూ

ఉంటుంది. నీకు చెప్పేటప్పుడు నేను వింటూనే ఉన్నాను. నేను నవ్వితే ఆపే స్తుందని వింటూ పడుకున్నా. ఎన్ని అబద్ధాలు ! ఎన్ని అబద్ధాలు ! గంగా ! ఇటు రా !" ఒక కేకపెట్టింది.

గదిలోనుంచి చేతిగోళ్లు చూసుకుంటూ గంగ వచ్చింది.

"ఎంత పెద్ద కథ చెప్పావు గంగా అమ్మకు ? ఆడవాళ్లకు వచ్చే కష్టాలు అన్నేనా ? భర్త కొట్టటం - తిట్టటం - తాగి రోడ్డుమీద డబ్బివ్వమని తన్నటం - ఇంకా ఎన్నెన్నో ఉన్నాయి. దారినపోతూ దొర్లుతూ ఉండే ఎవరో సందులోకి లాక్కుపోవటం - పర్యవసానంగా కడుపురావటం, తల్లి దండ్రులు ఇల్లు వెళ్లగొట్టటం - దారిలేక వేశ్యాగృహం పాలబడటం అవన్నీ చెప్పలేదేం ?" వ్యంగ్యంగా ఇందిర వదిలే బాణాలు గంగ మనసులో శూలాల్లా బాధిస్తున్నాయి.

"పిచ్చిదానా ! అమ్మ సానుభూతి సంపాదించి పెళ్లి చేసుకోవాలంటే నోరు తెరిచి అడగకూడదూ ? కలం చేతికిస్తే మంచి రసవంతమైన కథలు రాసేటట్టు న్నావు" ఇందిర ఆగేటట్లు లేదు. సాధింపు సాగిస్తోంది.

"అవునా గంగా ! ఇందిర చెప్పినదంతా నిజమా ?" నిలవదీసింది అనంతమ్మ.

నోటితో చెప్పలేక తలఊపింది అవునన్నట్టుగా గంగ. భయంతో ఒణికి పోతున్నది.

"చాల్లే తెలివి. నీ బ్యాంకులో డబ్బెంత ఉందో రాసి తెప్పించు. చాలకపోతే నేను సర్దుతాను."

"అన్నిటికీ తొందరపడకు ఇందిరా. అసలు ఈ పెళ్ళి ఇష్టమవునో కాదో అడుగు." నిలవదీసింది అనంతమ్మ మరోసారి.

"చెప్పు గంగా చెప్పు ? ఈ అవకాశం ఇప్పుడు చెయ్యిజారితే మళ్లీ జన్మలో దొరకదు. జన్మంతా కష్టాలు ఊహించుకుని ఏడుస్తూ బ్రతకాలి. చెప్పు. నీకు నచ్చిందా లేదా ?" గద్దించినట్టు అడిగింది ఇందిర.

ఇష్టమే నన్నట్టు తల తిప్పింది గంగ.

"ఎంత అదృష్టవంతురాలివే అమ్మా. ఊరికే చూడటానికి వచ్చి బంగారం లాంటి సంబంధాన్ని చేత చిక్కించుకున్నావు" ఎద్దేవిగా అంది అనంతమ్మ.

ఇదంతా ఇలా మలుపుతిరిగినందుకు లక్ష్మయ్యకూ అనంతమ్మకూ ఎంతో బాధగా ఉంది. ఇందిరది పెడకట్టెమతం. ఒకరి మాట వినదు. కష్టం

ఒకరిదయితే అనుభవం ఒకరిది. ఇద్దరూ తలలు వాల్చుకున్నారు.

మరునాడు ఇందిర రామయ్యను పిలిపించింది. ఆయనతో గంగ సంబంధం ఇష్టమేనా అని అడిగించింది. పెళ్ళికొడుకు ఒప్పుకున్నాడు.

అనుకున్నది అనుకున్నట్టుగా పెళ్ళి జరిగిపోయింది. అనంతమ్మ కంట తడిబెడుతూ, గంగ కెవరూ లేరు కదా అని జాలిపడుతూ పెళ్లి జరిపించింది. పెళ్లి పెత్తనమంతా ఇందిరది. సారెపెట్టి చెల్లెలిని అత్తవారింటికి పంపించినట్టుగా గంగను అత్తవారింటికి పంపించింది.

జీవచ్ఛవాలలా ఇంట్లో తిరుగుతున్న తల్లిదండ్రులను చూస్తుంటే ఇందిరకు భరించరాని బాధ కలుగుతోంది. అవును ! తను వాళ్ళకు ఆశాభంగం కలిగించింది. వాళ్ళిద్దరూ ఈ బాధతోనే కుంగిపోతున్నారు.

"అమ్మా ! మీ రిద్దరూ నాతో వచ్చెయ్యండి. అక్కడే పెద్ద ఇల్లు తీసుకుందాము. పెద్దవాళ్ళయిన తరువాత ఒంటరిగా ఈ పల్లెటూళ్లో ఉండటమెందుకు ! నాన్నతో చెప్పి సామాను సర్దు" అంది ఇందిర–పెళ్లి సందడి అంతా అయిన తరువాత.

"మేమెందుకే అక్కడికి ? మా కిక్కడే బాగుంది. నీకు పెళ్ళి సంసారమూ ఉంటే వచ్చినా అందమూ చందమూ. ఇప్పుడెందుకు మోడులాఉన్న నిన్ను చూస్తూ ఏడవటానికా ?" కన్నీరు కార్చింది అనంతమ్మ.

"నీ చేత్తో పెళ్ళిచేశావు. గంగ సంసారం పచ్చపచ్చగా ఉంటే చూడటానికి రావూ ? గంగ నాకు చెల్లెలనుకో అమ్మా. పాపం ! పెళ్ళి కావాలన్న ఆరాటంకొద్దీ అబద్ధాలు చెప్పి నీ సానుభూతి సంపాదించాలని అలా చేసింది పాపం మంచిపిల్ల. నిప్పులాంటిదనుకో."

"అందరి కష్టసుఖాలూ నీకు కావాలి. కాని మాకేం కావాలో నీకు తెలియదు."

తల్లి ముఖంలోకి చూడలేకపోయింది ఇందిర. ఈ తల్లి మనసులోనుంచి ఆవేదనంతా తుడిచివెయ్యాలంటే తనేం చెయ్యాలి ? తల్లి కోరిక తను తీర్చగలదా ?

శ్రీపతి ! శ్రీపతి తనకు కట్టిన తాళి తీసుకువెళ్ళాడని తను చదువుకుంటున్న రోజుల్లో పెద్ద పుకారుపుట్టింది. ఆ పుకారు పుట్టించింది ఎవరో తెలియదు. అది దావానలంలా ఆ ఊరంతా పాకిపోయింది. అలా వచ్చి వచ్చి ఆమె తల్లిదండ్రులకు చేరింది. ఆ గ్రామం అంతా రేడియోవార్తలా ప్రసారమయింది. తల

కొట్టేసినట్లయింది తల్లిదండ్రులకు. ఇక ఆ ఊర్లో ఉండలేకపోయారు.

ఇప్పుడు తన మెడలో తాళి ఎవరు కడతారు? కట్టిన మరునాడు పాత పుకారు చెవినపడకుండా ఉంటుందా? వెంటనే జీవితాన్ని నరకం చేసేస్తాడు కట్టుకున్నవాడు. అయినా తనకు పెళ్ళికాకముందే పెళ్ళంటేనే విరక్తి కలిగింది.

తాళి కట్టించుకునే గండం కాస్తలో తప్పింది. గంగ దేవతలా తనను రక్షించింది. గంగకు జీవితాంతం తను కృతజ్ఞురాలై ఉండాలి.

సంధ్య దీపం వెలిగించి జీవంలేనిదానిలా లోపలికి వెళ్ళుతున్న అనంతమ్మతో కూడా వంట యింట్లో అడుగుపెట్టింది ఇందిర.

*　　*　　*

శ్రీపతి ఇందిర సహాధ్యాయి. తోటివాళ్ళందరి మాదిరిగా విద్యార్థినులపట్ల కృత్రిమ మర్యాద చూపించేవాడు కాదు. కొంచెం పొగరుగా మాట్లాడేవాడని ఆడపిల్లలంతా అనుకునేవాళ్ళు. నిజానికి అతడిది ఒక మాదిరి పద్ధతి. ఆడపిల్లలు రాగానే లేనిపోని ఆర్భాటాలు చేయటం-లేనిపోని గౌరవం చేయ్యటం-వాళ్లను ప్రత్యేకంగా చూడటం ఒహోహో అనటం అతడికి నచ్చదు 'అందరం సమానం' అంటాడు. 'మనను వాళ్ళు గౌరవించాలి. వాళ్ళను మనం గౌరవించాలి.' అంటాడు. కొందరికి అతడి మాటలు అభిప్రాయాలూ నచ్చవు.

"మనది కో ఎడ్యుకేషన్ కాలేజి. ఆడపిల్లల పట్ల మనం గౌరవం చూపించాలి" అన్నాడొకనాడు శంకరం. అతడు శ్రీపతికి మిత్రుడు.

"ఆడపిల్లల పట్ల మగపిల్లలు చూపించాలి. మగపిల్లల పట్ల ఆడపిల్లలూ చూపించాలి. అంతా సమానం అనుకుంటున్నాం. మళ్ళీ ప్రత్యేకత ఏమిటి?" ఖండితంగా మాట్లాడటం శ్రీపతికి అలవాటు.

ఈ మాట చిలవలుపలవలుగా సృష్టి అయింది. ఈ విషయాన్ని ప్రిన్సిపల్ వరకూ తీసుకువెళ్ళాలని విద్యార్థులు ముందు ఇంగ్లీషు లెక్చరరు దగ్గర ప్రస్తావించారు. ఆయన ఆలోచించి మరునాడు చేస్తానని అప్పటికి వాళ్లను శాంతింపచేసి పంపించేశాడు.

కాని-ఆ సాయంత్రము ఆడపిల్లలు ఆయన దగ్గరికి వచ్చారు. వాళ్లకు నాయకురాలు ఇందిర.

"మమ్మల్ని అవమానపరుస్తున్నాడు సార్. మాకు వేరే సీట్లు ఎందుకు అంటున్నాడు. మాకు వేరే రూమ్ ఎందుకన్నాడు. మాకు ప్రత్యేకమయిన

సదుపాయాలు ఏవీ కాలేజిలో ఉండకూడదుట." ఇందిర రౌద్రమూర్తిలా హుంకరిస్తూ చెప్పింది.

"ఈ సంగతి ప్రిన్సిపల్‌గారితో మాట్లాడుతానమ్మా. నేను ఒక్కడినే నిశ్చయించేది కాదుగదా. అయినా శ్రీపతి అంతటి ఆదర్శ విద్యార్థి ఇట్లా అంటున్నాడంటే నమ్మలేకుండా ఉన్నాను."

"మీరు ఈ మాట అంటారని నేను ముందే ఊహించాను సార్. అతడు ఫస్టు క్లాసు స్టూడెంటని మీ కందరికీ చాలా అభిమానం.అతడిమీద ఈగ వాలనీయరు. మమ్మల్ని అడుగడుగునా అవమానపరుస్తూ ఉంటే ఈ కాలేజిలో విద్యార్థినులు ఇకముందు చేరరు. ఉన్నవాళ్ళు కూడా వెళ్ళిపోతారు" బెదిరింపుగా అన్నది.

ఇంగ్లీషు లెక్చెరరు గోవిందరావు విద్యార్థినీ విద్యార్థులతో ఎట్లా మెలగాలో బాగా తెలుసుకున్నవాడు. అందరు చెప్పినదీ ఓపికతో వింటాడు ఎవరికి వారే తాము చెప్పినట్టే ఆయన వింటాడన్న నమ్మకాన్ని కలిగించుకుంటారు. ఉద్రేకంతో వస్తారు ఆయన దగ్గరికి. బరువు భారాన్ని దింపుకుని సంతృప్తితో తిరిగి వెళ్తారు.

ఆయన దగ్గరికి పిల్లలంతా చేరటానికి ఏదో కిటుకు ఉందనుకుంటారు తోటి లెక్చెరర్లు. కొందరికి ఆయనపట్ల ఈర్ష్యగా కూడా ఉంటుంది.

"ఏముందండీ అందులో? వాళ్లమీద సానుభూతి ప్రకటిస్తూ ఉన్నదంతా వెళ్లబోసుకోనిస్తాను. దాంతో వాళ్లకు విశ్వాసము ఏర్పడుతుంది, అంతే" అంటాడు గోవిందరావు నవ్వుతూ.

ఇందిర బృందము వెళ్లుతూ వెళ్లుతూ "అతడికి బాగా వార్నింగ్ ఇవ్వాలి సార్" అన్నది కక్షతో.

తల పంకించాడు గోవిందరావు.

ప్రిన్సిపల్ వరకూ ఈ వార్తలు చేరాయి. శ్రీపతిని ఆయన పిలిపించాడు.

శ్రీపతి విద్యార్థి. వయసులో చిన్నవాడు. అతడు ప్రిన్సిపల్ అడిగిన ప్రతి ప్రశ్నకూ విపులమయిన జవాబు లిచ్చాడు.

"అట్లాగా?" అంటున్నాడు ప్రిన్సిపల్ ప్రతి మాటకు. ఆయనకు అతడి ఆర్గ్యుమెంటు చాలా నచ్చింది. ప్రతి అంశమూ సహేతుకంగా నిరూపించి మాట్లాడుతున్నాడు.

"అందరం సమానం అనుకుంటూ వంగి వంగి దణ్ణాలు ఎందుకు? ఆ ప్రత్యేకత వాళ్లకే ఎందుకు?" ఈ ధోరణిలో సాగింది అతడి ఆర్గ్యుమెంటు.

"వాళ్లను ప్రోత్సహించాలి కనుక. స్త్రీ విద్యను మనము అభివృద్ధి చెయ్యాలి కనుక" అన్నాడు ప్రిన్సిపల్ అయిఉండీ ఏమీ అనకపోతే బాగుండదు కనుక.

"ప్రోత్సహించండి. నా కభ్యంతరంలేదు. వక్తృత్వ పోటీలో హీనంగా ఉన్న పర్‌ఫార్మెన్సుకు ఫస్టు ప్రైజా ? పాటల పోటీలో కూడా ఎటువంటి తుక్కు-పాటకయినా పెద్ద ప్రైజా ! నా పేపరు ఆ ఆడపిల్ల పేపరు తెప్పించి కంపేర్ చెయ్యండి. నాకంటె ఆ అమ్మాయికి మరి రెండు అదనపు మార్కులా? ఎందుకు ఇదంతా ? మేథస్సునుబట్టి మార్కులా లేక ఆడవాళ్లు కనుక ప్రోత్సహించాలి కనుక ఎక్కువ వేసిన మార్కులా ? వాళ్లకోసం మమ్మల్ని డిగ్రేడ్ చేయట మెందుకు ? అందరినీ కలిపి ఫెయిర్‌గా ట్రీట్ చెయ్యండి. వాళ్ళను ముందుకు తీసుకురావటానికి మమ్మల్ని వెనక్కు పంపించాలా ? ఓపెన్ కాంపిటిషన్‌లో వాళ్ళు నిలవలేరా ?" అలుపన్నది తెలియకుండా వాదిస్తున్నాడు శ్రీపతి.

అతడికి ప్రిన్సిపల్ అంటే ఎంతో భక్తి-గౌరవమూ కాని-తన నిశ్చితమైన అభిప్రాయాలను వెల్లడించటానికి వెనుదీయటంలేదు.

"అవునోయ్. నీతో నేను ఏకీభవిస్తున్నాను. ఒకరిని ముందుకు తీసుకు రావటానికి ఇంకొకరిని వెనకబడ వెయ్యక్కర్లేదు. ఒకరిని ప్రోత్సహించటానికి ఇంకొకరిని నిరుత్సాహపరచకూడదు. వెల్ సెడ్ మై బాయ్." కుర్చీలోనుంచి లేచి వచ్చి భుజం తట్టాడు.

విద్యార్థుల బృందము-విద్యార్థినుల బృందము ప్రిన్సిపల్ దగ్గరికి విడివిడిగా ఒకసారి వెళ్ళి రిప్రజెంట్ చేశాయి. కలిసి వెళ్ళాయి ఒకసారి.

"తగు చర్య తీసుకోబడుతుంది" అన్నారు ప్రిన్సిపల్.

జనవరి, ఫిబ్రవరి నెలలు గడుస్తున్నాయి.

ఈ లోపల విద్యార్థినులు "అతడికేం శిక్ష పడుతుంది ?" అని ప్రశ్నించుకుంటున్నారు.

"బహుశః కాలేజినుంచి వెళ్లగొట్టేస్తారు."

"కొంతకాలం పాటు ఏ కాలేజీలోనూ చేరనీయకుండా చేస్తారు."

"ఇట్లాంటి పొగరుబోతులకు ఇటువంటి శిక్షే కావాలి."

"నన్నడిగితే ఇది కూడా చాలదు." ఈ మాట ఇందిర అన్నది ఉద్రేకంతో.

అందరూ ఉత్సాహంతో చప్పట్లు కొట్టారు. అందరూ గొల్లున నవ్వారు.

"ఆశమ్మా ! మా కందరికీ టీ పట్టుకురా ! ఎంతమందిమి ఉన్నమో లెక్క చూసుకో," ఇందిర పర్సులోనుంచి డబ్బు తీసి ఇచ్చింది.




"స్వీట్ పెట్టవా ఇందిరా ?" ఎవరో అడిగారు.

"ఇప్పటికిది చాలు. పని అయిన తరువాత మళ్ళీ ఇంకోసారి సెలిబ్రేట్ చేసుకుందాము" అంది ఇందిర హుందాగా.

పరీక్షలు ఏప్రిల్ మొదటివారంలో జరుగుతాయని నోటీసు బోర్డుమీద ప్రకటన విద్యార్థినీ విద్యార్థులంతా చదువుకున్నారు. చదువుల్లో మునిగి పోయారు.

ప్రిన్సిపల్ ప్రతి క్లాసుకూ వచ్చి బాగా చదవమని ప్రతి విద్యార్థినీ హెచ్చరిస్తున్నాడు. 'మన కాలేజి అన్ని కాలేజీలకంటె మంచి ఫలితాలను ఇవ్వాల'ని లెక్చరర్లకు కూడా హెచ్చరికలూ, మందలింపులూ చేస్తున్నాడు.

పరీక్షలు జరుగుతున్నాయి. విద్యార్థినీ విద్యార్థులు ప్రాణాలను బిగబట్టుకుని పరీక్ష రాస్తున్నారు.

ఆఖరి పరీక్ష కూడా వ్రాసిన తరువాత సాంస్కృతిక ఉత్సవాలు జరిగాయి. విద్యార్థి బృందము నాటకం వెయ్యాలనుకున్నారు. విద్యార్థిను లెవ్వరూ పాల్గొనమని ముందుగానే చెప్పారు. ఎంత బ్రతిమిలాడినా ఒక్కరూ కదిలి రాలేదు.

విద్యార్థులంతా స్త్రీ పాత్ర లేని నాటకం ప్రదర్శించారు. విద్యార్థినులు లలిత సంగీతం పాడారు. ఇందిర కథాకళి నృత్యం చేసింది.

బహుమతులను నిర్ణయించటంలో ఈ సారి విద్యార్థినీ విద్యార్థుల మధ్య పోటీ జరగలేదు. విద్యార్థులలో ఉత్తమ ప్రదర్శనకు–విద్యార్థినులలో ఉత్తమశ్రేణికి బహుమతులు లభించాయి.

"ఇందిరా ! శబాష్ ఇందిరా ! మొత్తానికి గెలిచావు." తోటి విద్యార్థినులంతా

ఆమెను అభినందించి భుజం తట్టారు.

"లేకపోతే ఏమిటి ? ఈ రోజుల్లో కూడా ఆడవాళ్లను నిరసించి అంతగా నోరు పారేసుకుంటాడా ? అతడిని ఏ పిల్ల పెళ్ళిచేసుకుని సుఖపడుతుంది ? అతడు కట్టిన తాళిని అతడి ముఖాన పారేసి వెళ్ళిపోతుంది."

"ఏ దురదృష్టవంతురాలో వేల మూటతో వచ్చి తాళి కట్టించుకుంటుంది."

"చూస్తూ ఉండండి. మొదటిరాత్రే అతడిని అవమానపరచి వెళ్ళిపోతుంది. అట్లా జరిగిందని ఒక సుప్రభాతాన మీరు వినకపోతే నా చెవి కోయించుకుంటాను." ఇందిర ఆ సమావేశానికి అధ్యక్షత వహించింది.

"ఆ పెళ్ళికూతురు మనలో ఒకరు కాకూడదు."

"నెవర్, నెవర్."

అందరూ చప్పట్లు కొట్టారు.

కాలేజి మూసివేశారు. ఫలితాలు తెలిశాయి. బి యస్సీ. ప్యాసయిన విద్యార్థినీ విద్యార్థులు ఎవరి మార్గాలను వారు ఎన్నుకున్నారు. కొందరు బి. ఇడి. కి అప్లై చేశారు. మార్కులు బాగా వచ్చినవారు ఎం. ఎస్సీ. లో చేరారు.

శ్రీపతి ఐ. ఐ టి. లో బెంగుళూరులో చేరాడు.

ఇందిర ఎం. ఎస్సీ. కి యూనివర్సిటీలో చేరింది.

కాలేజీ వదిలిపెట్టక ముందే రోషావేశంలో ఇందిర అన్నమాటలు తారుమారై ఊరంతా ప్రసారమైనాయి. శ్రీపతి పెళ్ళిచేసుకున్న నాటిరాత్రి తాను కట్టిన మంగళసూత్రాన్ని తీసుకువెళ్ళాడనీ–ఆ పెళ్ళికూతురు ఎవరో కాదు–కుమారి ఇందిర అనీ.

ఇందిర ఎం. యస్సీ. లో చేరిన తరువాత వివరాలతో కూడా ప్రచారమయిన వార్తను విన్నది. ముఖం పాలిపోయింది.

విసిరికొట్టిన బంతి తనకే వచ్చి తగిలింది !

* * *

"గంగా ! గంగా !"

రేగిన తలతో చీరెచెంగులు పైకి చెక్కుకుని–కొంగు తిప్పి దోపుకుని–మసి చేతులతో తలుపు తీసిన గంగను చూసి కొద్దిగా ఆశ్చర్యపడ్డది ఇందిర.

"బస్సులో వచ్చావా ? రా–లోపలికి" గబగబా వెళ్ళి చేతులు కడుక్కుని వచ్చింది గంగ.

"ముఖం కడుక్కున్నావా ? కాఫీ తెస్తాను." గంగ లోపలికి వెళ్ళి కాఫీ

చెయ్యటంలో నిమగ్నురాలయింది.

ఇందిర మెల్లగా లేచి జిప్ బ్యాగులోనుంచి తువ్వాలు బ్రష్షూ పేస్టూ తీసుకుని బాత్‌రూమ్ వెతుక్కుంటూ వెళ్ళింది.

చెప్పులు గబగబా విడిచిన చప్పుడయింది.

"గంగా! కాఫీ అయిందా? ఇప్పుడు గంటెంతో తెలుసా? మళ్ళీ నీకూ నాకూ టైమయిపోతుంది"

ఇందిర బాత్‌రూమ్‌లోనుంచి బయటికి వచ్చేసరికి నారాయణ చాకుతో బీన్సు కాయలను ఈనెలు తీసి సన్నగా కోసి పెడుతున్నాడు.

"ఇంకా నిప్పంటుకోలేదూ? పక్కకు జరుగు, నే నంటిస్తాను. ఇప్పుడు కొట్టుకు వెళ్ళొస్తున్నాను. సాయంత్రానికిగాని రాదుట కిరసనాయిలు." అగ్గి పుల్లతో కొబ్బరిపీచు వెలిగించి బొగ్గుల మధ్యగా పెట్టి విసురుతున్నాడు.

ఇందిర మెల్లగా వరెండాలో తను మొదట కూర్చున్నచోటికి వచ్చింది. వాకిట్లో పూలమొక్కలు బాగా ఎదిగి పూలు పూస్తున్నాయి. అన్నీ సీజనల్సు. రకానికి ఒక గుంపు. కన్నుల పండువుగా ఉందా వాకిలి. ఎక్కడా గడ్డి గాని, పిచ్చిమొక్కలు గాని లేవు. ఆ పూలను చూస్తూ అట్లా నిలబడిపోయింది ఇందిర.

"ఇందిర అని నా స్నేహితురాలు. మేమిద్దరం కొంతకాలం ఒక కాలేజిలో పనిచేశాము"

"అలాగా!"

"మీకు జ్ఞాపకం ఉందో లేదో? మన పెళ్ళిచూపులు వాళ్ళింట్లోనే జరిగాయి. పెళ్ళి పెత్తనం అంతా ఆమెదే. ఖర్చు కూడా చాలా పెట్టింది."

"ఆఁ ఆఁ ఇప్పుడు జ్ఞాపకం వస్తోంది. మా స్నేహితుడొకడు చెప్పాడు- శ్రీపతి అని ఒకాయన ఈమెను పెళ్లిచేసుకుని ఆ రాత్రే మంగళసూత్రం తెంపి తీసుకుపోయాడట కదా! అయితే ఈవిడ మళ్ళీ పెళ్లిచేసుకోలేదూ?" విసిరి విసిరి బొగ్గులు మంటచేసి నీళ్లగిన్నె దానిమీద పెట్టాడు.

గంగ అదొకమాదిరిగా నవ్వింది. ఆ నవ్వులో ఇందిరమీద సానుభూతి లేదు. నది ఈది ఒడ్డుకు చేరుకున్నవాడి ముఖంలో ఉండే సంతోషం కనబడ్డది.

ఇందిర అతడి మాటలు విన్నది. గంగ సమాధానం ఎట్లా ఉన్నదోనని వినటానికి ఆగింది. గంగ నవ్వు ఆపకముందే బ్యాగ్ చేతబట్టుకుని బస్‌స్టాండుకు నడిచింది.

ఇందిర కాలేజీలో విద్యార్థినులలో పేరు సంపాదించింది. వాళ్ల కే సమస్యా వచ్చినా ఇందిర మేడమ్ దగ్గరికి వచ్చి చెప్పుకుంటారు. ఆమె సానుభూతితో వాళ్లు చెప్పినదంతా వింటుంది. వాళ్ళకు అన్ని విషయాలలోనూ మంచి గైడెన్సు ఇస్తూ ఉంటుంది.

ఋతువులు మారుతున్నాయి. సంవత్సరాలు దొర్లిపోతున్నాయి. కాలచక్రం నిర్విరామంగా తిరుగుతోంది. ఇందిరలో ఒకవిధమైన మాంద్యము ప్రవేశించింది. తనలో కలుగుతున్న మార్పును ఇందిర గ్రహించుకుంది. గాని దానిని అధిగమించలేకపోతోంది.

ఒక ఊళ్ళోనే ఇంతకాలం ఉండటంచేత కలిగిన విసుగేమో ననుకుని పత్రికలలో వచ్చే ప్రకటనలకు దరఖాస్తులు పెట్టటం మొదలుపెట్టింది. ఒకటి రెండు చోట్లకు ప్రిన్సిపల్ పదవికి కూడా దరఖాస్తులు పెట్టింది.

విసరగా విసరగా ఒకరాయి తగిలింది. ఇంటర్వ్యూకి వెళ్లి ఔనసిపించుకుంది.

ఆ కాలేజి ప్రైవేటు కాలేజి. కాని-తాను ఇదివరకు పనిచేసిన కాలేజీకంటె పెద్దది. పిల్లలసంఖ్య కూడా ఎక్కువే. స్టాఫ్‌లో ఆడా మగా కలిసి ఉన్నారు. సుందర్ వైస్‌ప్రిన్సిపల్. అతడు కాక మరో అయిదుగురు మగవాళ్లున్నారు. స్టాఫ్ రూములు విడి విడిగా ఉన్నాయి. కాలేజి భవనం ఒక జమీందారుగారిదట. విశాలమయిన సావడులు, గదులూ వరెండాలూ ఉన్నాయి. జమీందారుల గత వైభవచిహ్నాలు ఆ భవనములో అంతటా కనబడతాయి. కిటికీలకు రంగు టద్దాలు, సావడులలో పెద్ద పెద్ద నిలువుటద్దాలూ-పెద్ద పెద్ద గాజుకుప్పెలలో దీపాలూ-భవనానికి రెండువైపులా సుందరమైన ఉద్యానవనాలు, వాటి మధ్య ఊట పంపులు-సిమెంటు బెంచీలు-అట్టహాసంగా ఉంటుందా భవనము.

ఆ జమీందారు ఆ భవనాన్ని పోషించలేక ఈ కళాశాలకు విరాళమిచ్చారని చెప్పుకుంటారు. ఆ కాలేజీ పేరు మహారాజావారి కళాశాల.

ఇందిర చార్జి తీసుకోగానే స్టాఫ్ అందరూ సమావేశమయి ఆమెను అనేక విధాలుగా అభినందించారు. చిరకాలము ఆమె ఆ కళాశాల ప్రిన్సిపల్‌గా ఉండి పోవాలని ఆశించారు. ఆమె తన అనుభవముతో కళాశాలను ఆదర్శవంతంగా తీర్చి దిద్ది అన్ని కళాశాలలకూ మార్గదర్శకంగా రూపొందించాలని వాంఛించారు.

వైస్‌ప్రిన్సిపల్ మాత్రం సర్వసామాన్యంగా మాట్లాడాడు. ఆమె ఈ కళాశాలకు ప్రిన్సిపల్‌గా వచ్చినందుకు తనకు సంతోషంగా ఉందని ఒక వాక్యం చెప్పి కూర్చున్నాడు.

ఇందిర పూలహారం తీసి బల్లమీద పెడుతూ స్టాఫ్ కంతకూ తనకు శుభా కాంక్షలు తెలిపినందుకు కృతజ్ఞతలు తెలిపింది.

"నేను ఈ కాలేజీలో ప్రిన్సిపల్‌గా నా శక్తిసామర్థ్యాలు చూపించటానికి మీ అందరి సహకారం నాకు కావలసి ఉంటుంది. నా మంచితనం కూడా మీ మీదనే ఆధారపడి ఉంటుంది. నా సామర్థ్యాన్ని మీరు గుర్తించి-సాగనిస్తేనే నేను ఆదర్శవంతంగా ఈ కళాశాలను తీర్చి దిద్దగలుగుతాను. మీ అందరి అండ దండలూ నాకు ఎప్పుడూ లభించాలి."

అందరూ అభినందనపూర్వకంగా చప్పట్లుకొట్టారు. అల్పాహార విందు జరిగింది.

దీని తరువాత సుందర్ ఆమెను ప్రతి క్లాసుకూ తీసుకువెళ్ళి చూపించాడు. క్లాసులన్నీ నిండుగా ఉండటం ఇందిర చూసింది. చాలా నిశ్శబ్దంగా ఉండటం కూడా గమనించింది.

ఆవరణంలోనే ఉన్న ప్రిన్సిపల్ లాడ్జిలో ప్రవేశించింది. ఆ యిల్లు లంకంత ఇల్లుగా ఉన్నట్టు ఆమెకు తోచింది. ఆమె ఒంటరిది. ఎంత చిన్నదయినా లంకంత ఉన్నట్టే ఉంటుందనుకుంది. ప్రిన్సిపల్ హోదాలో ఇంకెవరినీ ఆ యింట్లో కొంతభాగంలో ఉండమని అడగటానికి వీలులేదు. తల్లిదండ్రులను వచ్చి ఉండమని పిలిస్తే రారు.

ప్రిన్సిపల్ లాడ్జికి ఒక పనిమనిషి-ఒక మాలి ఉన్నారు. ఒక వంటమనిషిని తీసుకురమ్మని వాళ్ళకే చెప్పింది. పదిహేనురోజుల తరువాత ఒక ఇరవై ఏళ్ల అమ్మాయిని తీసుకువచ్చాడు మాలి. చూడటానికి చాలా బలహీనంగా ఉందా అమ్మాయి. ఒంట్లో నెత్తురుచుక్క ఉన్నట్టులేదు.

"నీ పేరు చెప్పు."

"జయ."

"ఇదివరకు ఎక్కడైనా వంటపని చేశావా ?"

"లేదండి."

"మరి వంట ఎట్లా వచ్చు ?"

"ఇంట్లో చేసే అలవాటుందండి"

"ఇంట్లో ఎవరున్నారు ? పెళ్ళయిందా ?"

"పెళ్లి అయిందండి. ఇంట్లో మా అన్నయ్య, వదిన, తమ్ముల ఉన్నారండి."

"ఇంతమంది ఉండగా వంటకు ఎందుకు కుదిరావు ? పెళ్ళయిందంటున్నావు,

అత్తవారింటికి వెళ్ళలేదూ ?"

ఆ ప్రశ్నలన్నీ అనవసరం అన్నట్టు చూసింది జయ

"నేను అన్నిరకాల వంటలూ చేస్తానండి. నమ్మకంగా పనిచేస్తాను. డ్యూటీని ఏమారను" అన్నది తలవంచుకుని.

ఇందిర నొచ్చుకుంది అనవసరంగా అన్ని ప్రశ్నలు వేసినందుకు. కాని ముఖ్యమైన ప్రశ్నకు జవాబు చెప్పలేదు జయ. ఇంకేముంటుంది ? ఆయనగారికి కట్నకానుకలు సరిగా అందలేదని తీసుకువెళ్ళకపోవచ్చు. లేక స్త్రీలోలుడై భార్యను విసర్జించి ఉండవచ్చు. ఏదయినా అతడు చేసిన పనే ఇది. అమ్మాయి చెప్పుకోలేక అభిమానపడుతోంది.

"నీవు ఇరవైనాలుగుగంటలూ ఇక్కడే ఉండాలి. పని ఉన్నా లేకపోయినా నీవు ఎప్పుడూ ఈ వరెండాలో ఉండి నేను పిలవంగానే పలకాలి. పని కాగానే పుస్తకాలు ఏవైనా చదువుకుంటూ కూర్చో. అన్నట్టు ఎందాకా చదివావు ?"

"మెట్రిక్ పాసయ్యాను."

"అలాగా ! అయితే కాలేజీ లైబ్రరీనుంచి పుస్తకాలు తెచ్చిస్తాను, చదువుకో."

"సరేనండి."

"నీకు జీతం ఎంత కావాలి ?"

జయ ఆమె ముఖంలోకి చూసింది. ఆమెకు ఎంత అడగాలో తెలియలేదు.

"నీ మీద ఎవరయినా ఆధారపడినవాళ్లు ఉన్నారా ?"

"లేరండి."

"నీవు వంటపనే కాకుండా నా స్వంతపనులు కూడా కొన్ని చెయ్యాలి. చాకలివాడికి బట్టలు వేయటం - ఇల్లు శుభ్రంగా ఉంచటం - వంటయింట్లోకి కావలసిన సామాన్లు కొనుక్కురావటం - మొదలైన పనులభారమంతా నీదే. డబ్బులెక్క మాత్రం కచ్చితంగా రాసి చూపించు, నీకు ఏభైరూపాయల జీతమిస్తాను. నాతోపాటు తిను - నాతోపాటు ఉండు. మీ వాళ్ళను చూడటానికి ఎప్పుడైనా వెళ్లితే వెళ్ళు. కాని సాయంత్రానికి ఇక్కడ హాజరుకావాలి. ఈ షరతులన్నీ నీ కిష్టమేనా ?"

"ఇష్టమేనండి."

తన పడకగది పక్కన ఉన్న గదిలో ఒక మంచం వేయించి ఆ గదిని జయకు ఇచ్చింది ఇందిర. వంటయింట్లో అన్నీ చూపించింది. తనకు ఏ వేళకు ఏమేమి చెయ్యాలో అవన్నీ చెప్పింది.

కాలేజీనుంచి ఇంటికి వచ్చి కాఫీ, టిఫిన్ అయిన తరువాత ఇంటిముందర లాన్‌లో ఇటూ అటూ తిరుగుతూ కాలక్షేపం చేసేది ఇందిర. ఎవరయినా వచ్చి కాసేపు కూర్చుని మాట్లాడితే బాగుండు ననిపించేది. 'సాయంత్రం మా లాడ్జికి రండి. కాసేపు కబుర్లు చెప్పుకుందామని' ఏ లెక్చరర్‌తోనయినా చెప్పాలనిపించేది కాని – అలా ఎవరికీ సన్నిహితంగా ఉండాలనిపించేది కాదు. లెక్చరర్లందరిలోకి సూర్యప్రభ ముఖం ఎప్పుడూ దీనంగా ఉంటుంది. పది లంఖణాలు చేసినట్టుగా హీనస్వరంతో మాట్లాడుతుంది. ఆమెపట్ల ఎందుకో ఇందిరకు చూడగానే జాలి కలిగింది. కాని పైకి కనబరచలేదు.

పలకరిస్తే చాలు, పదిసార్లు ఇంటికి వచ్చి ప్రిన్సిపల్‌ను కలిసి కబుర్లలోకి దింపాలన్నట్టుగా ఉంటుంది చంపకం లెక్చరరు. కాని – ఎందుకో ఆమెను చూడ గానే ఒక అడుగు వెనక్కి వెయ్యాబుద్ధి పుడుతోంది ప్రిన్సిపల్‌కు.

సుస్మిత అమిత చలాకీగా ఉంటుంది. వాగుడుకాయ. అంతగా వాగేవాళ్ళంటే ఇందిరకు విసుగు.

ఇలాగ ఒక్కొక్కరిని గురించీ తనకు కలిగిన అభిప్రాయాలను ధృవపరచు కుంటోంది ఇందిర.

మగలెక్చరర్లందరూ గౌరవంగా వినయంతో ఎవరిపనులు వాళ్ళు చేసుకు పోతున్నారు. ఎంత పట్టించుకోకపోయినా సుందర్ మాత్రం ఇందిరను ఆలోచింపచేస్తున్నాడు.

అడిగినదానికి కొలిచినట్లుగా జవాబు చెబుతాడు. ఏ పనికోసం ఆమెదగ్గరికి వస్తాడో ఆ పని చేసుకుని వెళ్ళిపోతాడు. ఆమె ఎంత చెబుతుందో అంతే చేస్తాడు. అంతకుమించి ఒక్కమాట అయినా నోటివెంట రాదు. అతడొక విచిత్రవ్యక్తిగా తోచాడామెకు.

ఆ కాలేజి ప్రిన్సిపల్‌గా ఏ విశేషమూ లేకుండా రోజులు గడుస్తున్నాయి ఇందిరకు.

ఒకనాడు హఠాత్తుగా సుస్మిత ప్రిన్సిపల్ గదిముందర నిలబడి "నేను లోపలికి రావచ్చా మేడమ్" అన్నది.

"రండి." రాస్తున్న కలానికి మూతపెట్టి చేతిలో పట్టుకుంది ఇందిర.

"వైస్‌ప్రిన్సిపల్ సుందర్‌గారు నేను వస్తుంటే గేటుముందర కనబడి ఈ ఉత్తరం మీ కిమ్మన్నారు మేడమ్." ఉత్తరం ప్రిన్సిపల్‌కు అందించింది సుస్మిత.

విప్పి చదువుకుంది ఇందిర.

సుస్మిత ఆమె ముఖాన్నే పరీక్షగా చూస్తోంది.

ఇందిర ఆ ఉత్తరాన్ని పక్కకుపెట్టి దానిమీద పేపరు వెయిటు పెట్టింది.

"ఆయన ఏదో గాభరాగా ఉన్నట్టు కనబడ్డారు మేడమ్. ఉత్తరం నా చేతిలో పెట్టి సైకిల్‌మీద రివ్వున వెళ్ళిపోయారు. దాన్నిబట్టి ఇంట్లో ఎవరికయినా బాగు లేదేమోననుకున్నాను. ఇది లీవ్ లెటర్ అనుకుంటూ లోపలికి వచ్చాను. రాగానే మీ కివ్వాలనే అనుకున్నాను. కాని నాకు ఫస్ట్ పీరియడ్ ఉండటంచేత క్లాసుకు వెళ్ళాల్సివచ్చింది. ఆయన ముఖంలో కనబడిన బాధ చూసి ఏమిటని అడుగుదా మనుకుంటూ ఉండగానే, వెళ్ళిపోయారు మేడమ్. సుస్మిత ఉపోద్ఘాతం మొదలుపెట్టింది.

"అవును. ఇది లీవ్ లెటరే, అత్యవసరంగా హాస్పిటల్‌కు వెళ్ళుతున్నానని వ్రాశారు. ఇంట్లో ఎవరికయినా జబ్బుగా ఉందేమో ?" కలం ఈ చేతిలోంచి ఆ చేతిలోకి మారుస్తూ అన్నది ఇందిర.

"మేడమ్ ! సుందర్‌గారి బ్రతుకు అందరిలాంటిది కాదు. ఆయనెంత తెలివిగలవాడో - ఎంత ఆదర్శపురుషుడో ఈ కాలేజీలో అందరికీ తెలుసు. కాని ఆయన బ్రతుకు ఉన్నదే అది ఆయన ప్రతిభను రాణించకుండా దిగలాగు తున్నది. ఆయన బ్రతుకు జవాబులేని ఒక ప్రశ్న. ఆ మనిషి ఎప్పుడూ దేనిని గురించో ఆలోచిస్తూ ఉండటం మీరూ గమనించే ఉంటారు. అది తెగని ఆలోచన, మేడమ్. క్షమించడి. మీరు అడగకుండానే ఆయననుగురించి చెప్పే శాను." సంభాషణ చటుక్కున ఆపేసింది ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా.

"మనమేంచేయగలం" అన్నట్టు తల ఆడించింది ఇందిర.

"నేను సెలవుతీసుకుంటాను మేడమ్." సుస్మిత వెళ్ళిపోయింది.

స్టాఫ్ రూములో ఆ రోజు సుందర్ రాని విషయాన్ని గురించే అందరూ మాట్లాడుకున్నారు. అందరూ తలొక అభిప్రాయమూ వెలిబుచ్చారు.

"అప్రయోజకుడూ, అసమర్థుడూను సుందర్. తెలివితేట లుండగానే సరా ! తెలివితో డిగ్రీలు సంపాదించాడుగాని జీవితాన్ని జయించలేకపోతు న్నాడు." పెదవులు చప్పరించాడు రామశేషయ్య. ఆయన పొలిటికల్ సైన్సు బోధించే ఆచార్యుడు.

"ఆయన్నేం చెయ్యమంటావయ్యా ! పరువుకు ప్రాకులాడతారు కొందరు. ప్రాణంపోయినా మాట బయటికి పొక్కరు కొందరు. బురదమీదికి రాయి విసిరితే మన ముఖమ్మీదికి చిందుతుందని తప్పుకు తిరుగుతారు కొందరు. ఆ కోవకు

ఉంటున్నాడు సుందరం. నాకు ఆయినను చూస్తే ఎంత పూజ్యభావమో అంత జాలి కలుగుతుంది. మహానుభావుడు." రామకృష్ణ మందలింపుగా అన్నాడు.

తల పంకించారు స్టాఫంతా.

"ఎవరిజీవితం ఎలాటి మలుపులు తిరుగుతుందో మనం చెప్పలేము" అనుకున్నారు చివరకు.

సరిగ్గా ఈ సమయంలోనే లేడీస్‌రూమ్‌లో సూర్యప్రభ చుట్టూ మూగారు ఉపన్యాసకురాండ్రంతా.

తలుపుదగ్గర పడిపోయిన సూర్యప్రభను నలుగురు సాయంపట్టి సోఫామీద పడుకోబెట్టారు. ముఖమ్మీది చెమటను తుడిచారు. వేడి వేడి కాఫీ తెప్పించారు. చంచాతో నోట్లో పోశారు. ఫాను పెట్టారు. ఆమె ఎప్పుడు కళ్ళు తెరుస్తుందా అని ఆమె ముఖంలోకి చూస్తూ కూర్చున్నారు.

పావుగంట తర్వాత సూర్యప్రభ కళ్ళు తెరిచింది. "ఎందుకిలా చుట్టూ కూర్చున్నారు ?" నీరసంగా హీనస్వరంతో ప్రశ్నించింది సూర్యప్రభ.

"ఎందుకా ? నేను పట్టుకోకపోయినట్లయితే తల పగిలిపోయి ఉండేది నీకు ? నిజం చెప్పు, అన్నం తిని ఎన్నాళ్ళయింది ? పిల్లలకయినా అన్నం పెడుతున్నావా ? ఇంత సంపాదించుకుంటూ నీకీ గతేమిటి ?" మందలించింది చంపకం.

శుష్కించిన చెంపలలో గుంటలేర్పడేటట్టు నవ్వింది కప్పు కాఫీతో ప్రాణం లేచివచ్చిన సూర్యప్రభ.

"ఆ నవ్వెందుకు ? నీ ప్రయోజకత్వానికా లేక నీ అదృష్టానికా ? దేవుడు తెలివితేట లిచ్చాడు, చదువుకున్నావు. అదృష్టవంతురాలివి. ఉద్యోగం స్వంత ఊళ్లోనే దొరికింది. ఇంకా అదృష్టవంతురాలివి — చేసుకున్నవాడికి కూడా ఈ ఊళ్ళోనే బదిలీలేని ఉద్యోగం. కడుపున ఇద్దరు పిల్లలు పుట్టారు. చక్కగా స్కూలుకు వెళుతున్నారు నీకేం తక్కువైందని ఇలా ఈసురోమంటూ బ్రతుకుతున్నావు ? నీకంటె మన అప్పలమ్మ నయం. చూడు, ఎప్పుడూ నవ్వుముఖంతో కళకళలాడుతూ ఉంటుంది. సంతోషమే సగం బలము చూశారో లేదో ?" చంపకం ఆగకుండా మాట్లాడేస్తోంది.

బరువుగా నిట్టూర్చి లేచి కూర్చోబోయింది సూర్యప్రభ.

"వద్దు, వద్దు. కాసేపు అలాగే పడుకో. అప్పలమ్మ, పళ్ళరసం తీసుకురావటానికి వెళ్ళింది. తాగిన తరువాత లేద్దువుగాని." అందరూ ఒక్కమారుగా

వారించారు సూర్యప్రభని.

"అబ్బ ! ఎంతమందిని ఇబ్బందిపెట్టాను ? మీ కెందుకర్రా నా మీద ఇంత అభిమానం ? చంపకం ? నా మీద ఇంత జాలి నీ కెందుకు ? నా పుట్టుకే దురదృష్టకరమైనది." వినీ వినబడకుండా అని పక్కకు తిరిగింది సూర్యప్రభ.

"ఎందుకా ? మేమంతా మనుష్యులమైనందుకు ?" టక్కున జవాబిచ్చి అప్పలమ్మ తీసుకువచ్చిన పళ్ళరసం తాగించింది సూర్యప్రభచేత చంపకం.

స్టాఫ్ రూమ్‌లో అందరిమధ్యా ప్రసూతి వైరాగ్యంలాంటి భావము సంచారం చేసింది.

"ఎంత చదివినా ఎంత సంపాదించినా స్త్రీల బ్రతుకింతే" ననుకున్నారు ఒక్కసారిగా.

"పెళ్ళిచేసుకుంటే ఒక్కడితో బాధ - చేసుకోకపోతే పది మందితో బాధ. ఈ బాధామయ జీవితం స్త్రీకే ఎందుకు సృష్టించబడ్డది ?" చంపకానికి కలిగిన శేష ప్రశ్నకు అందరూ తలలెత్తి చూశారు.

"ఎందుకో నేను చెప్పనా ? సృష్టికర్త మగవాడు కనుక." చటుక్కున జవాబిచ్చింది సుస్మిత.

"సృష్టికర్త కూడా మగబుద్ధి పోనిచ్చుకున్నాడు కాదు" అంది చంపకం వెంటనే.

"అదికాదు సిస్టర్స్. నే నొక్కమాట చెబుతాను వినండి. చదువుకున్నా సంపాదించి తనకాళ్ళమీద తాను నిలబడినా స్త్రీ బానిస అన్న భావము మగ సమాజంలోనుంచి పోదు. ఈ దోపిడీదారి విధానంలోనుంచి ఏ మహానుభావుడో అవతరించి స్త్రీని విముక్తను చెయ్యాలి. అప్పటివరకూ ఈ బ్రతుకులు ఇంతే" సుస్మిత ఖండితంగా చెప్పింది.

"మహానుభావుడు అంటున్నావు ! వాడూ మగవాడేగా ?" ప్రశ్నించింది చంపకం.

"అసలు స్త్రీని ఇంతవరకూ పైకి తీసుకువచ్చింది మహానుభావులేగా ?" శ్రీదేవి అన్నది సన్నగా.

"అణగద్రొక్కిందీ మగవాళ్ళేగా ?"

శ్రీదేవికి నవ్వొస్తోంది ఈ సంభాషణ వింటుంటే. కాని సూర్యప్రభ అలా ఉండగా నవ్వటానికి ఇష్టంలేక అణచుకుంటోంది. సూర్యప్రభ పళ్ళరసం తాగిన తరువాత లేచి కూర్చుంది. ముఖమ్మీది వెంట్రుకలను పక్కకు తోసు




కుంటూ "మీ కందరికీ నా కృతజ్ఞతలు. ఇవాల్టికి నన్ను బ్రతికించారు." చేతులు జోడించింది.

"ఆ. మేము బ్రతికిస్తూ ఉంటాము. ఇంటికి వెళ్ళి వెట్టిచాకిరీచేసి చస్తూ ఉండు మీ ఆయనకూ, పిల్లలకూ నీ ప్రాణాలు ధారపోస్తూ ఉండు " విసుక్కున్నది చంపకం.

"పిల్లలంటే మగపిల్లలా లేక ఆడపిల్లలనా నీ ప్రశ్న ?" అన్నది శ్రీదేవి.

"ఎవరయితేనేం చంపుకుతినటానికి ?" ఆవేదనతో అన్నది చంపకం.

"అయితే పిల్లలు కూడా దోపిడీదారులే నన్నమాట !" శ్రీదేవి ఆపుకోలేక కిసుక్కున నవ్వేసింది.

"ఆ హా ! ఎవరయితే నిర్విరామంగా స్త్రీచేత వెట్టిచాకిరీ చేయించుకుంటారో వాళ్ళంతా దోపిడీదారులే." చంపకం శ్రీదేవి అడుగుతున్నకొద్దీ ఖండితంగా జవాబిస్తున్నది.

"అయితే స్త్రీకి విముక్తి కలగాలంటే పెళ్ళి వద్దు – పిల్లలూ వద్దు. అంతేనా!" శ్రీదేవి ఉండబట్టలేక ప్రశ్నించింది.

"అంతే అంతే." సుస్మిత చంపకం ఒక్కసారే అన్నారు.

"అయితే అటువంటి వ్యవస్థకోసం నారీలోకం ఎదురుచూడాలంటారు ?"

"తప్పకుండా. ఇది మహిళా దశాబ్దం అన్నమాట మరిచిపోకూడదు. ఈ దశాబ్దం అయ్యేవరకయినా మనం అభ్యుదయాన్ని సాధించలేకపోతే మన చదువులూ – మన సామాజిక స్పృహా – మన చైతన్యం – అంతా వృధా

వృధా !" చేతులు తిప్పుతూ చటుక్కున లేచి బ్యాగ్ అందుకున్నది చంపకం.

అందరూ లేచి సూర్యప్రభని రిక్షాలో కూర్చోబెట్టి "జాగ్రత్తగా ఇంటికి వెళ్లు. కావాలంటే రేపు సెలవుపెట్టు," అని సలహా ఇచ్చారు.

"అమ్మా తల్లుల్లారా ! మీ కిద్దరికీ పెళ్ళిళ్ళు కాలేదని అందరికీ ఇటువంటి సలహా లిస్తున్నారా ? పెళ్ళయితే వద్దుగాని మగవాళ్ళ చుట్టూ తిరుగుతూ ఉండాలా ? అబ్బ అబ్బ ! ఏం సలహాలు !" గొణుక్కుంటూ శ్రీదేవి ఇంటిదారి బట్టింది.

"చంపకం ! కన్యా - కుమారి సినిమాకు వెళదామా ? మా యింటికి వచ్చెయ్యి. ఇద్దరం అక్కడినుంచి వెళ్దాము." భుజాలమీద చేతులు వేసుకుంటూ నడిచారు చంపకం, సుస్మిత.

* * *

క్లాసులు మొదలయిన తరువాత కాలేజి అంతా ఒకసారి చుట్టిరావటానికి బయలుదేరింది ఇందిర. కొన్ని క్లాసులు నిశ్శబ్దంగా ఉన్నాయి. లెక్చరర్లు విసుక్కోకుండా పిల్లల ప్రశ్నలకు జవాబులు ఇస్తున్నారు. అంతా ఒక్కసారి కలయతిరిగి తన రూముకు వెళ్ళుతున్న ఇందిరకు ఉపాధ్యాయినుల గదిలోనుంచి వస్తున్న మాటలు స్పష్టంగా వినబడ్డాయి. మెల్లగా అడుగులువేస్తూ వాళ్ల సంభాషణ ఆసాంతంగా విన్నది ఇందిర.

ఆమె మనసును సుందర్ ఒకప్రక్క సూర్యప్రభ ఒకప్రక్క వాళ్ల బాధలతో క్రుంగిపోతున్నట్టుగా కనబడుతూ పీడించటం మొదలుపెట్టారు.

సూర్యప్రభ బాధలు ఏమిటి ?

సుందర్ గృహచ్ఛిద్రాలు ఏమిటి !

అందరికీ ఏదో ఒకరకమైన గృహకల్లోలాలు ఉంటాయి కాని చదువుకున్న భార్యాభర్తలమధ్య అందులోనూ సంపాదనాపరులమధ్య ఎటువంటి సంబంధ సామరస్యాలు ఉంటాయి ! ఆమెకు ఉండి ఉండి సుస్మిత చంపకంల సంభాషణలు చురుక్కుమనిపిస్తున్నాయి.

మూడవనాడు సుందర్ కాలేజికి వచ్చాడు. తోటి లెక్చరర్లంతా అతడిచుట్టూ మూగి ఏమిటేమిటని ప్రశ్నిస్తున్నారు. ఏదో చెప్పి లోపలికి వచ్చాడు సుందర్. అంతలో ప్రిన్సిపల్ దగ్గర్నించి రమ్మని కబురు.

"మీరు ఇంకా రెండురోజులు సెలవు పొడిగించకపోయారా ? ఇప్పుడైనా కావాలంటే తీసుకోండి." కూర్చోమని కుర్చీ చూపిస్తూ అన్నది ఇందిర.

ఆతడు తల దించుకున్నాడు. గుండె బరువెక్కినట్లయింది. కళ్ళు చెమ్మ గిల్లినట్లయింది. పైకి కనబడకుండా ప్రయత్నిస్తున్నట్లు కనిపెట్టింది ఇందిర.

"మీరు తొందరగా హాస్పిటల్‌కు వెళ్ళుతున్నానని వ్రాశారు. ఏం జరిగింది ? అంతా క్షేమంగా ఉన్నారా ?" ప్రిన్సిపల్ హోదాలో మర్యాదకోసం అడిగింది ఇందిర.

"అవును మేడమ్. నా భార్యను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాల్సి వచ్చింది. అక్కడ రెండురోజులు ఉంచుకున్నారు. నిన్న సాయంత్రం తీసుకువచ్చాను" తలవంచుకునే చెప్పాడు.

"ఇప్పుడు నెమ్మదిగా ఉన్నారా ? హఠాత్తుగా జబ్బుచేసిందా ?" సహజ ధోరణిలో అడిగింది ఇందిర.

"ఇప్పుడు బాగానే ఉంది. జీర్ణకోశం కడిగి అంతా సర్దుకోవటానికి ఏదో మందిచ్చారు. పంపించేశారు ఇంటికి." నోరు జారి చెప్పినట్టుగా చటుక్కున సర్దుకున్నాడు.

గ్రహించుకున్నది ఇందిర. సరే ఇప్పుడు క్షేమంగా ఉన్నారుకదా. అవసరమయితే మరో రెండురోజులు సెలవు తీసుకోండి" అన్నది.

"అవసరంలేదు మేడమ్. మీరు నా పట్ల చూపించిన సానుభూతికి నా కృత జ్ఞతలు." మెల్లగా అడుగులు వేసుకుంటూ గది దాటి వెళ్ళాడు.

'విచిత్రమైన మనిషిలా ఉన్నాడు. మనసులో ఉన్న బాధను ఎవరికీ చెప్ప కోలేకుండా ఉన్నాడు' అనుకున్నది ఇందిర. మనిషి బాలా కుంగిపోయినట్లు కనిపిస్తున్నాడు. డబ్బు ఇబ్బందో-లేక గృహచ్ఛిద్రాలో ? రెండూ తీరేవి కాక పోవచ్చు ననుకున్నది.

ఇందిర లాడ్జిలోకి రాగానే జయ ఎదురుగా వస్తుంది. ఏ వేళకు ఏమి కావాలో అవన్నీ అమర్చి పెడుతున్నది. కమ్మటి వంటకాలు చేసిపెడుతున్నది. ఆమె అలవాట్లను బాగా తెలుసుకుని మసలుకుంటున్నది. ఎంత చనవుగా ఇందిర పలకరించి మాట్లాడినా తన పరిధిలోనే ఉంటున్నది.

భోజనం చేస్తూ 'జయా' అని పిలిచింది ఇందిర.

"ఏమిటమ్మా ?" నమ్రతతో పలికింది జయ ఎదురుగా వచ్చి.

"నీ జీతం ఏంచేస్తున్నావు ?"

"నాకు ఖర్చు లేమున్నాయమ్మా. మీరిచ్చినదంతా ఒక కవరులో వేసి జాగ్రత్తచేశాను."

"జాగ్రత్తచేసి ఏంచేస్తావు ?"

"ఏం చేయటానికీ తోచక జాగ్రత్త చేస్తున్నానమ్మా. భోజనం, కాఫీ మీ దగ్గరే గడచిపోతున్నాయి. చీరెలు, జాకెట్లు కూడా మీ రిచ్చినవే ఉపయోగిస్తున్నాను. నా కింతకంటె ఏంకావాలమ్మా ?"

"మీ వాళ్ళకు పంపించవా ?"

"మా కెందుకు నీ డబ్బు అని అంటున్నారు."

"ఇదీ బాగానే ఉంది. ఒకపని చేస్తావా ?" జయ ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది ఇందిర.

"చెప్పండమ్మా."

"నేను వేరే వంటమనిషిని పెట్టుకుంటాను. నీవు కాలేజిలో చేరి చదువుకో. చిన్నదానవే కదా. చదువుకొని ఏదయినా గౌరవంగల ఉద్యోగం చేద్దువుగాని. నీ చేత వంటపని చేయించటం నాకు చాలా కష్టంగా ఉంది. ఏమంటావు?"

"వద్దమ్మా వద్దు. నాకు అన్ని ఉద్యోగాలకంటె ఈ పనే బాగుంది. ఎప్పటికీ మీ అండ నేను విడవను. నా జీవితమంతా మీ చాటున ఇలా గడిచిపోనీయండి. నా కింతకంటే ఏ ఆశలూ, ఆశయాలూ లేవు." దీనంగా చూసింది జయ.

"నీకు కోరికలు లేవంటే నాకు ఆశ్చర్యంగా ఉంది. ఈ రోజుల్లో కోరికలు లేనివాళ్ళున్నారంటే వింతసంగతే."

"నిజంగానమ్మా నాకే కోరికా లేదు."

ఎన్ని ప్రశ్నలు వేసినా జయ గతజీవిత మేమిటో ఇందిర ఆమెనుండి రాబట్టలేకపోతున్నది.

"జయా ! నీకు పెళ్ళయిందా ?"

జయ ఇందిర ముఖంలోకి ఆదొకమాదిరిగా చూసింది. అడిగినదానికి సమాధానం చెప్పకపోవటం అమర్యాదనిపించుకుంటుందని తెలుసు. చేతులు నులుపుకుంటూ కొంతసేపు నేలచూపులు చూసింది. చివరకు "నాకు పెళ్లయిందని మొదటిరోజే చెప్పానండి." అన్నది.

"ఆఁ హాఁ. అయితే నీ డబ్బంతా కొత్తకాపురంకోసం దాస్తున్నావన్న మాట !" వింతగా చూసింది జయ ముఖంలోకి

కాదని తల అడ్డంగా ఊపింది జయ.

ఇందిర జయ ముఖంలోకి చూసేసరికి జయ కళ్లల్లోనుంచి కన్నీటిబొట్లు చెంపలమీదుగా జారుతున్నాయి.

"జయా! పట్టి పట్టి అడిగి నిన్ను ఏడిపించాను. మరింకెప్పుడూ ఆ ప్రశ్న అడగనులే." చటుక్కున లేచి వచ్చి జయ చేతులు పట్టుకున్నది ఇందిర.

"మీ రింతగా అడుగుతుంటే చెప్పకుండా ఉండలేను. కాని-కాని-ఇప్పుడు కాదు. మరొకసారి చెప్తాను. నన్ను క్షమించండమ్మా." ఇందిర రెండుచేతులూ తీసుకుని కళ్ల కద్దుకున్నది జయ.

"భోజనంచేసి హాయిగా నిద్రపో. నే నడిగిన ప్రశ్న కూడా మరిచిపో." ఇందిర లేచి తన గదిలోకి వెళ్ళింది పేపరు చేతబట్టుకుని.

ఇందిర డ్రెస్ చేసుకుని కాలేజికి వెళ్ళాలని బయలుదేరుతుండగా ఒక సన్నటి ఆకారం పసిబిడ్డను భుజాన వేసుకుని ఒక చేతిసంచితో తోటలోనుంచి తన లాడ్జి వైపుకు నడిచివస్తూ ఉండటం చూసి నిలబడిపోయింది ఇందిర.

ఆ ఆకారం దగ్గరికి వస్తున్నకొద్దీ గంగగా గుర్తించి సంతోషాన్ని పట్టలేక పోయింది ఇందిర. "గంగా! గంగా!" అంటూ సంతోషంకొద్దీ నాలుగడుగులు ముందుకువేసి గంగను కౌగలించుకుంది. సంభ్రమం కాస్త తగ్గిన తరువాత-"గంగా! ఇలా తడకలా అయిపోయావేమిటి? జబ్బేం చెయ్యలేదు కద! పిల్లా? పిల్లవాడా? నాకు ఒక్క ఉత్తరమయినా రాయలేదు కదూ? మన స్నేహాన్ని అట్లా క్షణాలమీద ఎట్లా మరిచిపోయావు గంగా!" భుజంమీద చెయ్యివేసి లోపలికి తీసుకువెళ్లింది.

"జయా! కప్పు కాఫీ, టిఫిన్ అర్జంటుగా తీసుకురా." కేకపెట్టింది.

కాఫీ టిఫిన్ తీసుకుంటున్నంతసేపూ గంగను ప్రశ్నించకుండా చూస్తూ ఉండిపోయింది. గంగ ముఖంలోకి ప్రాణం వచ్చినట్లనిపించింది.

"గంగా, వేడినీళ్లిస్తుంది జయ. నీ పిల్లా నీవూ స్నానాలు చేయండి ఆ గదిలో నీవు రెస్టు తీసుకో. నే నొక్క గంటలో వచ్చేస్తాను"

ఇందిర వెళ్ళగానే స్నానంచేసి పిల్లకి నీళ్ళుపోసి అన్నం పెట్టింది గంగ. ఎన్నాళ్లనుంచో నిద్ర లేనట్టుగా మంచంమీద అడ్డంగా పడుకుని నిద్రపోయింది గంగ.

అనుకున్నట్టుగా ఇందిర ఒక గంటలో రాలేకపోయింది. ఒంటిగంటకు పని పూర్తిచేసుకుని లాడ్జికి వచ్చి గంగ నిద్రను చూసి విస్తుపోయింది.

తను రెండుగంటలకు ఆఫీసు రూమ్‌లో ఉండాలి. అర్జంటు పనులు ఉన్నాయి. గంగను లేపి తన పంక్తిన భోజనానికి కూర్చోబెట్టాలని ప్రయత్నించి విఫలురాలైంది.

"జయా ! గంగ లేచినప్పుడే వడ్డించు. పాపం, బాగా అలసిపోయినట్టుంది. లేపకు. నీవు మాత్రం భోజనం చెయ్యి." ఇందిర కాలేజికి వెళ్లిపోయింది.

సాయకాలం ఇంటికి రాగానే "జయా ! కాఫీ టిఫిన్ తీసుకురా," అంటూ బల్ల ముందరికి కుర్చీ లాక్కుని కూర్చుంది ఇందిర.

"ఆ గదిలో ఉన్న అమ్మగారికి కాఫీ, టిఫిన్ ఇచ్చావా ?" అని అడుగుతూ, "గంగా ! గంగా !" అని గట్టిగా పిలిచింది ఇందిర.

"ఎందుకు ఆగావు గంగా నా కోసం ? నీ వేళకు నీకు కావల్సింది ఇవ్వమని చెప్పాను జయకు. అడిగి తీసుకోకూడదూ ?" మందలించింది ఇందిర.

"అడిగాను. తీసుకున్నాను." టక్కున చెప్పింది గంగ.

"ఆఁ సరే. మంచిపని చేశావు. ఇంక చెప్పు నీ సంగతి. సెలవు పెట్టావా ? సెలవు లిచ్చారా ? పిల్ల కెంత వయసు ?" కాఫీ తాగుతూ మధ్య మధ్య ప్రశ్నలు వేస్తున్నది ఇందిర.

మామూలు కబుర్లు అయిన తరువాత "ఉద్యోగం ఎట్లా ఉంది ? మీ ఆయన ఇల్లు కట్టాడా ? ఇద్దరి సంపాదన ఏంచేస్తున్నారు ?" అడిగింది ఇందిర.

"ఇల్లూ లేదు – ఏంలేదు. ఆయన సంపాదనను గురించి నేను ఒక్క ప్రశ్నయినా వెయ్యటానికి వీల్లేదు."

"పోనీ నీ సంపాదనేంచేస్తున్నావు ?"

"ఇంటికి ఖర్చుచేస్తున్నాను "

"చెయ్యమని చెప్పాడా ?"

"నోటితో చెప్పలేదనుకో. నేను తీసుకువచ్చేవరకూ ఇంట్లో ఏ వస్తువా ఉండదు. 'కావాలంటే తెచ్చుకో' అన్న పాలిసీ."

"పోనీ యింట్లో సంతోషంగా అయినా ఉంటున్నారా ?" గంగ ముఖంలోకి చూసింది ఇందిర.

ఇందిర చూపులు తప్పించుకుంటూ "ఇందిరా ! నీ కాలేజిలో ఏదయినా పోస్టు ఉంటే చూడు" అంది గంగ.

అదిరిపడ్డట్టు లేచి నిలబడ్డది ఇందిర. "ఎవరికి ?"

"నాకే."

"నీకా ? నీకయితే లెక్చరరు పోస్టు కావాలి. మరి ఏదయినా అంటావేం ?"

"అదేలే."

"ఎందుకు ? నీవు పనిచేస్తున్న కాలేజి బాగుండలేదా ?" అనుమానిస్తూ ప్రశ్నించింది.

"కాలేజికేం బాగానే ఉంది."

"మరింకెందుకు? ఉన్న ఉద్యోగాన్ని వదిలిపెట్టుకుని కొత్త దాని కోసం పాకులాడ్డంలో అర్థం? లేనివాళ్ళు ఉద్యోగం లేదో అని ఏడుస్తున్నారు. ఉన్న దాన్ని నీవేమో వదిలిపెడతానంటున్నావు అసలు సంగతేమిటో నాకు ఉన్న దున్నట్లుగా చెప్పు."

"చెబితే సహాయం చేస్తావా?"

"చేస్తాను. కాని నాక్కూడా సబబనిపిస్తేనే సుమా!"

"సంసారంలో నే నాశించిన సుఖం కనబడలేదు ఇందిరా. పైగా ప్రతిరోజూ దెబ్బలాడుకుంటూ జీవించటం-ఒక యింట్లోనే పడిఉండటం-నాకు అసహ్యమని పిస్తోంది. పైగా ఈ పిల్ల బాధ్యత ఆయనకేం లేదట. చీటికీ మాటికీ దెబ్బలాడు కుంటూ ఉండేకంటె ఇద్దరం చెరొక ఊళ్లో ఉంటేనయినా గౌరవం ప్రేమా కలుగుతాయేమో, ఇంత చదువుకుని సంపాదిస్తూ కూడా అజ్ఞానుల్లా బ్రతకా లంటే అసహ్యంగా ఉంది ఇందిరా!"

"నీవు ఎటువంటి వాడితోనయినా సర్దుకుని బ్రతుకుతానన్నావు. మనసు మార్చుకున్నావా?"

"లేదు ఇందిరా. నేనూ అలాగే అనుకుని సర్దుకున్నాను. కాని-సర్దుకున్న కొద్దీ బాధ ఎక్కువైపోవటం మొదలుపెట్టింది. ఏమీ చదువుకోకుండా డబ్బు హక్కులూ అన్నమాట ఎరక్కుండా మీ అమ్మ ఎంత సుఖంగా కాపరం చేస్తున్నదో కళ్ళారా చూసాను ఇందిరా. దమ్మిడీ సంపాదించకుండానే డబ్బు తన చేతిలో పెట్టుకుని ఎంతో స్వతంత్రంగా సంతోషంగా బ్రతుకుతోంది మీ అమ్మ. అలాంటి సుఖం ఏ చదువుకున్న అమ్మాయైనా అనుభవిస్తోందంటావా? నాకు నమ్మకం కుదరటంలేదు." గంగ పెదవి విరిచింది.

"ఎందుకు అనుభవించకూడదు? సుఖానికీ, సంతోషానికీ కావలసిన హంగు లన్నీ ఉన్నప్పుడు అనుభవం లేదంటే వ్యక్తుల లోపమన్నమాట."

"నీవు ఏదయినా అనుకో. పోనీ-నాలోనే లోపం ఉందనుకో. ఇప్పుడు నేను మారమంటే మార్తానా చెప్పు!"

"ఎందుకు మార్తావు? అందునా సంపాదనాపరురాలివి. నీకేం ఖర్మ?"

"అదుగో, నన్ను వెక్కిరిస్తున్నావు కదూ?"

"లేదులే. నిదానంగా ఆలోచిద్దాం ఆ సంగతి. పిల్లకు పాలు పట్టావా?"

సినిమాకు టికెట్లు తెప్పించనా ? వస్తావా ?" లేచింది ముఖం కడుక్కోవటానికి ఇందిర.

గంగ మాట్లాడకుండా లేచి గదిలోకి వెళ్ళింది. చీరె మార్చుకుని, పిల్లకు బట్టలు మార్చి ఇందిరకంటె ముందుగా హాల్లోకి వచ్చి కూర్చుంది.

"జయా ! నీవు కూడా బయలుదేరు. మనం ముగ్గురం వచ్చేటప్పుడు హోటల్లో భోజనంచేసి వద్దాము."

ముగ్గురూ భోజనాలుచేసి ఇల్లు చేరుకునేసరికి పదిన్నర దాటింది. ఇందిరకు పక్కమీద వాలగానే ఎందుకో సుందర్ జ్ఞాపకం వచ్చాడు. సినిమాలో హీరో కూడా అతడిలాగే ఉన్నాడు. తను విన్నంతవరకూ సుందర్ జీవితంలాగే ఉంది ఆ హీరో జీవితం.

ఈ అపశృతికి కారణం ఏమిటి ? ఎవరిది తప్పు ? ఆలోచించి సమస్యను పరిష్కరించలేక నిద్రలోకి జారుకుంది ఇందిర.

* * *

ఉన్నట్టుండి మహారాజావారి కాలేజిలో ఫిజిక్సు లెక్చరరుకు జబ్బుచేసింది. అసలే బాలెంత అందులో ఇరవై రోజులు దాటీ దాటకుండానే పనిలో చేరింది. ఇంట్లో పని-పసిబిడ్డ-కాలేజిలో పని-దానా దీనా బాగా అలసిపోయింది. లోజ్వరం ప్రతిరోజూ వస్తుంటే టి. బి. లక్షణాలున్నాయని డాక్టరు సెలవు పెట్టించాడు.

అప్లికేషను చూడగానే ఇందిరకు మెరుపులాంటి ఊహ మనసులో మెదిలింది. తక్షణం ఏడాది సెలవు గ్రాంటుచేసింది.

లాడ్జికి చేరుకోగానే గంగను పిలిచింది.

"నన్ను నీ యింట్లోనే ఉంచేసుకుంటావా ఇంత తిండి పడేసి ?" ముఖం మాడ్చుకుని ఎదురుగా ఉన్న కుర్చీలో విసురుగా వచ్చి కూర్చుంది గంగ.

"ఒక్క తిండేనా ? మందు లిప్పించటంలేదూ నీ కూతురికి ?" పెదవుల మీది చిరునవ్వును బిగబట్టి గంభీరస్వరంతో అంది ఇందిర.

"ఇప్పించావులే. నెత్తిమీద కూర్చుంటే మందిప్పించక ఏంచేస్తావు ? ఇలాగే ఉంటే కొన్నేళ్ళకు పెళ్ళికూడా చెయ్యాలి మరి."

"అది సరే గాని-నీకు ఉద్యోగం చెయ్యాలని గట్టిగా ఉందా ? మీ ఆయన ఉన్న ఊళ్ళో ఉద్యోగానికి రిజైను చెయ్యటం ఖాయమేనా ?"

"ఖాయమే. ముమ్మాటికీ ఖాయం. ఎక్కడయినా ఉద్యోగం దొరికిన మరునాడు ఆ ఉద్యోగానికి రాజీనామా. ఇదిగో, రాసి ఉంచుకున్నాను సిద్ధంగా."




''సరే అప్లికేషను పెట్టు. ఒక ఏడాది లీవ్ వేకెన్సీ వచ్చింది."

''అబ్బ. ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు దయకలిగిందే నా మీద ? స్నేహితురాలి వంటే నీవేనే."

''ఇదయినా ఒక షరతుపైన నీ అప్లికేషను తీసుకుంటాను. అసలు నీ కొచ్చిన కష్టమేమిటో నాకు దాచకుండా చెప్పాలి. కల్లబొల్లి కథలు చెప్పటం నీ కలవాటు. ఈ సారి నేనటువంటివి వినను తెలిసిందా ?"

''చెప్తాను. ఈ సారి అంతా నిజమే చెప్తాను "

''రాత్రి భోజనాలయిన తరువాత తీరిగ్గా కూర్చుని చెప్పు."

భోజనం కాగానే వేడి వేడి టీ తాగటం ఇందిరకు అలవాటు. టీ తాగి రాత్రి పదకొండుగంటలవరకూ ఆఫీసుపని చేస్తుంది.

''ఆఁ. గంగా ! ఆఫీసుపని రేపు చేసుకుంటాను. నీ కష్ట మేమిటో చెప్పు "

''అదేనే. పెళ్ళయిన తరువాత రెండు నెలలు సంతోషంగా ఉన్నాము తరువాత పోట్లాటలు మొదలయ్యాయి."

''అదే. ఎందుకని అడుగుతున్నాను."

''ఎందుకా? ఇద్దరం బయటికి వెళ్ళేవాళ్ళమే కదా. ఇద్దరం చెరోపని చేసుకుని బయటికి వెళ్ళేవాళ్ళము. కొన్నాళ్ళయేసరికి నిజస్వరూపం బయటపడింది."

''చెయ్యటం మానేశాడా ?"

''కాదులే చేస్తూనే వచ్చాడు. నాకు మొదటినుంచీ కాస్త పొద్దెక్కి నిద్ర లేవటం అలవాటు. కాఫీ తాగి స్నానం చేసేసరికి టైము అయిపోతూ ఉండేది. ఏం

మునిగిపోతుంది ? లైమయిపోతే, హోటల్లో భోజనం చేయకూడదూ ! అట్లా కాదట. చీకటితోలేచి అన్ని పనులూ చేసుకోవాలట. వంట ముగించుకొని-టిఫిన్ చేసి డబ్బాల్లో కూడా పెట్టుకోవాలట. మొదట్లో అంటే సరేకదా అని చేశాననుకో. అదేలే ఇద్దరం చేసేవాళ్ళం కలిసి, ఎన్నాళ్ళని పొద్దున్నే లేవను ? అయినా ఇందిరా ! ఆడవాళ్ళంటే గౌరవం లేదు."

"ఊఁ." దీర్ఘంగా ఊఁ కొట్టింది ఇందిర.

"తరువాత-ఆఫీసునుంచి ఇంటికి రాగానే టిఫిన్ కావాలంటాడు. నేను ముందు వస్తాను కనుక "టిఫిన్ చెయ్యకూడదా" అంటాడు. ఇంటికి రాగానే నాకు మంచమ్మీద పడి దొర్లాలని ఉంటుంది. ఉన్నమాట చెప్పద్దూ ? నాకా గది ఎట్లా ఉన్నాసరే ముందు మంచం చేరుకోవాలని ఉంటుంది. ఊరికే చెవిలో రొద. చీరెలు మడిచివేసి హేంగరుకు తగిలించుకో, నలిగిపోతాయంటూ ! ఎన్నింటి కని పడను చెప్పు ?"

"ఇంకా ?"

"ఆఁ అసలు సంగతి. ఇదే నా కెక్కువగా చిరాకేసింది. పిక్చర్‌కు వెళ్లాలని నాకు సరదా. కనీసం రెండురోజుల కొకసారయినా. మొదట్లో సరే అన్నాడు కాని-ఇప్పుడిప్పుడు నెలకు నాలుగని రేషనింగ్ పెట్టాడు. మరొక విషయం-జీతంలో మూడవవంతు బ్యాంకులో వెయ్యాలట. అది తప్పనిసరిట."

"సరే నీవేమనేదానవు ?"

"ఉన్నమాట చెప్పద్దూ ? నాకు చీరెలు కొనుక్కోవాలనుంటుంది. ఎంత సంపాదించుకుంటే ఏం ? అనుభవించాలి. అదే మనకు దక్కేది. అట్లా కాదట. అన్నిటికీ లెక్కలూ-నియమాలూను. ఇంతగా స్వేచ్ఛను అమ్ముకుని నేను బ్రతక లేనుసుమా ! అసలింతకూ నేనెందుకు సర్దుకుపోవాలి చెప్పు ? బాగా చదువు కున్నాను. సంపాదించుకుంటున్నాను. ఆ బానిసబ్రతుకు నా కెందుకు ? ఇన్నాళ్ళూ ఆడవాళ్ళు పడ్డారంటే చదువులు లేవు-సంపాదనలూ లేవు కనుక-అన్నివిధాలా వాళ్ళమీద ఆధారపడి ఉన్నారు కనుక చచ్చీ చెడీ, మనసు చంపు కుని-వాళ్ళెట్లా చెబితే అట్లా విని-మెప్పించటానికి ప్రయత్నాలు చేశారు అట్లా మనం ఉండగలమా ? మనసును చంపుకోగలమా ? నీవే చెప్పు ?" ఆయాసం తీర్చుకోటానికి కొంతసేపాగింది గంగ.

నవ్వాపుకుంటోంది ఇందిర.

"నీకు నవ్వుగా ఉండదూ మరి ? ఇందిరా నీ వెన్నయినా చెప్పు. నా

వ్యక్తిత్వాన్ని నేను చంపుకొని ఒదిగి ఒదిగి ఉండలేను. ఇన్నిమాట లెందుకు అందుకే వచ్చేశాను. ఎప్పుడయినా చూడాలంటే వచ్చి చూస్తాడు. అంతే." అలిసి పోయిన గంగ కొంగుతో ముఖం తుడుచుకుంది.

సంభాషణలో మధ్య మధ్య ఆపి ప్రశ్నించాలని ఒకటి రెండుసార్లు నోరు విప్పబోయింది ఇందిర కాని ప్రయత్నమీద నిగ్రహించుకుంది.

ఆ మరునాడే గంగను లీవ్ వేకెన్సీలో ఎప్పాయింటు చేస్తున్నట్టుగా ఆర్డర్సు టైపుచేసి చేతికిచ్చింది ఇందిర. నాలుగురోజుల తరువాత గంగ రెండు గదుల ఇల్లొకటి చూసుకుని వెళ్ళిపోయింది. ఆ యిల్లు తన యింటికి దగ్గరగా ఉందనీ తనే కుదిర్చాననీ శ్రీదేవి చెప్పింది ఇందిరకు.

"ఒంటరిగా ఉంటుంది. కొత్త ఊరు కనుక కాస్త కనిపెట్టి ఉండండి." శ్రీదేవిని అభ్యర్థించింది ఇందిర.

సాయంకాలము ఇంటికి వెళ్ళేముందు సుందర్ ప్రిన్సిపల్ పర్మిషన్ అడిగాడు స్టాఫ్‌రూములో రెండురోజులు పడుకుంటానని.

వాచ్‌మన్‌కు చెప్పి స్టాఫ్ రూము తెరిపించి విస్మయపడుతూ లాడ్జికి చేరుకుంది ఇందిర.

ఎర్రగా వాచిన కళ్ళు ఒత్తుకుంటూ కాఫీ టిఫిన్ తీసుకువచ్చింది జయ.

జయ ముఖం చూసీ చూడనట్టుగా తలవంచుకుని కాఫీ, టిఫిన్ తీసుకుని తన గదిలోకి వెళ్ళింది ఇందిర. యథాప్రకారంగా కాళ్ళూ చేతులూ కడుక్కుని పేపర్లు తీసుకుని డ్రాయింగురూములోకి వచ్చింది. తరువాత రేడియో పెట్టింది.

మాట్లాడకుండా భోజనం చేస్తున్న ఇందిరను అదొకమాదిరిగా చూసింది జయ.

భోజనం ముగించి చెయ్యి తుడుచుకుంటూ "జయా! ఈ వీధిలోనే టైపూ షార్టు హాండూ నేర్పించే ఇన్స్టిట్యూట్ పెట్టారు. నేర్చుకుంటావా?" ఆమె ముఖంలోకి చూసింది ఇందిర.

"నా కెందుకమ్మా ఇప్పుడు?" చూపులు మళ్ళించుకుని జవాబిచ్చింది.

"మధ్యాహ్నం భోజనాలు కాగానే నేర్చుకో. రేపే వెళ్ళి చేరు. వాటి అవసర మేమిటో నేను చెప్తాలే తరువాత." లేచి గదిలోకి వెళ్ళిపోయింది ఇందిర.

కాలేజికి వెళ్ళగానే గంగ కనుపించింది. "గంగా! ఇల్లు సౌకర్యంగా ఉందా? బిడ్డకు మనిషి కుదిరిందా?" పలకరించింది.

"బాగానే ఉంది. నీదయవల్ల సుఖంగా ఉన్నాను. ఇలా సాగిపోతే జీవిత

ఇంట్రవల్ సమయంలో సూర్యప్రభ వచ్చి ఏదో మాట్లాడి వెళ్లబోతుండగా "మీ ఆరోగ్యం ఎలా ఉంది ? ఏదయినా మందు తీసుకుంటున్నారా ?" కుశల ప్రశ్నలు వేసింది ఇందిర.

సూర్యప్రభ పేలవంగా నవ్వింది. "బాగానే ఉన్నాను. ఇంతకంటె బాగా ఉండటం అసాధ్యం నా జీవితంలో."

నవ్వింది ఇందిర.

"ఏంచెయ్యను మేడమ్ ? గంపెడు సంసారం. ఇద్దరం సంపాదించినా ఇంటి ఖర్చులకు చాలటంలేదు. నలుగురు ఆడబడుచులకు పెళ్ళిళ్ళు చేయాలి. ఇద్దరు మరదులకూ ఒక బావగారికొడుక్కూ చదువు చెప్పించాలి. నేనింత సంపాదిస్తు న్నాను కదా అని కడుపునిండా వేళకు తిండికి నోచుకోలేదు. జబ్బు చేస్తే మందు తీసుకోలేను. నా ఈ రెండు ఖర్చులూ అనవసర మనిపిస్తాయి ఇంట్లో అందరికీ. ఇంక ఇంతే."

"అట్లా నిరాశచెందితే ఎట్లా ? కనీసావసరాలయినా తీరాలి కదా ! ఇద్దరూ సంపాదిస్తుంటే తిండయినా లేకపోతే ఎట్లా ? ఇద్దరు సంపాదించుతున్నందుకు సంసారాలు బాగుపడాలి కదా ? మానసికంగా ఆనందం-శారీరకంగా సుఖం దక్కకపోతే ఎందుకి సంపాదనలు ?" చిరునవ్వుతోనే మాట్లాడింది ఇందిర.

"మా యింట్లో నన్ను గురించిన కుశలప్రశ్న 'ఇవాళ ఉద్యోగంలోకి వెళ్ళిందా లేదా ?' అని నెలాఖరికి 'జీతం పూర్తిగా ఇంటికి తెచ్చిందా లేక ఏమయినా ఖర్చు చేసిందా ?' అని "

"చదువుకున్నారు. సంపాదించుకుంటున్నారు. ఏకాభిప్రాయానికి వచ్చి ఒక నిర్ణీతమైన పద్ధతిలో జీవించవచ్చుగా ? చదువు రానివాళ్ళు-సంపాదించ లేనివాళ్ళు 'మాకేం చదువు వచ్చా ? మేమేమయినా సంపాదిస్తున్నామా ?' అంటారు. ఈ రెండూ ఉన్నవాళ్ళు వాటిని సంతోషంతో అనుభవిస్తున్నట్టు కనబడటంలేదు. ఎందుచేతనంటారు ?''

''ఏమోనండి. నామటుకు నాకు జీవితంలో సుఖం లేదు. ఏ ఒక్కరి సాను భూతీలేదు. ఎందుకు బ్రతుకుతున్నామో అర్థం కావటంలేదు,'' సూర్యప్రభ ముఖం పాలిపోయినట్లయింది

సూర్యప్రభ ఉండగానే చంపకం, సుస్మిత వచ్చారు. వాళ్ళను చూసి సూర్యప్రభ లేచి వెళ్ళిపోయింది.

మేడమ్. ఈ సంవత్సరం సాంస్కృతికోత్సవాలకు విద్యార్థిని సంఘంచేత ఒక ప్రోగ్రామ్ తయారుచేయించాము. మీరు చూసి అప్రూవ్ చేస్తే వాళ్ళు ప్రయత్నాలూ-తగు సన్నాహాలూ చేసుకుంటారు.'' కాగితాలు బల్లమీద పెట్టింది సుస్మిత,

అన్ని కాగితాలు ఒకసారి పైనుంచి కిందివరకూ చదివింది ప్రిన్సిపల్.

''వక్తృత్వపోటీ అన్నారు. విషయ నిర్ణయము కూడా జరిగిందా ?'

"విద్యార్థినులే ఎన్నుకున్నారు. భావి జీవితాన్ని గురించిన ఆశయాలూ. ఆశలూ వాళ్ళకు ఉంటాయి కనుక వాటికి సంబంధించిన విషయాన్నే చర్చించుకుంటామన్నారు, ప్రతి సంవత్సరము వాళ్ళ సెలక్షనే. అందుకే ఈసారి కూడా వాళ్ళకే వదిలిపెట్టాము.''

''మంచిదే. కాని మీగైడెన్సు కూడా కొంత ఉండాలి. స్త్రీల 'వైవాహిక జీవతం ఎలా ఉండాలి?' విద్యార్థినులకు అవసరమైన సబ్జక్టే ఎన్నుకున్నారు. 'స్త్రీ వివాహం చేసుకోవాలా, వద్దా ?' అన్న టాపిక్ ఎంపిక చేసుకుంటారేమో ననుకున్నాను" కలం తిప్పుతూ అన్నది ప్రిన్సిపల్.

"ఆఁ, మొదట ఆ టాపిక్కే ఎన్నుకున్నారు. కాని అది వైయక్తికమైనదని వాళ్లల్లో వాళ్లకే తోచి మార్చుకున్నారు.'' చంపకం అందుకున్నది.

''అలాగా ! మనం చిన్నపిల్లలనుకుంటూ అన్నిటికీ వాళ్ళను దించివెయ్య కూడదు. విద్యార్థినులలో కూడా అన్నిరకాల ఆలోచనాపరులూ ఉంటారు. సరే అది బాగానే ఉంది. నాటకం ఏమిటి ?'' ప్రిన్సిపల్ మళ్ళీ కాగితాలు తిరగ వేసింది.

''వరుడి వెల ఎంత ?'' ఈ నాటకాన్ని పిల్లలంతా ఏకగ్రీవంగా ఆమోదించారు.'' ఉత్సాహంతో చెప్పింది చంపకం.

''అప్పుడే నాటకం సిద్ధమైపోయిందా ? ఎవరు రాశారు ?'' చంపకం సుస్మిత ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు,

''చంపకంగారు రాశారండి.'' ఠకీమని చెప్పింది సుస్మిత.

''మీరు రచయిత్రి గూడానా ? చెప్పలేదేం నాకు ? నవలలు రాశారా ఏవైనా ?" అడిగింది ప్రిన్సిపల్ ఆశ్చర్యంతో,

''ఇప్పటికి పదిహేను రాశానండి'' గర్వం ముఖమ్మీద తొణికసలాడింది చంపకానికి.

"ఇంకా రాస్తున్నారా ! నా కివ్వండి. నను కూడా చదువుతాను.

"రోజూ ఏదో రాస్తూనే ఉంటానులెండి. ప్రతి పత్రికా నా సీరియల్స్‌కోసం ఉత్తరాలు రాస్తూ ఉంటుంది. ఇంచుమించు అన్నిటికీ లేదనకుండా ఇస్తూనే ఉంటాను. మీకు రేపు నా నవలలు నా దగ్గర ఉన్నంతవరకూ తెచ్చి ఇస్తాను. మీరు చదివి మీ అభిప్రాయం చెప్పాలి."

"తప్పకుండా. మన స్టాఫ్‌లో ఒక రచయిత్రి కూడా ఉన్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది." ప్రిన్సిపల్ అంటూ ఉండగా ప్యూన్ ఏదో చీటి ఒకటి తీసుకువచ్చాడు దాన్ని చూసి చంపకం సుస్మిత లేచారు.

మరునాడు తను రచించిన నవలలన్నీ తీసుకువచ్చి ప్రిన్సిపల్ బల్లమీద పెట్టింది చంపకం.

* * *

ప్రిన్సిపల్ గదిలోకి ఆయాసపడుతూ వచ్చింది శ్రీదేవి. ప్రిన్సిపల్ కాగితాలు చూసుకుంటూ తల ఎత్తిచూసి "ఏం కావాలి ? ఇలా వచ్చారు ?" అడిగింది.

శ్రీదేవి నోట్లోంచి మాట బయటికి రావటంలేదు. ఆదుర్దాకొద్దీ నాలుక తడి ఆరిపోయింది. ఇంచుమించుగా మూర్ఛపోయేదానిలా ఉంది.

"మా వారు......మా వారు......" మాట్లాడలేకపోయింది.

"ఏమయింది ? హఠాత్తుగా జబ్బుచేసిందా ? ఇది లీవ్‌లెటరా ? వెళ్ళరండి. ఎలా ఉన్నదీ కబురు చేయండి. గాభరాపడకండి. హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళండి." ప్రిన్సిపల్ ఆమెను తొందరపెట్టి పంపించేసింది.

ఇంటికి వచ్చేటప్పటికి గంగ వచ్చింది ఎదురుగా.

"చాలారోజులకు ఇక్కడికి వచ్చి నన్ను చూడాలన్న బుద్ధిపుట్టిందా ?" గంగచేతిలో ఉన్న పిల్లను లాక్కుని ముద్దుపెట్టుకుంది.

"కాలేజినుంచి ఇంటికి వెళ్ళగానే ఎన్నోపనులు, వాటిని చూస్తేనే గుండె గుభేలు మంటుంది. రోజూ రానాలినే అనుకుంటానుగాని రాలేకపోతున్నాను. అదిగాక ఇంకో సంగతి. ఈ కాలేజిలో నేను చేరిన ఈ కొద్దికాలంలోనే అందరి సంగతులూ తెలిశాయి. ఆ చంపకంగారు చాలా అసాధ్యురాలని విన్నాను. నేను నీతో మాట్లాడినట్టుగాని - నేను మీ యింటికి నాలుగుసార్లు వచ్చినట్టుగాని తెలిసిందంటే ఏదో గాసిప్ ప్రారంభిస్తుందేమోన్న భయం." గంగ ఆపకుండా చెప్పుకుపోతుంది.

అలాగా ! మంచిది. ముందుగా జాగ్రత్తపడుతున్నావు. నీకూ నాకూ కూడా మంచిదే."

"అసలు సంగతేమిటంటే మా పప్పీ పుట్టినరోజు రేపు. సాయంకాలము ఐదు గంటల తరువాత స్టార్ట్. అందరికీ కాలేజిలోనే చెప్పాను. నీ కక్కడ చెబితే బాగుండదని ఇంటికి వచ్చాను."

"పోనీలే. ఆమాత్రం గౌరవముంచావు. వస్తాలే ఆ సమయానికి. అన్నట్టు పాప పేరేమిటి ?"

"పుష్ప". అది నా సెలక్షను కాదనుకో. పెద్దదయ్యేలోపల మంచి పేరేదయినా సెలక్టు చెయ్యాలి."

"అదా సంగతి ! నీ సెలక్షను కాకపోతే మీవారిదయి ఉంటుంది. అందుకే అంతమంచి పేరును పప్పీని చేశావు ? పప్పీ తల్లి ఎవరయి ఉండాలి ? ఆయనమీద నీ కెంత ఈసడింపు ఉన్నా - ఈ సంగతి ఆలోచించావా !" నవ్వింది ఇందిర.

"సర్లే. ముద్దుపేర్లకు కూడా లోతుగా ఆలోచించితే ఇంక అయినట్టే. మరి నేను వెళ్తాను. పని చాలా ఉంది." లేవబోయింది గంగ.

"కూచో. చాలామందిని పిలిచావా ? పదార్థాలు ఇంట్లో చేస్తున్నావా ? లేక తెప్పిస్తున్నావా ?"

"కాంటీనులో ఆర్డరిచ్చాను. వాళ్ళే సర్వ్ చేస్తామన్నారు."

"మరింకేం పని ఉంది నీకు ?"

"ఇల్లు సర్దుకోవాలి. ఆ జానాబెత్తెడు ఇల్లూ ఎంత సర్దితే రేపటికి వీలుగా ఉంటుంది ?"

"ఏ రోజుపని ఆ రోజు చేసుకోకుండా పేరబెట్టుకుంటావా ? బట్టలూ అవీ సర్దిపెట్టుకోవా రోజూ ?"

"రోజూ సర్దుకుంటూ కూర్చుంటే ఉద్యోగం చేసినట్టే - అన్నం వండుకుని తిన్నట్టే"

"పోనీలేగాని - మీ వారిని పిలిచావా ?"

"ఇంతవరకూ మా మధ్య ఉత్తరాతే లేవు. రేపు ఏమని పిలవను ? ఆయనకు తెలియదూ అమ్మాయి పుట్టినరోజని ? నేను పిలిచే దేమిటి ?"

"పిల్ల నీ దగ్గర ఉంది కనుక నీవే పిలవాలి."

"ఆనాడు పిల్ల బాధ్యత తనకేమీ లేదన్నాడుగా ? అటువంటప్పుడు ఆ

కుని నేను పిలిచినా వెంటనే వస్తాడనుకున్నావా ? కావలసినంత దెప్పుతాడు. నసుగుతాడు. ఎన్నో నీతులు వల్లిస్తాడు. ఇవన్నీ పడే ఓపిక నాకు లేదు ఇందిరా ?"

గంగ మాటలు ఎంత ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నా ఇందిర పైకి కనబడనివ్వ లేదు.

"గంగా ! పెళ్లయిన తరువాత ఎందరో అమ్మాయిలు మారగా చూశాను. మొదటినుంచీ ఒక్కమాదిరిగా ఉన్నవాళ్ళనూ చూశాను. కాని..."

"నేను మారినవాళ్ళల్లో జమా లేక మారని వాళ్ళల్లోనా ?" నవ్వింది గంగ.

"చెప్పనా ? తరువాత నీవు బాధపడకూడదు. పెళ్ళికాకముందు సేచ్ఛగా తమ స్వంత అభిప్రాయాలను వెల్లడించేవాళ్ళు కొందరు పెళ్ళికాగానే వాటిని మార్చుకుంటారు. కొందరు మొదటినుంచీ అంత స్వేచ్ఛగా మాట్లాడనూ మాట్లాడరు. తరువాత అంతగా మారనూ మారరు. నీవు ఏ తెగలో చేరతా వంటే పెళ్ళికాకముందు పెళ్ళయితేచాలు సర్దుకుపోతానన్నావు. ఆ తరువాత సాధింపు మొదలుపెట్టావు. నీవు సర్దుకున్నది ఎక్కడ ?"

"అప్పుడేదో అనుభవంలేక అన్నాననుకో, అసలు నాకు తెలియక అడుగు తున్నా - నే నెందులో తక్కువని సర్దుకోవాలి ?"

"నీ గీతమీద నీ వుంటే – ఆయన గీతమీద ఆయన ఉంటే ఒక ఇంట్లో ఉండి బతకటమెట్లా ? వైవాహిక జీవిత మెట్లా కుదురుతుంది ?"

"పెళ్ళంటేనే లొంగిపోవటమని నాకు ముందు తెలియలేదు. ఈ వైవాహిక జీవితంకోసమని సగం చచ్చిబతుకుతానా ? నా అనుభవంమీద చెబుతున్నా ఇందిరా ! పెళ్ళిచేసుకోవటంకంటె బుద్ధితక్కువపని ఇంకోటిలేదు. నీ వెప్పుడూ ఇటువంటి పొరబాటుపని చెయ్యకు." ముఖమ్మీది చెమట తుడుచు కుంది గంగ. అలిసిపోయినట్టుగా ఆయాసపడటం మొదలుపెట్టింది.

"పోనీలే. రేపు అమ్మాయి పుట్టినరోజంటున్నావు. ఇవాళ నిన్ను ఉద్రేక పరిచి రాత్రంతా నిద్రలేకుండా చేయటం మంచిపని కాదు. సుఖంగా ఇంటికి వెళ్ళి, కడుపునిండా అన్నం తిని హాయిగా పడుకో. అయినా మన మధ్య ఈ వాగ్వివాదాలు కొత్తకాదుగా." జయచేత కాఫీ తెప్పించి ఇచ్చింది ఇందిర.

గంగ తేలిగ్గా నవ్వేసింది. హాయిగా చిన్నపిల్లలా నవ్వేసింది. కల్మష మెరుగని పసిపిల్లలా నవ్వేసింది.

పుష్ప పుట్టినరోజున కాలేజి స్టాఫంతా చేరుకున్నారు. సర్వర్లతో సమానంగా వచ్చిన వారందరికీ ప్లేట్లు అందించాడు నారాయణ. పుష్ప తండ్రితెచ్చిన గౌను వేసుకుని ఒకరిచేతిలో నుంచి మరొకరి చేతిలోకి మారుతున్నది. అందరూ బహుమతులు తెచ్చి చేతికిస్తుంటే కిలకిల నవ్వుతూ అందుకుంటున్నది.

ఇందిర గంగ చెప్పకుండానే అంతా గ్రహించింది. ఇల్లు నాలుగుమూలలా కళ్ళతో కలయచూసింది. ఎక్కడి వస్తువులు అక్కడ అమరికగా ఉన్నాయి. ఇల్లు శుచిగా శుభ్రంగా ఉంది. నారాయణ చాలా బాధ్యతతో పనంతా చక్కబెట్టటం ఇందిర గమనించింది. గంగ వచ్చినవాళ్ళతో కబుర్లలో మునిగిపోయింది ఎవరికి ఏది అందిందో కూడా గంగ పట్టించుకున్నట్టులేదు.

అందరూ వెళ్ళేసరికి రాత్రి ఎనిమిది కావచ్చింది.

మరునాడు గంగ కాలేజికి సెలవు పెట్టింది.

*　　　*　　　*

"ఇవాల్టినుంచీ నీవు వంటపని చూడనవసరంలేదు జయా !" అంది ఇందిర కాలేజినుంచి వస్తూనే.

"ఎందుకు ? నేనేం తప్పు చేశానమ్మా !" జయ కళ్లల్లో నీళ్లూరాయి.

"కాలేజిలో టైపిస్టు ఉద్యోగం ఇస్తున్నాను. ఇవాళే ఒక టైపిస్టు రిటైరయ్యాడు."

"నేను యింటిపని కూడా చేస్తానమ్మా. పనంతాచేసి వేళకు కాలేజికి వచ్చి ఆ పని చేస్తాను. నా మీద మీ కెంత వాత్సల్యముందో నేను అంచనా వెయ్యలేకపోతున్నానమ్మా. మీ ఋణం నే నెట్లా తీర్చుకోను ?" ఇందిర పాదాలను వొంగి కళ్ళకద్దుకుంది జయ.

"మరీ అంత ఇదయిపోకు నీవు చెయ్యగలిగితే రెండుపనులూ చెయ్యి. వీలుకాకపోతే ఒక్క ఉద్యోగమే చెయ్యి. కాని నే నడిగినదానికి సమాధానం చెప్పు."

జయ ముఖం దించుకుంది.

"పెళ్ళయిందన్నావు. నీ భర్త ఎక్కడ ?"

"విశాఖపట్నంలో ఉన్నాడు."

"అక్కడ ఉద్యోగమా ?"

"అవునమ్మా."

"మరి నీ వెందుకు వెళ్ళలేదు అక్కడికి ?"

జయ ముఖాన్ని చేతులతో కప్పుకుంది.

"చెప్పు ! మంచివాడేనా ? నీవు అక్కడకి వెళ్ళలేదా ? లేక అతడు తీసుకు వెళ్ళలేదా ?" ఇందిర ఆ రోజు జయచేత అంతా చెప్పించదలచుకున్నది

"నేను చదువుకునే రోజుల్లో మా వీధిలో ఒక విద్యార్థి నాకు ఉత్తరాలు రాస్తూ ఉండేవాడు. నేను ఎంత తప్పుకు తిరుగుతున్నా అతడు మానలేదు. చివరకు నేను పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయినా అక్కడికీ ఉత్తరాలు రాయటం మొదలుపెట్టాడు. ఆ ఉత్తరాలన్నీ చదివిన మా మరది నాతో చనువుగా ఉండాలని ప్రయత్నించాడు. నేను లొంగకపోగానే అన్నకు నా మీద నేరాలు చెప్పటం మొదలుపెట్టాడు. ఆ తరువాత వచ్చిన ఉత్తరం ఆయన చేతిలోనే పడ్డది. దాని ఫలితంగా నేను అమ్మగారింటికి వచ్చేశాను ఆ ఉత్తరాల వేట ఫలితమే నన్ను కాపురానికి దూరంచేసింది." జయ కళ్ళుమూసుకునే చెప్పుకు పోతోంది.

"ఇదంతా నిజమేనా ? నన్ను నమ్మమంటావా ?" ఇందిర అనకోకుండా అనేసి నాలుక కరుచుకున్నది.

ఎర్రబడిన కళ్ళు పైకెత్తి చూసింది జయ – ఎంత ఘోరం అన్నట్టుగా.

ఇందిరకు గంగతో కలిగిన అనుభవాలవల్ల ఎవరేమి చెప్పినా నమ్మబుద్ధి పుట్టటంలేదు

"పెళ్ళిచేసుకుంటావా ?"

తల దించుకుంది జయ.

"పోనీ ఆ ఉత్తరాలు రాసేవాణ్ణి చేసుకో. ఏ అల్లరీ ఉండదు "

చివ్వున తలెత్తి చూసింది జయ. "చేసుకుంటే నేను అపరాధినని ఋజువు చేసుకున్నట్టే కదమ్మా ?"

"అతడు కాకపోతే ఇంకోడు ఇంత ప్రపంచంలో నీకు తగినవాడే లేడా ? ఉండడా !"

జయ మౌనం వహించింది.

కూర్చున్న కుర్చీలోనుంచి లేచింది ఇందిర. మెల్లగా జయ దగ్గరకొచ్చి భుజమ్మీద చెయ్యి వేసింది. ఒకచేత్తో తల నిమురుతూ "జయా !" అంది కళ్ళలోకి చూస్తూ.

నిలువెల్లా ఒణికింది జయ. ఒళ్ళంతా చెమటపట్టింది. అమ్మా అంటూ ఇందిర కాళ్ళమీద పడిపోయింది.

నివ్వెరబోయింది ఇందిర. "ఇదేమిటి జయా ! నా కాళ్ళమీది నుంచి చేతులు తియ్యి ముందు. అలా ఒణికిపోతున్నా వెందుకు ! నీ చేతులంత చల్లగా ఉన్నా యెందుకు ?" లేవదీసి దూరంగా నిలబెడుతూ కళ్ళలోకి చూసింది.

తల దించుకుంది జయ.

"జయా !" ఎంత గంభీరంగా ఉందో ఇందిర కంఠస్వరం అంత కఠినంగా వినబడ్డది.

"నిజంగా నీవు నిర్దోషివేనా ? ఈ మాట చెప్పు ? నీవు నిర్దోషి వే అయితే ఆ ఉత్తరాలు రాసినవాడుగాని నిన్ను చేసుకున్నవాడుగాని నీవు అర్థిస్తే వింటారేమో ? కాని - నీవు నిజంగా నిర్దోషివే అయితే నీలో ధైర్యం ఉంటుంది కాని - ఇంత భయం ఉండదు. చెమటలుకారే నీ శరీరం గజగజ ఒణకిపోయే నీ దేహం నీవు దోషి వనటానికి అవకాశాన్నిస్తున్నాయి నేను నీ తండ్రినిగాని అన్ననుగాని కాదు నిన్ను దండించటానికి. నా కా అధికారం లేదు. కాని - నేను నీ శ్రేయోభిలాషిని. నీ పరిస్థితులకు అనుగుణంగా నేను సహాయం చేస్తానని మాట ఇచ్చాను. నా దగ్గర ఎందుకు దాస్తున్నావు ? నన్నింకా నీవు అర్థంచేసుకోలేదా ? రా. ఇక్కడ కూర్చుందాము. ఏమీ దాచకుండా ఉన్నదున్నట్టు చెప్పు ?" జయ తల నిమురుతూ దగ్గరగా కూర్చోబెట్టుకున్నది.

"నేను మెట్రిక్ చదువుతుండగా జయరాం అనే విద్యార్థి నాకు దారిలో రోజూ కలుస్తూ ఉండేవాడు మంచి మంచి నవలలు తెచ్చి యిచ్చేవాడు చదువుకొమ్మని. స్కూలుకు వెళ్ళకుండా అతడితో ఉదయపు ఆటలకు వెళ్ళి ఎన్నో సినిమాలు చూసేదాన్ని అక్కడినుంచి హోటళ్ళకు తీసుకెళ్ళేవాడు. స్కూలు వదిలిపెట్టే వేళకు ఇంటికి వచ్చేదాన్ని. నాన్నకూ అమ్మకూ తెలియదు. కాని అన్న ఎలాగో పసికట్టేశాడు. సైకిలుమీద స్కూల్లో వదిలి పెట్టేవాడు. తిన్నగా ఇంటికి రమ్మని కళ్ళెర్రచేసేవాడు. అయినా అన్నయ్య కళ్ళు కప్పేశాము. ఇంట్లో కొట్టినా తిట్టినా కాళ్ళు అటే లాక్కుపోయేవి. ఇద్దరం హోటల్లో కలుసుకునేవాళ్ళం. అతడు డబ్బుకలవాడు. ఖర్చులు భరించి నన్ను ఆనందపరచేవాడు. ఇదంతా అరికట్టలేక పరీక్షలు కాగానే నాన్నా, అమ్మా ఒక సంబంధం చూశారు. నాకు చూపించే నిశ్చయం చేశారు. నాలుగు నెలల గర్భిణిని. గతిలేక ఒప్పుకున్నాను. నాన్నా అమ్మా తలలు పట్టుకుని ఏడ్చారు. చివరకు అన్నయ్య చెప్పిన ఉపాయం - పొరుగూరికి

తీసుకుపోయి అబార్షను చేయించి తీసుకువచ్చారు. పెళ్ళి అయింది. అత్త వారింటికి వచ్చాను. ఆయనను మోసగించి కాపురం చేస్తున్నాను కాని – ఆ జయరాం ఉత్తరాలు రాయటం మొదలుపెట్టాడు. వెనకటి జీవితాన్నంతా తిరగ తోడుతూ రాసేవాడు. నేనట – ఎవరినీ పెళ్ళిచేసుకోకుండా అట్లాగే ఉండాలట. పెళ్ళిచేసుకుని తనను మోసగించానని నిందిస్తూ ఉత్తరాలు గుప్పించేవాడు. దురదృష్టవంతురాలిని. అటువంటి ఉత్తరాలు కొన్ని నా మరిది చేతబడ్డాయి. అతడు అన్నకు చెబుతానని బెదిరించేవాడు. లేకపోతే తనకు లొంగిపొమ్మని బలవంతం చేసేవాడు. నేను అతడికి లొంగకుండా పుట్టింటికి పారిపోయాను. మరిది అక్కడ అందరికీ చెప్పి గోలచేశాడు. ఇంతలో ఒక ఉత్తరం ఆయన చేతపడ్డది. దాని పర్యవసానంగా నేను అమ్మగారింట్లో ఉండిపోయాను. బ్రతుకు బజారునపడ్డ తరువాత అందరికీ హేళనగా ఉంటుంది. ఇంటా బయటా నా బ్రతుకు అధమాధమంగా తయారయింది. మీ దగ్గరికి వచ్చిన తరువాత నేను ఆత్మగౌరవంతో బ్రతుకగలుగుతున్నాను. నా కిప్పుడు ఎవరితోనూ పెళ్లి వద్దు. ఇంకెవరినీ మోసగించాలని లేదు." కళ్ళనుండి నీటి ధారలు లేవు గాని – ముఖం దీనాతిదీనంగా ఉంది.

నోటినుంచి మాట రాలేదు ఇందిరకు. మనసంతా కల్లోలమయిపోయింది. "ఎందుకు చేసావట్లా జయా ?" అంది వినీ వినబడకుండా.

"ఇద్దరం సరదాపడ్డాం. సంతోషంగా తిరిగాం. నిజం చెప్పాలంటే అతడి బలవంతం ఎక్కువలేదు. ప్రతిఘటిస్తే ఆగిపోయేవాడే. నీ కిష్టమైతేనే రమ్మని ప్రోత్సహించేవాడు అది తప్పనీ ఇంతటి పరిణామానికి దారితీస్తుందనీ తెలియదు వద్దని ఆపుచేసే అన్నయ్య ఒక రాక్షసుడిలా కనబడేవాడు అమ్మ వద్దంటే అన్నయ్య మాటలు విని కోప్పడుతున్నదనుకునేదాన్ని" తల ఎత్తకుండా చెప్పుకుపోతున్నది జయ.

"నీ భర్తను మోసగిస్తున్నానని నీ వెప్పుడూ అనుకోలేదా ? నీ అంత రాత్మ అయినా నిన్ను నిలవదీయలేదా ? జయా ! ఎటువంటిపని చేశావు. ఇంత అమాయకంగా కనబడే నీవు ? ఎలా చేయగలిగావు ?"

"జీవితాన్ని అతుకుబెట్టగలిగా ననుకున్నా నమ్మా నేను ! నాతోపాటు నా తల్లిదండ్రులూ అలాగే అనుకున్నారు."

"ఇప్పుడేం చేస్తావు ? నీకు పట్టుమని ఇరవై ఏళ్ళయినా లేవు. ఇలా ఒంటరిగా ఉండగలవా ? నీవు మళ్ళీ వెనుకటివలె ప్రలోభపడవని నమ్మకం ఏముంది ?"




"లేదమ్మా లేదు. మీరన్నట్టు వయసు చిన్నదే కావచ్చు. కాని అనుభవం చాలా నేర్పింది. పదహారేళ్ళ వయసులో ఉన్న నిషా, కైపు ఇప్పుడు నాలో లేవు. నా వయసులో ఉండవలసిన ఆశలూ, ఆశయాలూ ఇప్పుడు నాలో లేవు. వాటి నన్నిటినీ నేనే మంటకలిపేశాను నియమబద్ధమైన జీవితంలో ఉండే ఆత్మశక్తి ఏమిటో తెలుసుకున్నాను."

"జయా !" అన్నది ఇందిర, వీపుమీద చెయ్యివేసి. "నీవు చెప్పిన మాటలు నాకు సంతృప్తి నిస్తున్నాయి. కాని– ఇవి అబద్ధం కాకూడదు. నేను నీకు నీతులు బోధిస్తున్నా ననుకోకపోతే ఒక చిన్న సలహా. ఆడపిల్లలు మగవాళ్ళదగ్గర తమను తాము చౌక చేసుకోకూడదు. గౌరవం ఇచ్చిపుచ్చుకోవాలి. ఆత్మ విశ్వాసంతో మెలగాలి. నియమబద్ధం చేసుకుని– నీ పరిధిలో నీవు మసలు కోవాలి. అంతేగాని చిలిపిమాటలకూ చిన్న నవ్వులకూ పొంగిపోయి అతి చౌకగా లొంగిపోవటం అతి హేయము– నీచము. 'నేను ఆడపిల్లను, నేను ఆడ పిల్లను' అని ముఖాన చీటీ కట్టుకుని తిరగటం ఎంత నికృష్టానికి దారితీస్తుందో చూశావా ?"

తలఎత్తి చూసింది జయ. 'అంటే ఏమిటి ?' అన్నట్టుంది ఆ ముఖం చౌకగా ఉండటం అంటే ఏమిటి అన్నట్టు ప్రశ్నిస్తున్నాయి ఆ ఎర్రబడిన కళ్లు.

నవ్వింది ఇందిర. "వింటే కఠోర మనిపిస్తాయి. అమ్మమ్మ మాట లని పిస్తాయి. నీవు ఆడపిల్లవని అందరికీ తెలుసు. కాని మాట మాటకూ నీవు ఆడపిల్లవని ప్రస్ఫుటంగా అనిపించేటట్టు మాట్లాడినా—అలా మసలుకున్నా నిన్ను నీవు చౌకచేసుకొని ఎదటి మనిషికి అలుసు ఇస్తున్నావన్నమాట. 'నాకు నా యిష్టం వచ్చినట్టు నిలబడే అధికారం, స్వాతంత్ర్యం లేదా' అంటావేమో! ఉంది, ఎవరూ కాదనరు. నీకు వ్యక్తిగా ఎంత స్వాతంత్ర్యం ఉన్నదో దానిని నిలుపు కునేందుకూ కొన్ని మార్గాలూ, సూత్రాలూ ఉన్నాయి. ఊరికే రోడ్డుమీద నిలబడి 'నన్ను గౌరవించు, నన్ను గౌరవించు' అని ఆడవాళ్ళు అరిస్తే గౌరవం రాదు. ఎవరూ ఇవ్వరు. జయా! జీవితంలో కొన్ని విలువలను మనం నిలబెట్టు కోవాలి. నిలుపుకోవాలి. వాటితోనే ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. జీవితంలో కొన్నిటిని మనం యాచించకూడదు. కాని– మనలో చాలామందిమి గౌరవించ మని యాచిస్తున్నాము. స్వాతంత్ర్యం ఇమ్మని యాచిస్తున్నాము. ఇవి మన విలువలను హెచ్చించుకొని సాధించుకోవలసినవి ఏమంటావు ? ఉపన్యాసం మోతాదు మీరినట్టుంది కదూ ?" సోఫాలో జేర్లబడ్డది ఇందిర జయ వీపు నిమురుతూ.

జయకు కొత్త శక్తి ఏదో వచ్చినట్లయింది. నాడీమండలం చురుకుగా పనిచేస్తున్నట్లనిపించింది. ఇంతకాలమూ తల దించుకుని బ్రతికిన మనిషికి తలఎత్తుకొని తిరగటానికి కొంగ్రొత్త జవమేదో శరీరంలో ప్రవేశించినట్లయింది.

"నేను ఇక్కడ ప్రవేశించినపుడే మీరు నాకు అమ్మ అనిపించారు. ఇవాళ ముమ్మూర్తులా అమ్మే అనిపిస్తున్నారు. నా మనసులో ఇంత కాలంగా కాపురం చేస్తున్న అపోహలు— భ్రమలూ ఇప్పుడు లేవు. నా జీవితాని కొక కర్తవ్యమూ, బాధ్యతా ఉన్నాయనుకొని ఇంతకాలమూ బ్రతుకలేదు. ఇప్పుడు వున్నాయని తెలిసింది. మనసా-వాచా-కర్మణా నా యావచ్ఛక్తినీ ధారపోస్తాను. అందులో నిమగ్నమై వ్యక్తి గౌరవాన్ని — జీవిత విలువలనూ, దైవాన్ని సాధిస్తాను. చెప్పండి. నేనేం చెయ్యాలో ?" చివ్వున లేచి నిలబడి చేతులు జోడించింది.

"జయా ! జయా !" బిగ్గరగా నవ్వేసింది ఇందిర. మనిద్దరం ఒక గంటకు పైగా కష్టపడిపోయాం. వేడివేడి కాఫీ, బిస్కట్లు తీసుకురా మనిద్దరికి."

స్నేహితుల్లా చూపులతో పలకరించుకుంటూ నూతనోత్సాహాన్ని పుంజుకున్న ముఖాలతో కాఫీ తాగి నవ్వుతూ లేచా రిద్దరూ.

* * *

"నీవు సెలవుల కయినా ఇంటికి వచ్చి మమ్మల్ని చూడవా ? నాన్న నిన్ను చూడాలని కలవరిస్తున్నారు " అనంతమ్మ ఈ సంగతే మూడు నెలలనుంచీ వుత్తరాల్లో రాస్తోంది

"నీకు లేదా నన్ను చూడాలని ?" నవ్వుకుంటుంది ఇందిర. తను వెళ్ళితే అమ్మ పెద్ద అట్టహాసం చేస్తుంది. అలసిపోతుంది. ఎందుకంటే ఊరుకోదు. అందుకని ఈసారి వెళ్లకూడ దనుకుంది. అనంతమ్మ ఊరుకోకుండా ఒకటే వుత్తరాలు.

లక్ష్మయ్య వీధి అరుగుమీద కూర్చుని చుట్ట కాల్చుకునే ఆనందంలో మునిగి వుండగా అనంతమ్మ "ఇదిగో మీ కూతురు రాసిన వుత్తరం. చదువుకోండి." చేతి కిచ్చింది.

ఆ వుత్తరాన్ని చూస్తే కూతుర్ని చూసినట్టే వుంది ఆయనకు. మురిపెంగా మడత విప్పి చదువుకున్నాడు. అమ్మాయితో మాట్లాడినంత సంతోషంగా వుంది.

"సామాను సర్దు. దాని మాటా విందాము. ఎప్పుడూ మన మాట అది వినలేదని బాధపడటమేగాని— ఒకసారయినా దాని మాట వినాలనుకున్నావా నీవు ? రేపే మన ప్రయాణం. ఇవాలే టెలిగ్రాము ఇస్తాను." చుట్టముక్క అవతల పారేసి లేచాడు లక్ష్మయ్య.

ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ సామాను సర్దింది అనంతమ్మ. అమ్మాయికి ఇష్టమంటూ ఊరగాయలు సీసాలలో పెట్టింది. చదువుకుంటూ తింటుందని కారప్పూస వత్తింది. తీపి యిష్టమని కోవాతో కజ్జికాయలు చేసింది. బెల్లమ్ముక్కలు తినేది చిన్నప్పుడు అంటూ బెల్లంతో వేరుసెనగపప్పు వుండలు చేసింది ఈ ఏర్పాట్లకు లక్ష్మయ్య చేసిన ఎగతాళంతా నవ్వుతూ భరించింది.

రైల్లోనుంచి దిగుతున్న తల్లినీ తండ్రినీ చూసిన ఇందిర ఆశ్చర్యానికి అంతు లేకుండా పోయింది. ఇద్దరూ ఎంతో హుందాగా కనిపించారు. లక్ష్మయ్య ఇస్త్రీ చేసిన తెల్లటి ధోవతీ, లాల్చీ, జరీ అంచుల కండువా, కాన్పూరు చెప్పులతో చేతికర్రతో దిగాడు. అంతకంటె హుందాగా జరి అంచుల చీరెతో కాళ్లకు రెండు పట్టీల చెప్పులతో అనంతమ్మ దిగింది— రెండు సూటుకేసులూ రెండు చూడ ముచ్చటగావున్న బుట్టలతో.

"అమ్మా ! కాలేజీ ప్రిన్సిపల్ గారింటికి అమ్మా, నాన్న ఎలా వచ్చారు ?" అన్నాడు నవ్వుతూ లక్ష్మయ్య.

"కాలానికీ హోదాకూ తగినట్టుగా రాలేదుటే ఇందూ ?" తల్లి పలకరింపు.

"బాగానే వచ్చారుగాని రండి పోదాము. మీకు మాత్రం తెలియదా ఏమిటి ప్రయాణాలు ఎలా చెయ్యాలో ? మీరు మూటలు తెచ్చినా ముంతలు తెచ్చినా అమ్మా, నాన్నే ! నేను చిన్నపిల్ల ననుకుంటున్నారా ఇంకా ?" తల్లిదండ్రుల చేతులు పట్టుకుని స్టేషను బయటికి తీసుకువచ్చింది.

"అమ్మా ! ముందు కాఫీలు తాగండి. నిదానంగా స్నానాలు చేయండి. నేను పదకొండు గంటలకు వస్తాను కలిసి భోజనం చేద్దాము. ఈ అమ్మాయి మీకు నచ్చినట్టు వంటచేస్తుంది. చెయ్యనీ" ఇందిర స్నానంచేసి కాలేజికి వెళ్ళిపోయింది.

లక్ష్మయ్యా, అనంతమ్మా ఇల్లంతా చూశారు. తోటంతా తిరిగారు. లక్ష్మయ్య స్నానం చేస్తూవుండగా అనంతమ్మ వంటయింట్లోనుంచి వస్తున్న జయనుచూసి "వంటేం చేసావమ్మా ? నేను వద్దామనుకుంటూ ఏదో ఆయనతో మాట్లాడుతూ ఆ చెట్లకింద కుర్చీలలో కూర్చుండిపోయాను" అన్నది.

"మీ వంటలన్నీ నాకు చెయ్యటం అలవాటయిపోయింది. అక్క అన్నీ నేర్పించారు."

'అక్కేమిటి ?' మళ్ళీ ఒక చెల్లెల్ని సంపాదించింది గాబోలు అనుకుంటూ అనంతమ్మ స్నానం చేసింది.

పదకొండు గంటలకు ఇందిర వచ్చింది. అందరూ నవ్వుతూ భోజనాలు చేశారు. వక్కపొడి నములుతూ హాల్లో కుర్చీలమీద కూర్చున్నారు.

"అమ్మా, నీ చిన్నకూతురు ఈ ఊళ్ళోనే వుంది సాయంత్రం వస్తుంది. మీరు వచ్చారని చెప్పగానే ఇప్పుడే వస్తానంది. కాని – ఇంట్లో పిల్లవుంది. నేనే వద్దన్నాను."

"చిన్నకూతు రెవరే నాకు ?" అనంతమ్మ ఆలోచనలోపడ్డది.

"అదేనే గంగ. నీవు పీటలమీద కూర్చుని పెళ్ళిచేశావు చూడు. ఆ పిల్ల. జ్ఞాపకం వచ్చిందా ?"

"ఆఁ ఆఁ. ఎట్లా మరిచిపోతానే ఆ పిల్లను ? ఆ రాత్రంతా ఎన్నో కల్లబొల్లి కథలు చెప్పి మనసు కదిలించేసింది. పదోనాటికి మంచి సంబంధాన్ని ఎగర తన్నుకుపోయింది. ఆ పిల్లను మరిచిపోవటమే ?" ఆశ్చర్యంగా నోటిమీద చెయ్యివేసుకుంది.

"అప్పుడట్లా పెళ్ళి అయితే చాలని పెళ్ళి అడిగి అడిగి చేసుకుందా ?

ఇప్పుడు పెళ్ళంటే మొహం మొత్తిపోయినట్టు మాట్లాడుతోంది. అమ్మా, పెళ్ళయిపోయిన తరువాత కొన్నాళ్ళ కిలాగే ఉంటుందా ?" ఇందిర తల్లి ముఖంలోకి చూసింది.

"మాకేం తెలుసే ఈ కొత్తమాటలు ? ఇప్పుడు కొత్తగా వింటున్నాము." లక్ష్మయ్య, అనంతమ్మ ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకున్నారు.

"కాదమ్మా. మీ కిద్దరికీ పెళ్ళయి ఎన్నాళ్ళో అయింది కదా ? మొహం మొత్తటం అంటే ఏమిటో తెలియలేదా ? ఇంకా అనుభవంలోకి రాలేదంటే ఆశ్చర్యంగా ఉంది మా కాలేజి లెక్చర్లలో పెళ్ళయినవాళ్ళను చూస్తే కడుపులో దేవినట్టుగా ఉంటుంది" పళ్ళు పైకి కనబడకుండా పెదవి విరుస్తూ నవ్వింది ఇందిర.

"రాత్రి ప్రయాణం, అలసిపోయినట్టున్నారు. ఆ గదిలో పక్కలు వేసింది జయ. పడుకోండి నేను కాలేజికి వెళ్ళాలి. ఒంటిగంటకు రాను. నాలుగింటికి వస్తాను. ఈలోపల మీరు కాఫీ తాగండి." ఇందిర లేచి చెప్పులు వేసుకుంటూ జయను పిలిచింది.

"చూడు. అమ్మకు రెండుగంటలకు కాఫీ తాగే అలవాటు. నాన్నకు కాఫీతో చేరెడు వేరుశనగపప్పు తినటం అలవాటు. వేళకు అందించు." వెళ్ళిపోయింది.

సాయంత్రం ఐదుగంటలు కాగానే గంగ కూతుర్ని ఎత్తుకుని వచ్చింది. ద్రాక్షపళ్ళు అరటిపళ్ళు బల్లమీద పెట్టింది.

"ఆరోగ్యం బాగుందా పిన్నిగారూ ! బాబాయిగారు ఎలా ఉన్నారు ? చాలా రోజులకు చూశాను" అనంతమ్మ పక్కనే కూర్చుంది పిల్లను ఒళ్ళో పెట్టుకుని.

"నీవూ ఇక్కడే ఉద్యోగం చేస్తున్నావా అమ్మాయీ ?" అడిగింది అనంతమ్మ.

"అవునండీ. ఇందిరగారు పనిచేసే కాలేజిలోనే."

"మీ యిద్దరూ స్నేహితురాళ్ళు కదుటమ్మా ! గారంటావేమిటి ?"

"వారిప్పుడు మాకు ప్రిన్సిపల్ అండీ. గౌరవంగా మాట్లాడాలి."

"అలాగా ! మీ వారూ ఈ ఊళ్ళోనేనా ?"

"కాదండీ. పన్నెండు గంటల దూరపు ప్రయాణంలో ఉన్నారు."

"ఏం ఉద్యోగాలమ్మా ఇవి ?" అనంతమ్మ అంటుందేమోనని ఆమె ముఖం లోకి చూశాడు లక్ష్మయ్య. కాని –

"ఉద్యోగాలు మరి ! ఒక ఊళ్ళోనే రమ్మంటే వస్తాయా ?" అన్నది సానుభూతి చూపించినట్లుగా అనంతమ్మ.

జయ కాఫీ తీసుకువచ్చి గంగకు ఇచ్చి పిల్ల చేతికి బిస్కట్లు అందించింది.

స్నానంచేసి తెల్లటిచీర కట్టుకుని నవ్వుతూ వచ్చింది ఇందిర.

అందరూ కలిసి ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు. గంగ వెళ్ళేటప్పుడు అనంతమ్మ తను తెచ్చిన వస్తువులన్నీ కొంచెం కొంచెం తీసి పొట్లాలు కట్టి చేతికిచ్చింది.

"వస్తూ ఉండమ్మా మేము ఉన్నన్నాళ్లూ. నాకు కాస్త కాలక్షేపంగా ఉంటుంది" అన్నది అనంతమ్మ సాగనంపుతూ.

ఇందిరకు చాలా సంతోషంగానూ, సంతృప్తిగానూ ఉంది. తల్లీ తండ్రీ వచ్చారంటే ఏ బెంగా లేకుండా ఉన్నది. ఆ పల్లెటూళ్లో ఉంటే వాళ్లకే చిన్న బాధ కలిగినా దిక్కెవ్వరు ? ఇంక వీళ్ళను అక్కడికి పోనివ్వకుండా నిలుపు చేయాలని నిశ్చయించుకున్నది.

కాలేజిలో ఆనాడు కొంచెం పని ఎక్కువగా ఉన్నది. విజిటర్స్ వచ్చారు. కాలేజి మేనేజిమెంటు వారంతా వచ్చారు. అందరికీ అన్ని సమాధానాలు చెప్పి పంపించేసరికి ఒంటిగంట దాటింది. ఇంటికి వచ్చి భోజనం చేయాలని లేవబోతుండగా చంపకం హడావిడిగా పరుగెత్తుకుంటూ వచ్చింది.

"మేడమ్ ! సుందర్‌గారు క్లాసులో పడిపోయారట. అందరూ పరుగెత్తుకుంటూ వెళ్తున్నారు."

"అరెరే. పదండి నేను వస్తాను." ఇందిర చంపకం వెళ్ళేసరికి అందరూ గుమిగూడి ఉన్నారు. ఇందిర రాగానే అందరూ పక్కకు జరిగారు.

"ఏమయింది ?"

"ఒళ్ళు కాలిపోతుంది మేడమ్. నిన్ననే జ్వరం వచ్చింది. ఇవాళ సెలవు పెట్టమని చెప్పినా వినకుండా వచ్చారు" అన్నాడు గోవిందరావు. ఆయనకొక్కడికే సుందర్ మీద సానుభూతీ, గాఢమైన అభిమానమూను.

"బండిమీద ఇంటికి పంపిద్దామా ? లేకపోతే డాక్టర్ని పిలిపిద్దామా ?" ప్రిన్సిపల్‌గా తన బాధ్యత నిర్వహించాలనుకుంది ఇందిర.

"ఇంట్లో ఏముంది మేడమ్ ? ఈయనను ఎవరు చూస్తారు ? యంత్రంలా డబ్బు సంపాదించి ఇవ్వటం వరకేగాని ఇంట్లో రెండుపూటలా ఇంత అన్నం ఆప్యాయంగా పెట్టేవారు లేరు. బయట ఎక్కడో ఒకపూట తినీ ఒకపూట తినాకా కాలం గడుపుతున్నాడు."

భయపడినట్టు ముఖం పెట్టింది ఇందిర.

ఆ ఆడది ఎంతకయినా తగిందే ననుకుంది శ్రీదేవి.

చంపకం సుస్మిత అతడి భార్యను ఒకసారి చూసితీరా లనుకున్నారు.

మగవాళ్ళంతా ఎవరి మనసుల్లో ఏముందో పైకి చెప్పలేకపోయారు. అక్కడ స్త్రీ జనం ఎక్కువగా వున్నది. అందులోనూ ప్రిన్సిపల్ ఒక స్త్రీ. స్వేచ్ఛగా మాట్లాడాలంటేనే ఇబ్బందిగా ఉంది వాళ్ళకు.

"అయితే సుందర్‌గారికి పైఖర్చులు ఎట్లా గడుస్తాయి ?" అక్కడే కొందరిలో ఈ ప్రశ్న ఉదయించింది. ఎవరో పైకి అననే అన్నారు.

"ఆయన భార్యకు తెలియకుండా సాయంత్రం ఆరుగంటల నుండి ఎనిమిది గంటలవరకూ ఒక కొట్లో లెక్కలు రాస్తారు. వాళ్ళు ఒకనూరు రూపాయ లిస్తారు. బట్టలకొట్టు కనుక ఏడాదికి రెండుజతల బట్టలు - ఆయనకు తగి నట్లుగా ఇస్తారు" గోవిందరావ్ అందరికీ సమాధానం చెబుతున్నాడు.

"ఆమెకు చెప్పకుండా ఉండగలిగాడా ?" ఎవరిదో ప్రశ్న.

"ఆమె వదిలిపెట్టకుండా రోజూ ఆరా తీస్తూనే ఉంటుంది. ప్రతిరోజూ తగాదాలు - అరుపులు - అల్లర్లు - అఘాయిత్యాలు చేస్తూనే ఉంటుంది. ఒకసారి నిద్రమాత్రలు మింగేసింది. పాపం హాస్పిటల్‌కు తీసుకెళ్ళి - కేసు కాకుండా అందరి కాళ్లూ పట్టుకున్నాడు. ఊం అన్నా ఆం అన్నా ఆత్మహత్య చేసు కుంటానంటుంది. ఆమె కూడా చదువుకున్నదే. టెన్నిస్ క్లబ్బులో మెంబరు. మంచి మాటకారి. పాపం, ఆయనను పురుగును చూసినట్టు చూస్తుంది. సేవకుడితో మాట్లాడినట్టు మాట్లాడుతుంది. ఈయన ఏ విషయంలోగాని నోరెత్తి తన ఉద్దేశ్యం మాటవరసకయినా చెప్పటానికి వీలులేదు."

"అంతమాత్రం అదుపులో ఉంచకపోతే ఈ మగవాళ్ళు కాలికింద పెట్టి నల్లిని నలిపినట్లు నలిపేస్తారు ఆడవాళ్లను. చటుక్కున అనేసింది చంపకం.

ఒకరినొకరు కించపరచుకోకుండా అధికారం చలాయించకుండా బతకలేరా ఈ స్త్రీ పురుషులు ?" శ్రీనివాసరావు తనకు కలిగిన విస్మయాన్ని పైకి అనేశాడు.

ఈ లోపల ఇందిర బండీ తెప్పించి దానిలో సుందర్‌ను గోవిందరావునూ హాస్పిటల్‌కు పంపించింది. గుంపును తప్పించుకుంటూ ఇంటికి చేరింది.

సుందర్‌ను తీసుకుని గోవిందరావు వెళ్ళాడు. కాని అక్కడ గుమికూడిన వారందరిలో భావోద్రేకం చల్లారలేదు. ఎవరికి తోచినట్టు వాళ్ళు మాట్లాడు కుంటున్నారు.

"ఏమండోయ్ శ్రీనివాసరావుగారూ ! సుందర్‌గారి మాట వచ్చేసరికి మీ రిలా అంటున్నారు. ఆడవాళ్ళపట్ల అమానుషంగా ప్రవర్తించే పురుషుల మాట చెప్పరేం ? ఇప్పుడు ఆడవాళ్ళు చదువుకుంటున్నారు. వాళ్ళకూ స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలిసివచ్చింది. తెలివిగల ఆడది మగవాడి ఆటలను సాగ నివ్వటం లేదు. ఆడవాళ్ళకూ మంచిరోజులు వస్తున్నాయండోయ్ !" చంపకం చురుగ్గా జవాబిచ్చింది.

"అప్పుడు వాళ్ళుచేసిన దురాగతాలకూ పిచ్చిపనులకూ ఇది జవాబా చంపకం గారూ ? ఆ పిచ్చిపనులు చేయటానికేనా మీకు స్వాతంత్ర్యం కావాలంటారు ? దీనికోసమేనా మీ కృషి అంతా ?" శ్రీనివాసరావు చంపకం వంటి స్వాతంత్ర్య ప్రియులను ఝాడించి వదిలిపెడతాడు.

వాదనకు దిగేసరికి చంపకానికి ఒళ్ళు తెలియదు. "మేం చేస్తే తప్పా ? అదే మీరు చేస్తే తప్పుకాదా ? ఏమిటండీ ఏ శాస్త్రంలో ఉందని స్వేచ్ఛగా తిరుగుతాడు మగవాడు ?" తెగేసి అడిగినట్టుగా అడిగింది.

"చంపకంగారూ ! తప్పు తప్పే. ఎవరుచేసినా అది తప్పే. తప్పు చేయ మని ఏ శాస్త్రమూ చెప్పదు. అవ్యక్తతతో ఒకరుచేసిన తప్పును స్వాతంత్ర్యం పేరుతో మీరూ చేయాలనుకోవటం వివేకం కాదు." నెమ్మదిగానే చెప్పబోయాడు శ్రీనివాసరావు.

"అదిగో మళ్ళీ అదేమాట అంటున్నారు. వివేకం కాదని అనటానికి మీ రెవరండీ !" నిప్పులు కురిపించింది చంపకం.

"చంపకంగారూ ! వద్దనలేదు. మేముచేసిన తప్పులన్నీ మీరూ చెయ్యండి. మన ఆంజనేయులుగారు రోజుకు రెండుపెట్టెల సిగరెట్లు కనీసం కాల్చి పారేస్తారు. అది తప్పే. అదొక దురలవాటు. దానిని మాన్పటానికి ప్రయత్నాలు జరగాలి గాని......"

"మీరూ కాలుస్తారా అంటారా ? ఏం తప్పండీ ? అదొక దురలవాటని మీరే అన్నారు కదా ? కానీయండి ?"

"అయితే సరే చంపకంగారూ ! కాల్చండమ్మా కాల్చండి. ఎవరు వద్దన్నారు ? కాల్చండి. స్వాతంత్ర్యం వచ్చేస్తుంది."

"శ్రీనివాసరావ్ ! మన మిక్కడ గుమిగూడిన పని అయిపోయింది. ఉన్నకొద్దీ మాటకు మాట తెగులు. పద పోదాం." తోటి లెక్చరరు లాక్కు పోయాడు శ్రీనివాసరావును.

అలయు ఎళ్ళిన చాలాసపటివరకూ చంపకం తన ఉద్రేకాన్ని అదుపులో పెట్టుకోలేకపోయింది. అందరూ వెళ్ళిపోయిన తరువాత కొంగు దులుపుకుని కదిలింది.

"అబ్బ ! అదరగొట్టేశావు ఈ మగమహారాజులందరినీ చంపకం ! అట్లా ఉండాలి వాగ్ధాటి. మళ్ళీ జన్మకు నోరెత్తడులే మానవుడు." భుజం తట్టింది సుస్మిత.

వారంరోజులవరకూ ఈ అలజడి కాలేజిస్టాఫ్‌ను కలవరపరుస్తూనే ఉంది. శ్రీనివాసరావు చంపకం ఎప్పుడు కనబడినా ముక్కుపుటాలెగవేస్తూ ముఖం పక్కకు తిప్పుకుని నడుస్తున్నాడు. చంపకం విసురుగా ముఖం పక్కకు తిప్పుకుని తిరుగుతోంది.

గంగ ప్రత్యేకంగా వచ్చి చంపకాన్నీ సుస్మితను కలుసుకుని అభినందించింది.

"నీవు కూడా ఉండాల్సింది గంగా అప్పుడు ? ఆ శ్రీనివాసరావు మగవాళ్ళందరికీ ప్రాతినిధ్యం వహించి నోరు పారేసుకున్నాడు. నేను తగినట్టు జవాబిచ్చి నోరు మూయించాననుకో. అంతమంది చుట్టూ మూగారు కదా. ఒక్కళ్ళు నోరెత్తితే ఒట్టనుకో." యుద్ధంలో గెలిచినట్టు చెప్తోంది చంపకం.

"మన చంపకం ఆయన్ని ఊరికే వదిలిపెట్టలేదు గంగా. ఝాడించి వదిలిపెట్టింది. స్త్రీల ప్రతినిధిగా నిలబడి జవాబులిచ్చింది. ఇంక ఈ జన్మలో ఆడవాళ్ళతో చర్చలకు దిగడులే."

గంగకు చాలా సంతోషం ఇటువంటి దిగ్విజయాలను గురించి వినాలంటే. సమయానికి తను అక్కడ లేనందుకు చాలా నొచ్చుకుంది. "చంపకం ఆడవాళ్ళకేదయినా మంచి జరగాలంటే నీవంటి వాళ్ళవల్లనే జరగాలి. నీవే ఆ పుణ్యం కట్టుకోవాలి" అన్నది గంగ.

చంపకం ముఖంలో కోటిదీపాల వెలుగు వెలిగింది. సుస్మిత సంబరపడిపోయింది.

* * *

ఎంత పొద్దుపోయినా సరే – రాత్రిళ్ళు పడుకునే ముందర ఒక పావుగంటసేపు కనీసం కథలపుస్తకమయినా సరే – నవల అయినా సరే చదవనిదే కంటికి నిద్రరాదు ఇందిరకు. ఆ పుస్తకం ఎన్నిసార్లు చదివినదయినా – అసంపూర్తిగా ఉన్నా చేతిలోకి తీసుకుంటుంది. చదువుతూ చదువుతూ ఉండగానే పుస్తకం చేతిలోనుంచి జారి పడిపోతుంది మంచానికి దగ్గరలోనే ఉన్న బల్లమీది పుస్తక మొకటి చేతిలోకి తీసుకుంది ఇందిర పడుకోబోతూ.

"మనమొచ్చి పదిహేనురోజులు దాటుతున్నాయి అప్పుడ" అంటుంది అనంతమ్మ. పక్కగదిలో నుంచి మాటలు వినబడుతున్నాయి ఇందిరకు.

"అయితే ఏం ? అక్కడ పనులేం మించిపోతున్నాయి ?" లక్ష్మయ్య చుట్ట కాలుస్తున్నాడు కాబోలు వాసన వస్తున్నది.

"ఇక్కడ చుట్టాలింటికి వచ్చి ఊరికే తిని కూర్చున్నట్టుగా ఉంది నా ప్రాణానికి. ఏమీ తోచదు."

"తోచకపోతే రెండుపూటలా వంటచెయ్యి."

"అమ్మాయి చెయ్యద్దని చెప్పింది. జయ ఉంది కనుక నన్ను పని ముట్టుకోవద్దన్నది. ఇల్లు సర్దటం — వంటచేయటం - కాఫీ టిఫిన్లూ అన్నీ ఆ అమ్మాయే చేస్తున్నది. మంచిపిల్ల దొరికింది. మర్యాదగా మాట్లాడుతూ ఇంటి పని ఒక ఉద్యోగంలా చేస్తున్నది. చదువుకుంటున్నది - ఏమిటో నాకు తెలియదు. పెళ్ళికూడా అయినట్లుంది. పాపం, ఇక్కడెందుకున్నదో మరి !"

"నీవు అడక్కుండా వదిలిపెట్టవే ? అడిగి తెలుసుకోలేదూ ఇంకా ? ఇన్నాళ్లెట్లా ఆగావబ్బా ?"

తండ్రి మాటలకు నవ్వొచ్చింది ఇందిరకు.

"చిన్నపిల్ల. చూస్తే జాలేస్తున్నది. పాపం - జీవితంలో ఏదో ఎదురుదెబ్బ తగిలినట్టుంది. వివరాలడిగి ఏడిపించకూడదనిపించింది "

తల్లి చెప్తున్న జవాబు ఇందిర చెవులు దోరగిల పెట్టుకుని విన్నది. అవును. ఆమె గంగ విషయంలో కూడా అట్లాగే అన్నది. కొందరికి ఆడపిల్లల కష్టాలు వింటే హృదయం కరిగిపోతుంది. అదే కొందరికి చిలవలు పలవలుచేసి అందరికీ చెప్పి యాగీ చెయ్యబుద్దేస్తుంది.

"మన ఇందిర ఒక యింటిదయితే చూసి ఆనందించాలనిఉంది. ఆ అదృష్టం ఎప్పటికి పడుతుందో ఏమో ?'' మాటలు నీరసంగా వస్తున్నాయి అనంతమ్మ నోట్లోనుంచి. కంఠం కూడా ఏదోమాదిరిగా వినబడుతున్నది.

చివ్వున లేచి కూర్చుంది ఇందిర.

"దాని మనసులో ఏముందో మనకు తెలియదు. మనం నోరు తెరిచి దాన్ని అడగొద్దు."

"మీ మాటమీదే నేను నిలబడ్డాను. ఇందిరను పెళ్ళివిషయమేకాదు - జీతమెంత అని కూడా నేను అడగలేదు "

"అమ్మాయి స్టేటస్‌కూ చదువుకూ తగ్గవాడు కంటికి కనబడాలా? ఇక్కడికి




వచ్చేముందు పిహెచ్.డి కూడా చేసిందట. మొన్న ఎవరితోనో చెబుతుంటే విన్నాను."

"అంటే ఏమిటి ?"

"అది ప్యాసయితే డాక్టరని పిలుస్తారు."

"అయితే మందులివ్వదేం ? మళ్ళీ చదువే చెబుతోందిగా !"

"మందు లిచ్చేది కాదు. చదువులో పెద్ద డిగ్రీ."

"ఏదయినా సంతోషమేగాని నా మనసుకు తృప్తిగా లేదండీ."

"ఊఁ మంచినీళ్ళు తాగి పడుకో."

తల్లి ఆరాటము ఇందిరకు అర్థమయింది. తండ్రికీ బాధగానే ఉంది కాని - తల్లి మాదిరిగా బయటపడటంలేదు.

స్త్రీ చదువులు చదవవచ్చు - డిగ్రీలు సంపాదించవచ్చు - అపారంగా ధనం సంపాదించవచ్చు. కీర్తిప్రతిష్ఠలు ఆర్జించవచ్చు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అనుభవించవచ్చు ఇవన్నీ చేతికందినా ఇంకా ఏదో వెలితిగా ఉంటుందేం ?

ఎంతమంది స్త్రీలు విద్యా వైజ్ఞానికంగా ఆర్థికంగా రాజకీయంగా పురోగమించి ఒంటరిగా ఉన్నవాళ్లు లేరు ?

అందరూ మనసులో ఒంటరితనం అనుభవిస్తూ ఉంటారా ? ఇది ఒక్క మన దేశంలోనేనా !

మనదేశంలో స్త్రీకి వివాహం సంప్రదాయసిద్ధమైపోవటంచేత ఏ ఒక్కరు వివాహం కాకుండా ఉన్నా ఇట్లా అనిపిస్తుందా ? లేక స్త్రీ మనసే అటువంటిదా?

ఏమో ! తనింకా ఏదీ తెలుసుకోలేకపోతున్నది.

తల్లీ దండ్రీ నిద్రపోయినట్టున్నారు. నిశ్శబ్దంగా ఉంది. ఇందిరకు కూడా కళ్ళు మూతలు పడ్డాయి.

పొద్దున్నే కాఫీ తీసుకువచ్చి బల్లమీద పెడుతున్న జయను "రోజూ క్లాసులకు వెళ్ళుతున్నావా ? పరీక్ష లెప్పుడు ?" అడిగింది ఇందిర.

"వెళ్ళుతున్నాను. స్పీడ్ కూడా బాగా వచ్చింది. పరీక్షలు వచ్చే వారమంటున్నారు."

"పరీక్షలు కానియ్, ఏదయినా ఆలోచిద్దాము."

తల వంచుకుని వంట యింట్లోకి వెళ్ళుతున్న జయ ఇందిర ముఖంలోకి దీర్ఘంగా చూసింది.

"అమ్మా ! నీతో చెప్పటం మర్చిపోయాను. ఈ చుట్టుపక్కల చూడవలసిన ప్రదేశాలు చాలా ఉన్నాయి. దేవాలయాలు కూడా ఉన్నాయి. ఎవరినయినా తోడు తీసుకుని వెళ్ళి చూసిరండి" తండ్రివంక చూస్తూ తల్లితో అన్నది ఇందిర.

"నాకు అవేం చూడాలని లేదమ్మా." అనంతమ్మ కాఫీగ్లాసు బల్లమీద పెట్టింది.

"ఏం నాన్నా ? ఇద్దరూ వెళ్ళి చూసిరాకూడదూ ? అమ్మ కేమిటో-ఏదీ వద్దంటుంది. మొన్న మీకిద్దరికీ తెచ్చిన బట్టలు ఆ బల్లమీదనే పడేసింది. కొత్త బట్టలు కట్టుకుంటే నేను చూసి సంతోషిస్తాను కదా నాన్నా ?" బాధతో ముఖం ముడుచుకుంది ఇందిర

"ఏం అనంతం ? కట్టుకో నన్నావా ? బట్టలు తెచ్చినట్టూ, మీ అమ్మ అట్లా పడేసినట్టూ నాకు తెలియదమ్మా. నాకు తెలిస్తే అట్లా జరగేదికాదు తీసుకురా. ఇప్పుడే స్నానం చేసి కట్టుకుంటాము."

చెమ్మగిల్లిన కళ్ళను తండ్రి చూడకుండా ముఖం పక్కకు తిప్పుకుని గదిలో నుంచి బట్టలు తీసుకువచ్చి బల్లమీద పెట్టింది.

జరీ అంచులతో సన్నగా మెత్తగా ఉన్న ధోవతుల చాపు-తల్లికి ఒక పట్టు చీరె-కాగితపు సంచులలోనుంచి బయటికి తీసి తండ్రికి చూపించింది.

"ఎందుకమ్మా ఇంతింత ఖరీదుగల బట్టలు ? పెళ్ళా, పడుగా ?" నోరు జారి అన్నట్టుగా నాలుక కొరుక్కున్నాడు.

"అవి లేపనే కాబోలు అమ్మ అట్లా పారేసింది బల్లమీద ?" ఇందిర గబ గబా స్నానాల గదిలోకి వెళ్ళి తలుపులు వేసుకుంది.

అనంతమ్మా, లక్ష్మయ్యా ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు.

ఇందిర స్నానంచేసి రాగానే జయ టిఫిన్ ముందర పెట్టింది. టిఫిన్ మాట్లాడకుండా తిని డ్రెస్ చేసుకుని కాలేజికి వెళ్ళిపోయింది.

మధ్యాహ్నం ఒంటిగంటకు గంగ వచ్చింది ఆఫీసురూంలోకి.

"ఇంటికి పోదాం రా. భోజనం చేద్దాం" అన్నది ఇందిర.

"భోజనం వద్దు గాని–నీ వొక సహాయం చేయాలి ఇందిరా. ఇక్కడ లెక్చరర్లు మందరం కలిసి చిట్ ఫండ్ వేస్తున్నాము నెలకు ఏభయిరూపాయల చొప్పున.పది నెలలు దాని టైము. కిందటిసారి వడ్డీ పాట పాడి నేను తీసుకున్నాను. ఈ సారి సూర్యప్రభ తనకు కావాలంటోంది. ఆమె నొప్పించి నా కిప్పించాలి." దీనంగా ముఖం పెట్టింది గంగ.

"నీ ఛాన్సయిపోయిందిగా ? మళ్ళీ చిట్ఫండ్ మొదలయినప్పుడు గాని నీ వంతు రాదేమో కదూ ?"

"అవును, రాదు. కాని చాలా అ.సరంగా ఉంది. నేనామెకు మళ్ళీ సర్దు తాను ఇ:దిరా !"

"అవసర మంటున్నావు. నెల నెలా జీతం వస్తోంది. కిందటి నెలలోనే అయిదువందల చిట్ఫండ్ తీసుకున్నానంటున్నావు. ఏంచేస్తున్నావు ?" నవ్వింది ఇందిర.

"నీకు నవ్వుగా ఉందా ఇందిరా ! పిల్లతో కాపరం మాటలనుకుంటున్నావా ! నాకు జీతం చాలటంలేదు.

"చిట్ఫండ్ అయిదువందలు ఏంచేశావు మరి ?"

"ఒక పట్టుచీరె కొన్నాను. ఎక్కడికి వెళ్ళినా కట్టినవే కట్టాలి, అందుకని ఒక పెద్ద చీరె కొత్త డిజైను వస్తే కొన్నాను,"

"పోనీ ఆ అయిదువందలకు రెండు చీరెలు కొనుక్కోలేకపోయావా ?"

"ఆ రెండువందల రూపాయల చీరెలు నాకూ ఉన్నాయి. ఇది పెద్ద చీరె అని కొన్నాను."

"సరే సరదాపడి కొనుక్కున్నట్టున్నావు. సూర్యప్రభ కూడా సరదా పడుతున్నదేమో చీరెకోసం ?"

"ఆఁ, సరదా కూడాను సూర్యప్రభ ముఖానికి." మూతి విరిచింది గంగ.

"అదేం ? పాపం, సరదా ఉండకూడదా ?"

"ఆడబడుచు పెళ్ళి కుదిరిందిట, అందుకని డబ్బు కావాలట. అవసరం అవసరం," అని కలవరిస్తోంది.

"పాపం, అవసరమే కదా, పెళ్ళి బాధ్యత ఉన్నప్పుడు సరదాలంటూ కూర్చుంటే ఎట్లా ?"

"అయినా ఈ అయిదు వందలతో ఆ బాధ్యత తీరుతుందా ?"

"తీరదనుకో. కాని-తనకు చేతనైనంత తను చెయ్యాలి. భర్తకు బాధ్యత అయితే భార్యకూ బాధ్యతే కదా. ఇద్దరూ బాధ్యతలను పంచుకోవాలి. ఆడవాళ్ళు ఉద్యోగాలు చేయటం చీరల కోసమే ననుకుంటే ఏం బాగుంటుంది? సూర్యప్రభ తన బాధ్యతను నెరవేరుస్తుంటే మనం నవ్వకూడదు, హేళన చేయకూడదు." మందలించినట్టుగా మాట్లాడింది ఇందిర.

"సర్లే, ఆ శ్రీదేవి కూడా ఇలాటి శ్రీరంగనీతులే చెప్పటం మొదలుపెట్టింది. వాళ్ళిద్దరూ చెరిసగమూ ఇంటిఖర్చులు పెడతారట, మిగతాది ఇద్దరూ బ్యాంకులో వేస్తారుట ఎక్కడో ప్లాటు తీసుకున్నారట. ఇల్లు కడతారట. ఇల్లు ఈమె సంపాదనతోనే కట్టాలా ?" హేళనగా నవ్వింది.

ఇందిరకూ నవ్వు ఆపుకోలేనంతగా వచ్చింది, అయితే మరొకందుకని చెప్పటానికి కొంతసేపు తటపటాయించింది.

"గంగా! చదువుకొని సంపాదించే స్త్రీలకు బాధ్యతలు ఉండవనుకుంటున్నావు. ఉంటాయి. స్త్రీలకు హక్కులే గాని బాధ్యతలు లేవనుకుంటున్నావు-ఇది పొరబాటు. ఇంత చదువుకున్నావు గాని-ఇష్టం వచ్చినట్టు నడుచుకోవటమే స్వాతంత్ర్య మనుకుంటున్నావు. కాదు, భర్త మంచి చెప్పినా హింసించట మనుకుంటున్నావు. హితము చెప్పినా గ్రహించలేని చదువు నేమనాలి ?"

గంగ ముఖం కోపంతో ఎర్రబడ్డది. ప్రిన్సిపల్ కనుక ఎదిరించి మాట్లాడలేకపోయింది.

"అయితే నాకిప్పించనంటావు. ఈ లెక్చెరంతా అందుకేనా ?" ముఖం తిప్పుకుంటూ అడిగింది.

"ఏంచేస్తావు ? ఆ డబ్బుతో ఏమయినా కొనాలా ?" నవ్వుతూ అడిగింది ఇందిర.

"అవును. బనారసు చీరెలు కొందా మనుకుంటున్నాను. జీతంలో ఎలాగూ కొనలేను."

నవ్వుతూ తల అడ్డంగా తిప్పింది ఇందిర. "నీవు చీరెలు కావాలనుకుంటున్నావు సూర్యప్రభకు ఆడబడుచు పెళ్ళికి కావాలి. వీటిలో ఎది ముఖ్యమో చిన్న పిల్లనడిగినా చెప్పగలుగుతుంది. అయినా ఇది నా చేతిలో ఉన్నపని కాదు.

మీరంతా కలిసి నడుపుకుంటున్నది. నేను జోక్యం కలిగించుకోవటం బాగుండదు." చటుక్కున లేచి బయలుదేరింది లాడ్జికి.

ఇందిర లేచిన తరువాత తనూ లేచింది గంగ. ఇందిర కనబడుతున్నంత సేపూ ముక్కుపుటాలెగరవేస్తూ చూసింది. మూతి మూడువంకరలు తిప్పు కుంటూ అడుగులు వేసింది.

* * *

విద్యార్థినులు పరీక్షలు రాసిన తరువాత విరామం లేకుండా కళాశాల అభ్యుదయ ఉత్సవాల కార్యక్రమాల తయారీలో మునిగిపోయారు. పరీక్షల ముందర కొందరు ఉపన్యాసకురాండ్రలోను విద్యార్థినులలోను అభిప్రాయభేదా లొచ్చినవి. ఈ ఉత్సవాలను మార్చి నెలలో చేసి, పరీక్షలు ఏప్రిల్ నెలలో పెట్టించాలని కొందరు పట్టు పట్టారు. కొందరు పరీక్షలయిన తరువాతనే అభ్యు దయ ఉత్సవాలు జరపాలన్నారు. చివరకు పరీక్షలయిన తరువాత జరపాలన్న తీర్మానానికే ఓట్లు అధికంగా వచ్చాయి.

విద్యార్థినులు తీరిగ్గా నాటకం రిహార్సల్సు చేస్తున్నారు. లలితసంగీతానికి ఇద్దరు గాయనులను ఎన్నిక చేసుకున్నారు. పాటల ఎన్నిక అయిన తరువాత వాళ్ళు సాధనచేయటం మొదలుపెట్టారు. ఫాన్సీ డ్రెస్సు పెరేడ్‌లో కొందరు లెక్చెరర్లు పాల్గొంటామని తీర్మానించుకున్నారు. పేర్లు ఇచ్చిన వాళ్లలో చంపకం-సుస్మిత-గంగ-ఈ ముగ్గురే ఉన్నారు.

అందరూ తమ తమ శక్తినంతా ధారపోసి సిద్ధపడుతున్నారు.

కళాశాల భవనానికి గచ్చుపోయినచోట సున్నం చేసి రంగులు వెయ్యాలని ప్రిన్సిపల్ ఇందిర మేనేజిమెంటుకు ఉత్తరంమీద ఉత్తరం రాసి శాంక్షను చేయించింది. పిల్లల పరీక్షలు కాగానే భవనానికీ, తలుపులకూ, కిటికీలకూ రంగులు వేశారు. తోటంతా శుభ్రం చేశారు కళాశాల ప్రాంగణంలో పెద్ద షామియానా వేశారు. రంగు కాగితాల తోరణాలూ-విద్యుద్దీపాలంకరణ చూడ ముచ్చటగా ఉంది. వేదిక చక్కగా అలంకరింపబడ్డది ఆహ్వానితులకు ఎటువైపు కూర్చున్నా వేదిక సమీపంగా ఉండేటట్లు కుర్చీలు అమరికగా వేశారు. స్త్రీ పురుషులకు వచ్చే దారీ వెళ్ళే దారీ ప్రత్యేకంగా ఏర్పాటుచేశారు. ఆహ్వానితులను లోపలికి తీసుకు వచ్చి సీట్లు చూపించటానికి వాలంటీర్లు యూనిఫారాలతో-బాడ్జీలతో గేటు దగ్గర నిలబడ్డారు

ఉపన్యాసకురాండ్రంతా కార్యక్రమపు హడావిడిలో ఉంటారుగదా అని ఈ ఏర్పాట్ల పెత్తనమంతా శ్రీనివాసరావు తీసుకున్నాడు.

"నాన్నా! ఇవాళ జరుగబోయే అభ్యుదయ ఉత్సవానికి నీవు కూడా రావాలి. నేను కొంచెం ముందుగా వెళ్తాను. మిమ్మల్నిద్దరినీ జయ తీసుకు వస్తుంది అమ్మా! నీవు కూడా రా." ఇందిర కాలేజికి బయలుదేరుతూ చెప్పింది.

"నే నెందుకమ్మా. ఏదో పిల్లల ప్రోగాం! అమ్మ వస్తుందిలే" అన్నాడు లక్ష్మయ్య

"పిల్లల ప్రోగ్రామా? అదేమిటి నాన్నా? చిన్నపిల్లలు కారు వాళ్ళు. కాలేజి పిల్లలు. లెక్చెరర్లు కూడా పాల్గొంటున్నారు. నీవు తప్పకుండా రావాలి. ఈ ఊరి వాళ్ళంతా వస్తున్నారు. కాలేజి మేనేజిమెంటు కూడా వస్తుంది," ఇంకా నిలబడే చూస్తున్నది ఇందిర ఏదో చెప్పాలన్నట్టుగా.

"వస్తాంలే అమ్మా మంచి డ్రెస్సులో వస్తాంలే. నీవు నిశ్చింతగా వెళ్ళు." ఏదో గ్రహించినట్టుగా అన్నాడు లక్ష్మయ్య.

దొరికిపోయినట్టుగా ముఖంపెట్టి నవ్వేసింది ఇందిర.

సాయంకాలం ఐదుగంటలకు కుమారి మైథిలి విఘ్నేశ్వరస్తుతితో సభ ప్రారంభమయింది. సభాధ్యక్షులే కళాశాల ప్రెసిడెంటు ఆయనకు ఒకపక్క ప్రిన్సిపల్ ఇందిర కూర్చున్నది. మరొక పక్కగా విద్యార్థినీ సంఘ కార్యదర్శినీ, అధ్యక్షురాలూ కూర్చున్నారు.

అతి నిశ్శబ్దంగా ఉన్న ఆ నిండుసభలో సభాధ్యక్షులు తనకు వేసిన పూల హారం సుతారంగా మెడలోనుంచి తీసి బల్లమీద పెడుతూ, కళాశాల చరిత్రనూ, దాని క్రమాభివృద్ధిని గురించి విపులీకరించి, ఈ ప్రిన్సిపల్ వచ్చినప్పటినుంచీ కళాశాలలో క్రమశిక్షణ చెప్పుకొని గర్వించతగ్గదిగా ఉందనీ విజేతల సంఖ్య కూడా అదివరలోకంటె హెచ్చిందనీ ప్రశంసించారు. ఈ కళాశాల ఈ ప్రిన్సిపల్ చేతిలో ఇంకా ఇంకా అభివృద్ధిచెందాలని మేనేజిమెంటు ఆకాంక్షిస్తున్న దని తెలిపి కార్యక్రమాన్ని సాగించమని ప్రోగ్రాము చదివారు

ప్రోగ్రాములో మొట్టమొదటి అంశము వక్తృత్వపు పోటీ. పాల్గొనేవారు కుమారి కాంచనలత, కుమారి పద్మలత. ఇద్దరు కళాశాల విద్యార్థినులు. ఒకరు బి. ఏ. రెండవ సంవత్సరము-రెండవవారు బి. యస్సీ. మొదటి సంవత్సరము. వివాదాంశము 'వైవాహిక జీవితము ఎలా ఉండాలి.'

సభలో ఆసీనులై ఉన్న పురుషులంతా సర్దుకుని వినటానికి సావధానులై ఉన్నారు. ప్రేక్షకులలో స్త్రీలు పిల్లల ఉద్దేశ్యాలేమిటో వినాలని వేదిక వైపే చూస్తున్నారు. అవివాహితలంతా కుతూహలంతో చెవులే కాకుండా కళ్ళు కూడా ఒప్పగించారు.

కుమారి కాంచనలత మంత్రద్రష్ట్రయిల అను ఉపన్యాసం మొదలు పెట్టింది.

కాంచనలత నోరు విప్పి విప్పకముందే ఆమె మిత్రురాండ్రు కొందరు హర్షధ్వానాలు చేశారు.

పెదవులు మెల్లగా విచ్చుకున్నాయి. చిరునవ్వుతో కాంచనలత మైక్‌ను ఒక చేత్తో పట్టుకుని ప్రారంభించింది.

"వైవాహికజీవిత మంటే పెళ్ళయినతరువాత స్త్రీ పురుషులిద్దరూ కలిసి జీవించేది. వైవాహికజీవితంలో ఇద్దరిదీ చెరొక ఆలోచన—చెరొక పద్ధతి—చెరొక నియమం కాకుండా ఒక్కటిగా ఉండాలి. జీవితంలో స్త్రీ పురుషులు పడుగుపేకల్లా కలిసిపోవాలి. స్త్రీ పురుష లిద్దరికీ వేరు వేరు గౌరవాలు ఉన్నాయి. బాధ్యతలు ఉన్నాయి. వ్యక్తిత్వాలు ఉన్నాయి. ఒకరి కొకరు హీనులు కారు. అభిప్రాయభేదాలను కల్పించుకోకూడదు. ఒకవేళ కలిగినా తేలికగా తీసేసుకోవాలి. ఇద్దరి మధ్యా వైయక్తికమైన సిద్ధాంతాలు రాజీపడ నివ్వవు. వాటిని సమయానుకూలంగా సడలించుకుని జీవనసరళిని మృదు మధురంగా సాగిపోనివ్వాలి. వివాహమైన తరవాత స్త్రీ కొంత స్వేచ్ఛను కోల్పో తుంది. పురుషుడు కొంత స్వాతంత్ర్యాన్ని కోల్పోతాడు. సంపూర్ణ స్వాతం త్ర్యము ఏ ఒక్కరికీ ఉండదు. ఇద్దరూ ఒకరి కొకరు యజమానులుగా ఉండి అనురాగ బంధంతోపాటు ఐకమత్యాన్ని పెంపొందించుకోవాలి. ఆ తరువాత పుట్టిన బిడ్డలు తల్లిదండ్రుల ఐకమత్యానురాగాల మధ్య క్రమశిక్షణతో పెరుగుతారు.

ఈ జీవనసరళికి స్త్రీ పురుషుల విద్యా విజ్ఞానాలూ సంస్కారమూ తోడ్పడాలి గాని విచ్ఛిన్నం చేసేవిగా ఉండకూడదు. పరస్పర సహాయ సహకారాలను లోపింపచేసేవిగా ఉండకూడదు అంతమాత్రాన స్త్రీ పురుషులు తమ పౌర హక్కులనూ ఆర్థిక, సామాజిక, రాజకీయ స్వాతంత్ర్యాలను పోగొట్టుకొంటారని భయపడనవసరంలేదు, కాని—కొందరు యువతీ యువకులు పరస్పరావగాహన లేకుండా పరస్పరమూ అపార్థాలు చేసుకొంటూ జీవితాలు నరకం చేసుకుంటూ తమ సంతతికి కలుషిత వాతావరణం కల్పిస్తున్నారు. స్త్రీ పురుషులు జంటగా ఆనందించటానికి బదులు విడివిడిగా సుఖాలను వెదుక్కోవటం ప్రారంభిస్తుంటే పిల్లలు కూడా వాళ్ళను అనుసరించటానికి ప్రయత్నిస్తారు. కనుక స్త్రీ పురుషుల మధ్య అనుబంధమూ, ఐకమత్యమూ ముఖ్యము—అదే ప్రధానమైన వస్తువు. ఈ వస్తువు లోపిస్తే సంసారాలు విప్లవానికి దారితీస్తాయి, కనుక ఈ పంటను మనము పుష్కలంగా పండించాలి. సెలవు."

చప్పట్లతో ఇంచుమించు ఆ ఊరంతా మారుమ్రోగిపోయింది.

చేతిరుమాలుతో ముఖము సుతారంగా అద్దుకుంటూ కాంచనలత వేదికనుండి దిగిపోయింది.

సభికులలో కలకలం బాగా చెలరేగింది.

"ఎవరు రాసి బట్టీ పెట్టించారో గాని శాస్త్రీయంగా ఉంది."

"రాసి ఇచ్చినవారు ఏ కాలం మనిషో ?"

"ఆడవాళ్ళా ? మగవాళ్ళా ?"

"మన శ్రీనివాసరావుగారు రాసిచ్చి ఉంటారు." చంపకం, సుస్మిత ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. ముఖాలు కందగడ్డ లయ్యాయి. కాలేజీ లెక్చెరర్లంతా గుసగుస లారంభించారు.

"నిశ్శబ్దం నిశ్శబ్దం" అంటూ నాలుగువైపులనుండీ కేకలు వినవచ్చాయి. కొంత సద్దుమణిగిన తరువాత అధ్యక్షులు లేచి నిలబడి "ఇంకొక ఉపన్యాసం తరువాత లలితసంగీతమూ—దాని తరువాత మంచి నాటకమూ ఉన్నాయి. నిశ్శబ్దంగా ఉండమని" సభికులను కోరారు. అధ్యక్షులు కుమారి పద్మలత పేరు ప్రకటించగానే మెరుపు తీగెలాంటి అమ్మాయి వేదికమీదికి వచ్చి, మైక్ ముందర నిలబడగానే విద్యార్థినులంతా చప్పట్లు కొట్టారు.

కోకిల కంఠంతో పద్మలత వేదికమీద ఉన్న పెద్దలకు సభికులకు నమస్కరించి ప్రారంభించింది తన ఉపన్యాసాన్ని.

"కుమారి కాంచనలతగారి ప్రసంగం చాలా ఆదర్శవంతంగా ఉంది. ఆదర్శాలు వల్లించుకుంటూ కూర్చుంటే పుణ్యకాలం కాస్తా గడిచిపోతుంది. మన సమాజంలో ఈనాటి స్త్రీ పురుషులను దృష్టిలో ఉంచుకొని మనం ఆలోచించాలి గాని సీతారాముల కాలంనాటి స్త్రీ పురుషులను కాదు వైవాహికజీవితంలో ఇద్దరిదీ చెరి ఒక ఆలోచన–చెరి ఒక పద్ధతి–చెరి ఒక నియమం కాకుండా ఒక్కటిగా ఉండాలన్నారు ఎట్లా ఉంటుంది ? పురుషుడు ఈ నాడు గొంతువరకూ స్త్రీని సంసారంలో దించి తాను తప్పుకు తిరుగుతున్నాడు. భార్యను జీవితభాగస్వామిగా భావించని పెనిమిటిని భార్యమాత్రం భావిస్తుందా ? తన కొరకు తన పిల్లల కొరకు విరామంలేని చాకిరీచేసే భార్యను భర్త బానిసగా భావిస్తున్నాడు గాని మన్నించటంలేదు. భార్య పట్ల ప్రేమ గాని సానుభూతి గాని చూపనివాడు జీవితభాగస్వామి అవుతాడా ? ఫ్యూడల్ వ్యవస్థకు అధిపతి అవుతాడు. వివాహమైన తరువాత స్త్రీ పురుషులు తమ స్వేచ్ఛను కొంత కోల్పోతారని ఉపన్యాసకురాలు

అన్నారు. వాస్తవానికి స్వాతంత్ర్యాన్ని కోల్పోయేది ఒక్క స్త్రీయే. స్త్రీ కోల్పోయిన స్వాతంత్ర్యాన్ని కూడా పురుషుడే అనుభవిస్తున్నాడు. నేడు వివాహిత అయిన స్త్రీ ఆర్థికంగా, సాంఘికంగా, వ్యక్తిగతంగా తన స్వేచ్ఛను కోల్పోయి మరబొమ్మగా బ్రతుకుతోంది. ఒకరికొకరు యజమానులు అని కుమారి కాంచనలతగారు అన్నారు. ఈ మాట నూటికి నూరుపాళ్ళు మిథ్య. స్త్రీకి పురుషుడే యజమానిగా ఉన్నాడు. ఇద్దరి మధ్యా అనురాగమట! ఐకమత్యమట! ఈ పంటను పుష్కలంగా పండించాలట! అందుకు స్త్రీ పురుషుల విద్యా విజ్ఞానాలూ, సంస్కారమూ తోడ్పడాలట! ఈ సూత్రాలు ఒక్క స్త్రీకే ననుకుంటున్నాడు పురుషుడు. ఈ సూత్రాలతో ఈనాటి స్త్రీ ముందంజ వేస్తుందంటారా? ముందంజ మాట ఎట్లా ఉన్నా బ్రతుకుతుందా అని నా సందేహం. ఈనాటి స్త్రీకి కావలసింది ఈ సూత్రాలు కావు. విషమపరిస్థితులను ఎదుర్కొనటానికి తగినధైర్యసాహసాదులు కావాలి. 'నీ పిల్లలూ నీవూ గంగలో దూకండి' అనే భర్తను ఎదుర్కొనే శక్తి సామర్థ్యాలు కావాలి. తను పెడదారి త్రొక్కి స్త్రీని హద్దులలో పెట్టే పురుషుడికి ఎదురొడ్డి నిలిచే శక్తి కావాలి. దౌర్జన్యంతో బ్రతుకుతున్న పురుషుడిని ఢీకొనే శక్తి కావాలి. తనే అదమాధపు బ్రతుకు బ్రతికే స్త్రీ తన సంతానాన్నిగురించీ, వాళ్ళపురోభివృద్ధిని గురించీ ఆలోచించే అవకాశమూ, వ్యవధీ ఆమెకు లేవు. తల్లిదండ్రులు ఆడపిల్లలకు పెళ్ళిళ్లుచేసి పంపించేటప్పుడు ఎటువంటివాడినైనా ఎదుర్కొనటానికి తగిన శిక్షణను ఇవ్వాలి. ఎంత చదువుకున్నా—ఎంతటి గొప్ప ఉద్యోగి అయినా ఇంటికి రాగానే ఆ పురుషుడు తన ధీమానంతా మరిచిపోయేటట్టుగా అదుపుచేయగల శిక్షణ స్త్రీకి కావాలి. సంసారం పట్ల—భార్యా బిడ్డల పట్ల నిజాయితీగా పురుషుడు మెలగగలిగిననాడు తన బాధ్యతలను తు చ. తప్పకుండా స్త్రీ నెరవేరుస్తుంది గాని మరొకవిధంగా జరిగితే మాత్రం స్త్రీ తన శక్తులను దుర్వినియోగం చేసుకోదు."

"కుమారి పద్మలత ఉపన్యాసం చాలా ఆసక్తికరంగా ఉంది. కాని మన కిక్కడ సమయం చాలా తక్కువగా ఉంది. సభికులంతా సంగీతం వినాలనీ, నాటకం చూడాలనీ కుతూహలపడుతున్నారు. కుమారి పద్మలతగారిని నిరుత్సాహపరుస్తున్నా ననుకోకుండా లలితసంగీత కార్యక్రమము ప్రారంభించవలసినదిగా కోరుతున్నాను." అధ్యక్షుడు నిలబడి చెప్పగానే చాలామంది 'అయ్యో!' అనుకున్నారు.

'చాలా బాగా చెబుతోంది. ఆసక్తికరంగా ఉంది వుపన్యాసం. ఆ పాటలు ఎప్పుడైనా వినవచ్చు.'

'కాలానికి తగినట్టు మాట్లాడింది.'

'ఏ లెక్చెరరో రాసిచ్చి వుంటుంది.'

'విద్యార్థినీ లోకానికి ప్రతినిధిగా మాట్లాడింది.'

'నేటి స్త్రీల బాధ్యతలు భుజాన వేసుకుని మాట్లాడింది.'

'పూర్తిగా చెప్పనివ్వ లేదాయన. పాపం ! సగంలోనే ఆపేసింది.'

బిగ్గరగా మాట్లాడుకొనే సభికులను అదుపులో పెట్టటానికి పదినిమిషాలకు పైగా పట్టింది. అంతలో ఒక గాయని విశ్వకవి రవీంద్రుని కవితకు తెలుగు అనువాదం ఒక పాట అందుకుంది. లలితసంగీత కార్యక్రమం ఇరవైనిమిషాల కంటె ఎక్కువ సాగలేదు. సభికులంతా నాటకంకోసం తొందరపడుతున్నారు. విద్యార్థినులు గ్రీన్‌రూంలోకి పరుగులు తీస్తుంటే సభికులలో అలజడి అధికం కావటం మొదలుపెట్టింది. దాని పర్యవసానంగా లలితసంగీత కార్యక్రమం ముగిసింది.

'వరుడి వెల ఎంత ?' నాటిక ప్రారంభమవుతుంది. నిశ్శబ్దంగా ఉండ వలసినదిగా కోరుతున్నానన్న ప్రకటన వేదికనుండి వెలువడ్డది. వేదికమీది నుండి పెద్దలంతా క్రిందికి దిగి ముందున్న సోఫాలమీద కూర్చున్న తరువాత తెరదించారు.

పదినిమిషాల తరువాత—ఓరిమి నశించిన ప్రేక్షకులు చప్పట్లుకొట్టి ఈలలు వేశారు.

"ఓపిక పట్టండి. ఐదు నిమిషాలలో వరుడు రంగంమీదికి వస్తాడు." నేపథ్యంలోనుంచి వినిపించింది.

చివరకు తెర ఎత్తారు.

ఐదారు పూలకుండీలు ఇటూ అటూ పెట్టారు. మధ్యగా ఒక కుర్చీలో ఖరీదయిన బెల్‌బాటమ్ పాంటు ధరించి కాలిమీద కాలువేసుకుని ఒక యువకుడు ఠీవిగా కూర్చుని సిగరెట్ పీలుస్తూ ఇటూ అటూ చూస్తున్నాడు.

మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ గృహయజమాని వచ్చి పక్క కుర్చీలో కూర్చున్నాడు. గొంతు సవరించుకొని కాసేపటికి యువకుడిని ఎగాదిగా చూసి "అబ్బాయీ ! మన భూముల్లో ఏమాత్రం పండుతుంది ?"

కుశలప్రశ్నగా పలకరించాడు వరుడు చెప్పిన జవాబుకు ఒక అంచనా వేసుకుని లోపలికి వెళ్ళాడు.

కంచి పట్టుచీర కట్టుకుని చేమంతులు తలనిండా తురుముకుని ఆ యింటి

యిల్లాలొచ్చి కుర్చీకానుకొని చేరబడి "అన్నదమ్ములూ, అక్క-చెల్లెళ్ళూ ఎంత మంది ?" మర్యాదగా ప్రశ్నించింది.

అతడు చెప్పిన జవాబు విని తలఊపుతూ ఆమె వెళ్ళగానే ఇంటికి పెద్ద కొడుకు 'హలో' అంటూ వచ్చి అతడికంటె ఠీవిగా కుర్చీలో కూర్చుని "ఏమండీ ఈ సూటు కుట్టటానికి టైలరు ఎంత తీసుకున్నాడండీ ?" అడిగాడు తేరిపార జూస్తూ అతడిని.

అతడు చెప్పాడు.

"ఈ సూటుగుడ్డ స్కగుల్డా ?"

"కాదు."

"ఇప్పుడందరూ ఎత్తుబూటే వేసుకుంటున్నారు." అతడు వేసుకున్న షూజ్ ఎలా ఉన్నాయోనని ఒంగి ఒంగి చూశాడు. మనసులో ఏదో ఊహించుకున్న వాడిలా లోపలికి వెళ్ళాడు.

చెంగుచెంగున దూకుతూ ఓ పదిహేనేళ్ళమ్మాయి వచ్చింది రంగంమీదికి. చటుక్కున అతడి దగ్గరకొచ్చి "మీరు పార్టీలు ఇస్తూంటారా స్నేహితులకు ?" అడిగింది.

చెప్పాడు.

"చాకొలెట్లూ అవీ పంచుతుంటారా ఆడపిల్లలకు ? సినిమాలకు తీసుకు వెళ్ళుతూ ఉంటారా ?"

చెప్పాడు.

కిసుక్కున నవ్వి వెళ్లిపోయింది.

మరునిమిషంలో కళ్లు జిగేలుమనేటట్టుగా ఒక యువతి అతడి ఎదుటికి వచ్చి సుతారంగా అటునుంచి ఇటు నాలుగు అడుగులు ఎత్తుమడమల జోళ్లతో నడిచి, తల పంకిస్తూ కుర్చీలో కూర్చుంది.

"హలో ! మీరేనా మురళీకృష్ణగారు ?" ఒక ఆఫీసరు ఇంటర్వ్యూ చేసే టప్పుడు అడిగినట్టుగా అడిగింది.

"అవును" అన్నాడు అతి వినయంగా.

"మీకు ముగ్గురన్నలూ, ఇద్దరు, తమ్ముళ్లూ, ఒక అక్కా- ముగ్గురు చెల్లెళ్లూ ఉన్నారట నిజమేనా ?"

"నిజమే."

"మీకు పుట్టెడు వడ్లు కూడా పండవట నిజమేనా ?"

"ఎంతమాత్రం అబద్ధం కాదు."

"మీరు ఎం. ఏ. పిహెచ్.డి. అన్నారు నిజమేనా ?''

"సరియైన మాటే."

"కాలేజిలో లెక్చరర్‌గా ఉన్నారా ? లేక రీడరా ?''

"ఇంకా రీడర్ని కాలేదు"

"మీ అన్నలు ఉద్యోగాలు చెయ్యటం లేదటకదా !''

"అవును. వాళ్ళకు పెద్దచదువులు లేవు."

"మీ తరువాత పుట్టినవాళ్లకు చదువులూ పెళ్ళిళ్ళూ మీ చేతిమీదుగా జరగాల్సినవేగా ?"

"సహజము."

"మీ జీతానికి మించిన బాధ్యతలు ఉండగా మీ కీ ఖరీదయిన సూటెందుకు?"

"ఇది చాలా చిన్నవిషయం. ఇంతమాత్రం తెలుసుకోలేవనుకోలేదు. నేను కాలేజిలో పనిచేసేవాడిని. ఇంతమాత్రం బట్టలు వేసుకోకపోతే నా స్టేటస్ కు భంగం కాదా ?

"మీరు సినిమాలు బాగా చూస్తారా ?"

"ఈకాలంలో చూడనిదెవరు ?"

"స్నేహితులూ, క్లబ్బులూ ఉన్నాయా ?"

"ఈ ప్రశ్న ఈ కాలంలో వెయ్యకూడనిది."

"మీ పెళ్ళి ఒక చదువుకున్న అమ్మాయితో కావాలని కోరుకుంటున్నారా ?"

"అది చాలా సహజమైన కోరిక."

"ఆమె ఉద్యోగం కూడా చెయ్యాలని కోరిక ఉందా ?"

"చదువుకున్న అమ్మాయిలు ఉద్యోగం చెయ్యాలనుకుంటారు. వాళ్ళ స్వాతంత్ర్యానికి భంగం కలిగించటం ఇష్టంలేదు.

"మీ ధర పాతికవేలని మీ బంధువు వచ్చి చెప్పాడు. మీ స్థితిగతులకు మీ రంత విలువచెయ్యరని నా అభిప్రాయం. నమస్తే."

ఆ యువకుడిని వంటరిగా వదిలేసి ఆ యువతి వెళ్ళిపోతుంది.

షామియానా లేచిపోయేటట్టు చప్పట్లు కొట్టారు సభికులు.

గంగ చంపకం సుస్మిత ఫ్యాన్సీ డ్రెస్ పెరేడ్ చేశారు. వాళ్ళను ఎవరూ పోల్చుకోలేకపోయారు

విద్యార్థినీ బృందంలోనుంచి కార్యదర్శిని కృతజ్ఞలు చెప్పింది.

జాతీయ గీతంతో అంతా లేచి నిలబడ్డారు.

ఆ మరునాడు ఆటల పోటీలలో ప్రథములుగా వచ్చినవారికీ ఈనాటి వక్తృత్వపు పోటీలలో ఉత్తమ ఉపన్యాసకురాలికీ నాటకములో ఉత్తమనటికీ బహుమతి ప్రదానమని ప్రకటించారు.

సభికులు లేస్తూ నాటకం చాలా వ్యంగ్యంగా బాగుందని మెచ్చుకున్నారు. కొందరు అమ్మాయి ప్రశ్నలను ప్రశంసించారు. మరికొందరు 'అమ్మాయి గడుసు పిండం' అన్నారు 'ఇదంతా వరకట్న నిషేధ ప్రచారం' అన్నారు కొందరు.

ఇంటికి వచ్చిన తరువాత భోజనాల సమయంలో "ప్రోగ్రాం ఎట్లా ఉంది నాన్నా ? అమ్మా ! నీకు నచ్చిందా ?" అడిగింది ఇందిర.

"కాలానికి తగినట్టుగా వుంది. ఆడపిల్లలు కూడా తెగించి చెప్పేస్తున్నారు." తల తడుముకుంటూ అన్నాడు లక్ష్మయ్య.

"చదువుకున్న పిల్లలు ఇంకెట్లా మాట్లాడతారు ?" నవ్వింది తల్లి.

"అయితే మీకు నచ్చిందన్నమాటే."

"అంటే అమ్మాయీ ! ఇది ఒక పరిణామ దశ. దానిని బాగా చూపించారు. ఆడపిల్లలు కూడా తమ పరిస్థితులను అవగాహన చేసుకుంటున్నారు."

నాటకంలోని సంభాషణలు తలుచుకొని అందరూ మరొక్కసారి నవ్వుకున్నారు. జయ ముఖం వెలిగిపోతోంది.

* * *

మరునాడు జరిగిన సమావేశంలో అధ్యక్షులు బహుమతులు పంచుతూ కుమారి పద్మలతను, కుమారి కాంచనలతను ప్రశంసించారు తమ తమ అభిప్రాయాలను నిర్మొహమాటంగా వ్యక్తపరచినందుకు అభినందించారు

పెళ్ళికిముందు అనుకున్నట్టుగా స్త్రీ పురుషులు తరువాత ఎందుకు జీవించలేక పోతున్నారో దానికి సరియైన కారణాలు తెలుసుకొని వాటిని నిర్మూలించటానికి యువత పాటుపడాలి. స్త్రీలను పురుషులూ, పురుషులను స్త్రీలూ విమర్శించుకుంటూ బతకటం సంఘ శ్రేయస్సుకు భంగం. ప్రస్తుతం వాతావరణం చాలా కలుషితంగా వుంది. ఈ వాతావరణంలో తల్లిదండ్రులు సంతానానికి మార్గదర్శకంగా వుండలేరు. పోటీలో వక్తలిద్దరూ బాగా ప్రసంగించారు. కనుక ఇద్దరికీ బహుమతులిస్తున్నాను. నాటకం చాలా బాగుంది. వరుడు తన పక్షాన వున్న లోటుబాట్లతో ధైర్యంగా పాతికవేలు కట్నమిచ్చే

కుర్చీలో కూర్చున్నాడు. ఈనాటి వధువు అన్నిటికీ లెక్కలు కట్టే శక్తి మంతురాలు. వరుడు తను మగవాడు కనుక పాతికవేల కట్నం కావాలంటు న్నాడు. అతడు మగవాడయితే ఆమె స్త్రీ కాదా ? స్త్రీ జాతికి విలువ లేదా ? కట్నమిస్తే ఆమెకు విలువ లేనట్లే. కనుక ఈ కాలేజిలో చదువుకునే అమ్మాయి లంతా మీ మీ విలువలు తగ్గించుకుని భర్తలను కొనుక్కోకండి. వధువుగా నటించిన అమ్మాయి ధైర్యానికి ఒక బహుమతి ఇస్తున్నాను. మన కళాశాల ఆటలపోటీలను ఇంకా బాగా ప్రోత్సాహకరంగా నడపాలి. మనకు మంచి క్రీడాకారిణులు తక్కువగా వున్నారు.. మన కాలేజివాళ్లను కూడా తయారు చెయ్యాలి. ఈ సందర్భంలో కాలేజి ప్రిన్సిపల్‌ను, స్టాఫ్‌నూ, విద్యార్థినులనూ అందరినీ ప్రశంసిస్తున్నాను "

బహుమతి ప్రదానం కాగానే అధ్యక్షులు పూలహారాలు చేతిమీద వేసుకుని కారు ఎక్కారు. కారు కదిలేవరకూ ప్రిన్సిపల్ కాలేజి స్టాఫ్ గేటుదగ్గర నిలబడి వెనక్కు తిరిగారు.

ఇందిర తల్లిదండ్రులనూ జయనూ తీసుకొని ఆ చుట్టుప్రక్కల ప్రదేశా లన్నీ చూసి వచ్చింది, వచ్చిన మరునాడు అనంతమ్మ ఇంటికి వెళ్ళాలని గొణగటం మొదలుపెట్టింది.

మొదట ఇందిర వినిపించుకోలేదు. గాని ప్రతిరోజూ అదేమాట వల్లిస్తుంటే "ఏమిటి నాన్నా ! అమ్మ చెవిలో రొద చేస్తోంది. నీకూ తొందరగా ఉందా వెళ్ళాలని ? అసలక్కడ కాపరం ఎందుకు ? ఎత్తివేయండి." కనుబొమ్మలు ముడిచింది.

"అమ్మా ఇందూ !" అన్నాడు బాధగా. "చూడు తల్లీ. నేను లోకసహజ మైన మాట చెబుతున్నాను. వయసుమళ్ళినవాళ్ళు మొదటినుంచీ అలవాటయిన పరిసరాలు - ఇల్లూ వదిలి ఉండలేరమ్మా. మరొకచోట స్వర్గసుఖాలను కల్పించినా అనుభవించలేరమ్మా. ఎంతో బాధగా ఉంటుంది నీవు కన్నకూతురివే కదా ఇది పరాయిచోటు కాదుకదా. అన్నిరకాల సౌఖ్యాలూ కల్పిస్తున్నావు కదా. అయినా ఏమిటో చుట్టాలింటికి వచ్చినట్టుగా ఉంది. ఏదో బెంగగా కూడా ఉంది. అందుకని వెళ్ళాలని ఉంది. సెలవులు ఇచ్చారు కనుక నీవు కూడా పదిరోజులుండి వచ్చేద్దువుగాని, రా" అన్నాడు లక్ష్మయ్య.

ఆ మాటలకు ఇందిర తలవంచుకుంది. తల్లి తనవైపే చూస్తోంది ఏం జవాబు చెబుతుందోనని.

కొంతసేపటికి "సెలవులన్న మాటేగాని నాకు పని ఉంటుంది నాన్నా. అంతగా మీకు వెళ్ళాలని ఉంటే అలాగే బయలుదేరండి."

ఇందిర ఈ మాటన్న తరువాత అనంతమ్మా, లక్ష్మయ్యా దిగాలు పడిపోయి నట్టుగా వారంరోజులు గడిపారు.

కన్నీళ్ళతో రైలెక్కి, చెయ్యి ఊపుతున్న లక్ష్మయ్య చేతిలో చెయ్యేసి "పది రోజులు పోయిన తరువాత నేను వస్తానే నాన్నా! మరీ దిగాలుపడి కూర్చో కండి" అన్నది ఇందిర తడికళ్ళతో.

"అలాగేనమ్మా! నేను ధైర్యంగానే ఉంటాను. కాని మీ అమ్మే మనసు పాడుచేసుకుంటూ ఉంటుంది. సరేలే, ఉండమ్మా రైలు కదులుతోంది."

బరువెక్కిన హృదయంతో ఇందిర ఇంటికి వచ్చింది. ఇల్లంతా చిన్నబోయి నట్టుగా ఉంది. "ఉండమంటే ఉండలేదు" పదిసార్లు గొణుక్కున్నది. భోజనం చేసి పడుకునేటప్పుడు దీర్ఘంగా ఆలోచింపచేసి, మెదడును తినివేయగల పుస్తక మొకటి చదువుతూ రాత్రి పన్నెండుగంటలవరకూ కాలక్షేపము చేసింది.

ఉదయం మామూలువేళకు లేవలేకపోయింది. దేహము భారకించినట్లనిపిం చింది.

"జయా!" కాఫీ తాగుతూ పిలిచింది.

"కాలేజి తెరిచిన తరువాత నీవు చదువుకో. నీ వెంతవరకూ చదువుకోవా లనుకుంటే అంతవరకూ చదువుకో. ఈ చిన్నఉద్యోగంలోనే జీవితమంతా గడపాలనుకోవద్దు." ఎదురుగా నిలబడ్డ జయను కూర్చోమని కుర్చీ చూపించింది.

విస్మయంతో ఇందిర ముఖంలోకి చూసింది జయ. ఆ చూపులో విస్మయమే కాదు - విరక్తి కూడా తొంగిచూపింది.

"ఇంత చిన్నతనంలో నీవు అనాసక్తంగా జీవించటం నా కిష్టంలేదు జయా! కాలేజిలో నీ ఈడుపిల్లలు చూడు ఎట్లా వున్నారో? నీకంటె పెద్దవాళ్ళైన లెక్చరర్లు చూడు ఎంత ఉత్సాహంగా ఉంటారో?"

"భవిష్యత్తు బాగా ఉంటుందన్న ఆశతో వాళ్ళంతా సంతోషంగా ఉండ గలుగుతున్నారు. నా భవిష్యత్తు నాకు తెలుసు కనుక నాకా సంతోషం లేదు." కళ్ళు దించుకునే మాట్లాడింది జయ.

నీ భవిష్యత్తు బాగుపడదనేముంది? నీ జీవితంలోనూ మార్పు రావచ్చు. ఇంతకంటె ఉజ్జ్వలంగా ఉండనూవచ్చు."

వెరద నవ్వొకటి జయ పెదవులమీద కొంతసేపు నిలిచింది.

* * *



అయిపోయింది. తన ఉద్యోగానికి అవసానదశ వచ్చేసింది. లేచి ఆఫీసరు గదివేపు నడిచాడు శ్రీధరం.

ఫ్యాను తలుపుతీసి పట్టుకొన్నాడు శ్రీధరం వెళ్లడానికి. సింహం బోనులో అడుగెడుతున్న మేకలా లోపలికి నడిచాడు శ్రీధరం.

"పిలిచారట సార్..." నెమ్మదిగా అన్నాడు శ్రీధరం

"అవును మిస్టర్ శ్రీధరం ! మీతో మాట్లాడాలని ! అలా నుంచున్నారేం ? కూర్చోండి..."

"ఫరవాలేదండీ..."

"నోనో- ముందు కూర్చోండి..."

కుర్చీలో ఇబ్బందిగా కూర్చున్నాడు శ్రీధరం.

"మీరు మన ఇన్‌స్టిట్యూషన్‌లోనే పని చేస్తున్నారన్న విషయం నాకు నిన్నటి వరకూ తెలీదు. మిమ్మల్ని చూడగానే ఆశ్చర్యపోయాననుకోండి. మధ్యాహ్నం నుంచీ నాకు కాలేజి రోజులే కళ్ళముందు తిరుగుతున్నాయ్. ఎంత త్వరగా మిమ్మల్ని పిలిచి మాట్లాడుదామా అని ఎదురుచూస్తున్నాను. ఇప్పటివరకూ

చార్జి తీసుకోవడంతో తీరిక దొరికింది కాదు. అయిందయిపోతే మళ్ళీ మీరు ఇంటికి వెళ్ళిపోతారేమోనని ... అలా ఇబ్బంది ఫీలవకండి- ఫ్రీగా ఉండండి. మనం కాలేజిలో ఉన్నప్పుడు మీరెలా ఉండేవారో గుర్తులేదూ ? మిమ్మల్ని అలా చూడ్డమే నాకిష్టం..."

శ్రీధరం ముఖం పాలిపోయింది. తనని ఇన్సల్ట్ చేస్తున్నాడు. దమ్ముంటే కాలేజిలోలా ఇప్పుడు ప్రవర్తించమని ఛాలెంజ్ చేస్తున్నాడు. ఉద్యోగంలోనుంచి తనని తీసేయడం ఖాయం ! అంటే ఎలాగూ ఉద్యోగం పోతుంది. మరిక తనెందుకు అధైర్యపడాలి ? ఎందుకు ఇతగాడికి తలఒగ్గి ఉండాలి ? అప్పటిలానే ఇప్పుడూ ఎందుకు ప్రవర్తించకూడదు ? ఆత్మాభిమానం ఎందుకు చంపుకోవాలి ? ఉద్యోగం పోయినా, కనీసం తన వ్యక్తిత్వాన్ని చంపుకోలేదన్న ఆనందమయినా ఉంటుంది. శ్రీధరం పదేళ్లు వెనక్కు వెళ్ళాడు. ఎప్పుడూ పదిమంది తన వెంబడి తిరిగిన ఆ 'కాలేజి హీరో' జీవితం అతని కళ్లముందు కొచ్చి నిలబడింది. ప్రతిరోజూ వెయిట్ లిఫ్టింగ్ ప్రాక్టీస్ చేయడంవల్ల ఆకర్షణీయంగా కండలు తిరిగిన శరీరం. ఎత్తూ, ఎత్తుకు తగ్గ పొడవూ, ఇవన్నీ తన రూపాన్ని మరింత ఆకర్షవంతంగా చేసేసినయ్. వీటికితోడు తన వ్యక్తిత్వం. అనేక సందర్భాలలో దెబ్బలాటల్లో జోక్యం చేసుకొని- వాటిని పరిష్కరించడం- ఇవన్నీ తనని మరింత ముఖ్యమయిన వ్యక్తిగా తయారుచేసినయి. ఆడపిల్లలు మరే కుర్రాడితోనూ మాట్లాడేవారుకాదు. కానీ తనతో మాట్లాడ్డానికి ఉవ్విళ్ళూరే వారు. జూనియర్ కుర్రాళ్ళు సరేసరి. చాలామంది ఎప్పుడూ తనని 'డిన్నర్' లకో, 'టీ'లకో, 'సినిమా'లకో పిలుస్తుండేవారు

శ్రీధరం కుర్చీలో సర్దుకూర్చున్నాడు. అపును ఆరోజుల్లో తను వెలిగిపోయాడు. తన సాహచర్యం కోసం ఎంతోమంది తహతహలాడిన హీరో ఆ రోజుల్లో తను. తనలోని ఆ వ్యక్తిత్వాన్ని, ఆ ధీమాని, ఆ అభిమానాన్ని ఆ నిర్లక్ష్యాన్ని ఇప్పుడు చంపేసుకుంటాడా ! నో...నెవర్ !

రమణమూర్తి ఏమయినా అవాకులు చెవాకులూ వాగితే తానిప్పుడు ఊరుకోడు, గట్టిగా బుద్ధిచెప్తాడు. ఇంకా ఒళ్లుమండితే అతను 'డిస్మిస్' అనకముందే తను 'రిజైన్' అనేస్తాడు. అంతే !

"నిజం చెప్పాలంటే మనం కాలేజి జీవితం వదిలాక మీరు మళ్ళీ కలుస్తారేమోనని చాలాకాలం ఎదురుచూశాను. కాని మీ జాడే తెలిలేదు. ఇన్నాళ్లకు మీరు కనబడటం- అదీ మనిద్దరం ఒకే ఆఫీసులో ఉండటం నాకు అమితమయిన ఆనందాన్నిస్తోంది శ్రీధరంగారూ ! ఆ రోజుల్లో మీ పరిచయంకోసం తహతహలాడినవాళ్లల్లో నేనూ ఒకడిని. కానీ నా దురదృష్టం మూలాన మన పరిచయం నేను కోరుకోని విధంగా జరిగిందనుకోండి ! అది వేరే విషయం. మీరు

మాత్రం ఇకనుంచి నాకు ఓ మాంచి స్నేహితులవాలి నేను ఆఫీసరు- మీరు గుమస్తా అన్న ఫీలింగ్ వదిలేయండి అదంతా ఈ నాలగ్గోడల మధ్య అదృష్ట వశాత్తూ మనకి ఈనాలగ్గోడల మధ్యకంటె బయట గడిపే సమయమే చాలా ఎక్కువ ది రోజూ మనిద్దరం కలిసి మీ ఇంట్లోనయినా, మా ఇంట్లోనయినా సరే రెండు మూడు గంటలు సరదాగా కాల క్షేపం చేయాలి. ఏమంటారు ? మీకే మయినా అభ్యంతరమా ?"

శ్రీధరం ఉక్కిరిబిక్కిరి అవుతు న్నాడు ? ఏమిటిది ? రమణమూర్తి ఇలా మాట్లాడుతున్నా డేమిటి ? తనమీద అతనికి కోపం. ప్రతీకారభావం—ఇవేమీ లేవా? ఈ ఆపేక్ష, ఈ ఆప్యాయత ఎలా ప్రవేశించినయ్ వాటి స్థానంలో ?

"శ్రీధరంగారూ? ఏమీ మాట్లాడరేం? నేనంటే మీలో ఏమీ అయిష్టం పేరుకుపోలేదుకదా ?" నవ్వుతూనే అడిగాడు రమణమూర్తి.

"అబ్బే అలాంటిదేం లేదు... ఆ మాటకొస్తే మీకే నేనంటే అయిష్టత ఉండాలి... ఎందుకంటే... ఆ రోజు తొందరపడి మీ మీద చెయిచేసు కున్నాను..." సిగ్గుపడుతూ అన్నాడు శ్రీధరం

"అంత మాటనకండి ! అందులో మీరు తొందరపడిందేమీలేదు. ఆ రోజు మీరు చేసినపని సరయినదే ! తర్వాత నా స్నేహితుడు మరొకతనికి కలిగిన అనుభవంద్వారా తెలుసుకున్నాను. అతనూ నాలాగే బజారు రౌడీలను ఏర్పాటుచేసి తనతో కొట్లాడిన ఓ కుర్రాడిని చావబాదించాడు తరువాత అదే కుర్రాడు ఆ రౌడీలకు బోలెడు డబ్బిస్తే వాళ్ళు వచ్చి నా స్నేహితుడినే చితకతన్నారు. అప్పుడు తెలిసింది నాకు మీ మాటల్లోని నిజం ! ఆ రోజునుంచే మీరంటే విపరీతమయిన అభిమానం ఏర్పడిపోయింది. అప్పుడే మీతో మాట్లాడాలనీ, మీ స్నేహం చేసుకో వాలనీ అనుకొన్నానుగానీ సిగ్గుపడ్డాను. అంతే ! అంతకంటె వేరే కారణ మేమీ లేదు లేకపోతే ఏనాడో మనం మంచి స్నేహితులమయి ఉండేవాళ్ళం..."

శ్రీధరానికి ఒక్కసారిగా రమణ మూర్తిమీద అభిమానం ముంచుకొచ్చింది. ఆప్యాయంగా అతన్తో కరచలనం చేయా లనిపించింది

"రమణమూర్తిగారూ ! మీ మనసు చాలా గొప్పది. అందుకే నాలాంటివాడితో 'స్నేహం' కావాలంటున్నారు. అంత కంటె నాకు మాత్రం అదృష్టం ఏముం టుంది ! మీరెలా చెప్తే అలా చేస్తాను. కేవలం మీరు నా ఆఫీసరు అవటం మూలాన నేనిలా మాట్లాడటంలేదు. నాకన్నా గొప్ప మనసున్న మనుషులు మీరు ! అందుకే పడిపోయాను..."

ఆ సాయంత్రం ఇంటికి వస్తూనే "నా కాలేజ్ మేట్, మిష్టర్ రమణమూర్తి" అంటూ పరిచయం చేస్తున్న భర్తని అయోమయంగా చూసింది సుభద్ర.

---




ఆప్యాయంగా శాంత వీపు తట్టుతూ "వూరుకో శాంతా ! ఏదీ మధును చూద్దాం పద" అంటూ మధు వున్న గదిలోకి వెళ్ళిన చంద్రం యింకా అలాగే ఆకాశంవైపు చూస్తూ కూర్చున్న మధుని చూస్తే బాధతో మనసు మెలికలు తిరిగింది. మధు జీవితంలో తిన్నదెబ్బలు సామాన్యమైనవి కావు. అంత చిన్న వయసులోనే ఒక జీవితకాలానికి సరిపడ్డ కష్టాల్ని కళ్ళజూసింది. ఆమెకు అత్యంత ఆత్మీయులైన వ్యక్తులు ఒక్కొక్కరే మధు జీవితంనుంచి నిష్క్రమించారు. ఆ షాకును తట్టుకోడం సామాన్యులకు సాధ్యంకాదు. ఆ అమాయకురాలి మనసున రగిలిన బాధాగ్నిని అర్థంచేసుకోలేని ప్రజావాహిని వాళ్ళ కిష్టమొచ్చినట్లు వూహించుకొని ఏవేవో మాట లంటున్నారు.

దగ్గరగా వెళ్ళి "మధూ !" అని పిలిచాడు చంద్రం. మనసులోని ఆప్యాయతంతా ధ్వనించిందా కంఠంలో. ఓసారి చంద్రంవైపు వెర్రిగా చూసి, మళ్ళీ నిశబ్ద నిశీధిలోకి దృష్టి సారించింది. తలమీద చెయివేసి "మధూ ! కొంచెంసేపు పడుకోమ్మా !" అన్నాడు చంద్రం ఆర్ద్రంగా.

మధులో మార్పేమీ లేదు. ఆ మౌన మూర్తిని ఎక్కువసేపు చూడలేకపోతున్నాడు చంద్రం. ప్రక్కనే నిలబడ్డ శాంతను "ఓ గ్లాసు పాలు తీసుకు రామ్మా !" అని పంపించాడు. అయిదు నిముషాలు మౌనంగా గడిచిపోయాయి.

కాంత పాలు తీసుకొచ్చింది. గ్లాసందు కొని మంచంమీద మధు ప్రక్కనే కూర్చొని "మధూ! కొంచెం పాలు త్రాగి నిద్రపోమ్మా. రేపటికి హాయిగా వుంటుంది." అంటూ బుజ్జగింపుగా మధు చేయి చేతుల్లోకి తీసుకొని గ్లాసం దించబోయాడు. అప్పటికీ ఆ వెర్రి చూపులో మార్పులేదు చంద్రానికి ప్రతిమలా కూర్చున్న మధుచేత ఆ పాలు త్రాగించడం దుస్సాధ్య మనిపించింది. గ్లాసు తిరిగి కాంత చేతికిచ్చి, మధును నెమ్మదిగా రెండు భుజాలు పట్టుకొని మంచంమీద పడుకోబెట్టాడు. ప్రతిఘటించలేదు. కిటికిలో నుంచీ అలాగే శూన్యంలోకి చూస్తూ పడుకుంది.

ఇంతలో శ్యాం వచ్చాడు అక్క దగ్గరకు. వాడిని చూసి మధులో చలనం లేదు. అక్క మౌనంచూసి వాడికి భయంగా వుంది. "బావా! అక్కయ్య మాట్లాడదేంటి?" అంటూ చంద్రంవైపు చూశాడు ఏడుపుముఖంతో. అంత వరకూ అణగద్రొక్కుకున్న బాధంతా ఒక్కసారి పెల్లుబికింది చంద్రంలో. వాడిని దగ్గరకు లాక్కొని వాడిని వోదార్చే ప్రయత్నంలో, తనూ కన్నీరు కారుస్తూ వాడి ద్వారా కొంత సాంత్వన పొందాడు! దుప్పటి తీసి మధు మెడ వరకు కప్పి తలుపులు దగ్గరగావేసి శ్యాంని తీసుకొని హాల్లోకి నడిచాడు. పిన్ని పోయిన బాధకంటే మధు ప్రవర్తన మధు మౌనంగా చూసే ఆ మూగ చూపులు మరీ బాధపెడుతున్నాయి చంద్రాన్ని.

రెండోరోజు సాయంత్రానికి శ్రీధర్ గారు వచ్చారు కలకత్తా నుంచి. రావడం రావడం సరాసరి గోపాలంగారింటికే వచ్చారు. "మధు ఎంత బాధపడుతుందో? ఈ విశాల ప్రపంచంలో తనకు తమ్ముడు తమ్ముడికి తను తప్ప మరెవ్వరూ లేరని బాధపడుతుండవచ్చు పిచ్చిపిల్ల." అని మాధవిని గురించిన ఆలోచనలతోనే బాధపడుతూ వచ్చారు శ్రీధర్‌గారు.

చావిట్లో దిగులుగా కూర్చున్న చంద్రాన్నిచూసి ఎలాజరిగింది చంద్రం? యింత హఠాత్తుగా మీ పిన్నిగారు..." అంటుండగానే ప్రక్కనే వున్న శేఖర్ జరిగింది వివరించాడు.

"జరిగినదానికంటే ఎక్కువ మధు పరిస్థితి చూస్తే మరీ భయంగా బాధగా వుంది అంకుల్! వాళ్ళ అత్తయ్య పోయారని విన్నాక మధు ఒక్క కన్నీటి బొట్టుకూడా కార్చలేదు. ఇంతవరకు పచ్చి మంచినీళ్ళు కూడా ముట్టుకోలేదు. డాక్టర్ నడిగితే షాక్ తిని వుంటుంది. క్రమంగా, తనే కోలుకుంటుంది లెమ్మంటున్నారు. ఆ గదిలో పడుకొని అలా శూన్యంలోకి చూస్తోంది. మాకందరికీ బాధగా వుంది. అంకుల్ మీరైనా మాట్లాడించండి మధుచేత. మేమెవ్వరం వెళ్ళి పలకరించినా ప్రయోజనం కన్పిం

చడంలేదు. ఏదో పిచ్చిగా చూస్తోంది. ప్లీజ్ అంకుల్ మధుని మాట్లాడించండి. మేమెవ్వరం వెళ్ళినా ప్రయోజనంలేదు." అంటూ ఆవేశంగా, ఆత్రంగా శ్రీధర్ గార్ని లోపలికి తీసుకెళుతున్న శేఖర్‌ను విచిత్రంగా చూశారు శ్రీధర్.

మాధవి పట్లగల అభిమానాన్నీ ఆపేక్షనూ యిన్నాళ్ళూ ఆనకట్టలువేసి ఆపి వుంచాడు శేఖర్. ఈ రెండు రోజుల్లో మూర్తీభవించిన మౌనంలా జీవంలేని చూపులతోవున్న మధును చూస్తూ తట్టుకోలేకపోతున్నాడు. ఈ క్షణంలో ఆత్మీయుడైన మరోవ్యక్తి కనిపించేసరికి అతనివల్లనైనా మధు మామూలు మనిషవుతుందేమోననే ఆశతో కట్టలు తెంచుకొని ప్రవహించే నదీ ప్రవాహంలా యిన్నాళ్ళూ అంతర్గతంగా దాచుకున్న ఆవేదన కన్నీళ్ళ రూపంలో బయటపడింది. మధు అంటే అందరికీ అభిమానముంది. శేఖర్‌ను అంతగా కదిలించడం చూసే, చంద్రం కూడా ఆశ్చర్యపడుతూ, వాళ్ళ ననుసరించి మధు వున్న గదిలో కెళ్ళాడు.

అంతమంది లోపలికెళ్ళిన అలికిడికి కూడా తిరిగి చూడలేదు మధు. పందిరి మంచంమీద పట్టెనానుకొని కూర్చొని అలా దూరంగా అక్కడ ఏంచూస్తుందో ఎవరికీ అర్థంకాలేదు. చంద్రం పిల్చాడు "మధూ! ఎవరొచ్చారో చూడు," అంటూ. శ్రీధర్‌గారు మధు ముందుకు వెళ్ళి నిలబడ్డారు. ఓసారి గాజు కళ్ళలావున్న కళ్ళను కదిల్చి చూసింది. మళ్ళీ మామూలుగా దృష్టి బయటకు సారించింది. శేఖర్‌కు మధునలా చూడటం దుస్సాధ్యంగా వుంది. మరో రెండురోజులు మధు అలాగేవుంటే మధుకంటే ముందు తనకు మతిభ్రమిస్తుందేమోననే భయంవేసింది. సంకోచాల్నీ, సందేహాల్నీ ప్రక్కకుతోసి ముందుకొచ్చి మధు రెండు భుజాలపై చేతులువేసి-

"మధూ! మాట్లాడు మధూ! మీ మావయ్య వచ్చారు చూడు. నువ్వు మాట్లాడకపోతే ఏమనుకుంటారు?" అంటూ భుజాలు కుదుపుతూ అడిగాడు. ఓ క్షణం ఆ కళ్ళలోకి తళుకులాంటి కాంతి వచ్చింది. అంతమాత్రానికే పరమానంద భరితుడయ్యాడు శేఖర్. చేతులు తీసేసి, "చూడు మధూ! పలకరించు. ఆయన నిలబడే ఉన్నారు. కూర్చోమని చెప్పు" అన్నాడు మళ్ళీ ఓసారి అందరివైపు దృష్టి సారించి కిటికీవైపు చూపులు త్రిప్పుకుంటున్న మధును చూసి శ్రీధర్‌గారి హృదయం బాధతో విలవిల్లాడింది.

మంచంమీద కూర్చొని రెండు చేతుల్లోకి మధు ముఖాన్ని తీసుకొని తడబడుతున్న గొంతుతో "ఏవిటమ్మా ఆ చూపు? మాట్లాడమ్మా. రేపు శిరీష్, సుషమ వస్తామన్నారు. నువ్వూ, శ్యాం

మాతో వచ్చేద్దురుగాని" మధు ముఖ భావాల్లో ఏ మార్పూలేదు.

"మాధూ! మాట్లాడమ్మా! మాధూ!" శ్రీధర్‌గారి గొంతు పూడుకుపోయింది. "నాన్నా" శ్రీధర్ చేతుల్లోకి ఒరిగిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది మధు. గుండె లవిసేలా ఏడుస్తోంది మధు. చూసే వాళ్ళ హృదయాలు ద్రవించిపోయేలా ఏడుస్తోంది. రెండు రోజుల్నుంచీ కన్నీటిచుక్క రాని ఆ కళ్ళనుంచి ముత్యాల సరాలుగా తెగిపడుతున్న కన్నీటిని చూసి అందరికీ ఓ రకమైన సంతోషం కలిగింది. "మధు మళ్ళీ మనుషుల్లో పడింది ఆ తృప్తి చాలు" అనుకుంటూ ఆనందంగా కళ్ళు తుడుచుకుంటున్న శేఖర్ వైపు చూసిన చంద్రానికి ఏదో అర్థమైపోయినట్లైంది.

అక్క ఏడ్పు వినిపించి శ్యాం పరుగెత్తుకుంటూ వచ్చాడు. వాడిని గుండెల కదుముకున్నాడు శ్రీధర్. నెమ్మదిగా మధుని లేపి ముఖం కడిగించి శాంత తెచ్చిన వేడిపాలు స్వయంగా తనే త్రాగించారు శ్రీధర్. శ్రీరాం కూతుర్ని అలా లాలిస్తుంటే మనసు అదో రకమైన తృప్తితో నిండిపోయింది. యిన్నాళ్ళకి రాం రుణం యిలానైనా తీర్చుకోగలుగుతున్నాననే ఆనందం కలిగింది. ఆయన పాలు చేతబట్టుకొని త్రాగిస్తుంటే కళ్ళనిండుగా నీళ్ళు నింపుకొనే గుటకలు వేసింది. "రాం ! నిన్ను దూరం చేసుకున్నా నీ బిడ్డల్ని చేరువ చేసుకునే అదృష్టాన్ని కలిగించావు" అనుకుంటూ కనిపించని స్నేహితుడిని తలుచుకొని కన్నీరు కార్చారు శ్రీధర్.

ప్రేక్షకుల్లా నిలబడి చూస్తున్న చంద్రానికీ, శేఖర్‌కూ ఆశ్చర్యంగా వుంది యీ అద్భుతమేమిటా అని మధు ఆయన్ని 'నాన్నా' అని ఎందుకు పిలిచిందో అంతకంటే అర్థంకాలేదు.

శ్రీధర్‌గారు ఆ తర్వాత విషయం వివరించేవరకూ ఎవరికీ ఆయన పిలిస్తే పలకడంలోగల అసలు రహస్యం బోధపడలేదు. తన తండ్రిలా 'మాధూ' అని పిలిచేసరికి మరుగునపడుతున్న స్మృతులు ఒక్కసారిగా జ్ఞాపకంవచ్చి, శ్రీధర్‌గారిని చుట్టేసి హృదయ విదారకంగా ఏడ్చింది మధు. దానితోనే బాహ్యస్మృతి వచ్చింది. జరిగినవన్నీ జ్ఞాపకం వచ్చాయి. నిలబడి తనవైపు ఆప్యాయంగా చూస్తున్న చంద్రాన్ని, అనురాగాన్నంతా కళ్ళలో నింపుకొని ఆరాధనగా చూస్తున్న శేఖర్‌నూ చూసి నెమ్మదిగా "నిలబడే వున్నారేం, కూర్చోండి బావా ?" అంది మధు యిద్దరినీ వుద్దేశించి. ఇద్దరూ ఒకళ్ళు మోడా, మరొకరు కుర్చీ లాక్కొని మంచం దగ్గిరగా కూర్చున్నారు. శ్రీధర్‌గారి ప్రక్కనే నుంచుని బిక్కు బిక్కు మంటున్నట్లు కొత్తగా చూస్తున్న

శ్యాంని దగ్గరకు తీసుకుంది మధు. వెక్కి వెక్కి ఏడుస్తున్న వాడి తల మీద కన్నీళ్ళతో అభిషేకం చేస్తూ, వాడిని మరింత దగ్గరకు తీసుకొని కుమిలిపోతున్న మధుని చూసి అందరి కళ్ళూ చమర్చాయి.

రెండు రోజులుండి, శలవులేదనీ మళ్ళీ పదిరోజుల తర్వాత వస్తానని చెప్పి బయలుదేరారు శ్రీధర్‌గారు. ఈ రెండురోజుల్లో పూర్తిగా కోలుకోపోయినా శ్రీధర్‌గారి ఆత్మీయతతో, చంద్రం శాంతల ఆప్యాయతలతో. భాషకందని భావాలతో నిశ్శబ్దంగా శేఖరందించే అనురాగపు చూపులతో, చాలావరకూ మామూలుగా తయారయినా, నీరసంమీద విపరీతంగా ఏడుస్తుండటంవల్ల, తిండి సరిగ్గా తినకపోవడంవల్ల మధులో చాలా మార్పు వచ్చింది. అప్పుడప్పుడు జ్వరం తగులుతోంది. రోజులో కొంతసేపు జ్వరం వుంటుంది. మరికొంత సేపటికి నార్మల్‌గా వుంటోంది. పీటితో నీరసంగా వుంటోంది.

భవిష్యత్ ఏమిటనే విషయం ఎవరూ ప్రస్తావించలేదు మధు దగ్గర. వెళ్ళే ముందు చంద్రంతో చెప్పారు శ్రీధర్.

"చంద్రం! ఇప్పట్లో మధు యీ పరిసరాలకు ఎంత దూరంగా వుంటే అంత మంచిది. పదిహేను రోజులు కాగానే నేను వచ్చి మధును, శ్యాంనూ, కలకత్తా తీసుకెళతాను. శ్యాంని స్కూల్లో చేర్పిస్తాను అక్కడే. మధు కిష్టమైతే తనూ కొంతకాలం చదువుకుంటుంది. సుషమతోపాటే పెళ్ళి చేసుకొని నాకోడలి అధికారంతో అక్కడే వుంటుంది. ఏమంటావు? రాం స్నేహితుగా యిది నా కర్తవ్యంగా, నా బాధ్యతగా భావిస్తున్నాను. సుషమ గంగాపూర్ వస్తుంది. మధు కలకత్తా వస్తుంది. ది స్టేట్ ఛేంజ్. ఓ కూతురి స్థానాన్ని మరో కూతురు వస్తుంది. ఏమంటావ్ చంద్రం? ఏవోయ్ శేఖర్ ఎలా వుందంటావ్ నా ఆలోచన?"

అంటున్న శ్రీధర్‌గారికి శేఖర్ ఏం సమాధానం చెప్పాలో నిర్ణయించుకునే లోపలే, చంద్రం అందుకున్నాడు.

"మావయ్యగారూ! నేను మీకు వ్యతిరేకంగా ఆలోచిస్తున్నా ననుకోకపోతే ఒక్క మాట. మధును, శిరీష్‌ను పెళ్ళి చేసుకొనే విషయమై అడిగి చూశాను. అసలు తను పెళ్ళికి సుముఖంగా లేదు. అప్పట్లో పిన్ని బాధ్యత శ్యాం బాధ్యత, దృష్టిలో వుంచుకొని కూడా అలా అని వుండవచ్చు. ఏమైనా మళ్ళీ యీ విషయాలు మాట్లాడాలంటే కొంత టైమ్ కావాలి. పిన్ని పోయిన షాకు నుంచి యింకా పూర్తిగా తేరుకోలేదు మధు. ఇంకో రెండు మూడు నెలల వరకు మధుకు భవిష్యత్‌ను గురించిన ఆలోచనలు కలగకుండా చేయడం మన

విధి. మళ్ళీ కలకత్తా వెళ్ళినా అక్కడి విషాద స్మృతులు మధును బాధించ వచ్చు. తన ఆరోగ్యంమీద మరీ దెబ్బ తీయవచ్చు. అందువల్ల యిప్పట్లో మధుకు ఆ ఆలోచన కలగకుండా యిక్కడే వుంచేస్తే కొన్నాళ్ళకు అన్నీ మర్చిపోయే అవకాశముంది. అప్పుడు మధు యిష్టప్రకారం చెయ్యవచ్చు.

మీరు మరోలా అనుకోనంటే... కొన్నాళ్ళపాటు మా పెళ్ళి కూడా వాయిదా వేయాలని నా కోరిక. మధు యిలా ఉండగా నాకు పెళ్ళి చేసుకోవా లనిపించడంలేదు. అంతక్రితం ఎవరి కెవరమో తెలీకపోయినా ఈ అయి దేళ్ళలో మధు మా కందరికి ఎంతో సన్నిహితురాలైంది. బాంధవ్యం బావని చేసినా నేను మధునెప్పుడూ మా శాంత లాగే అభిమానించాను. ఒక చెల్లెలి పెళ్ళి చేసి, మరో చెల్లెలికి పెళ్ళి కాకుం డానే గృహస్థునయ్యేంత స్వార్థపరుణ్ణి కాలేను. మావయ్యగారూ! పిన్నీ బాబాయి ఎవరున్నా నాకింత బాధ్యత తీసుకోవలసిన అవసరంలేదు. కానీ యిప్పుడు తప్పదు......నన్ను క్షమిం చండి. సుషమతో కూడా చెప్పండి నన్ను క్షమించమన్నా నని. ఎన్నాళ్ళైనా, ఎన్నేళ్ళైనా మధు పెళ్ళి తర్వాతే నా పెళ్ళి. నా కోసం సుషమని ఆగమని చెప్పటం నా స్వార్థమే అవుతుంది. ఆమె అలా ఆగగల్గితే అది నా అదృష్టంగా భావిస్తాను" అంటున్న చంద్రం గొంతు అణచిపెట్టుకుంటున్న బాధతో విచిత్రంగా ధ్వనించింది.

శేఖర్ తృప్తిగా ఆనందంగా చూసాడు చంద్రంవైపు. శ్రీధర్‌గారు ప్రశంసాపూర్వకంగా చంద్రం వీపు తడుతూ "అలాగే చంద్రం! నీ యిష్ట ప్రకారమే కానివ్వు. యిప్పట్లో మధుతో ఆ విషయా లేమీ చెప్పను. పదిరోజు లకు నేను రావడానికి వీలుకాకపోతే శిరీష్‌నూ, సుషమనూ పంపిస్తాను. వస్తే ముగ్గురం వస్తాం మరి వెళ్ళొస్తాను శేఖర్" అంటూ ముందుకు నడచిన శ్రీధర్ గారిని అనుసరించి చంద్రం శేఖర్‌లు ఆయన్ని బస్సెక్కించి వచ్చేశారు.

* * *

"మనసులోని ద్వేషాన్ని మరుగు పర్చడం ఎలా కష్టమో మనస్సులోని మమతల్ని మరల్చడం కూడా అంతే కష్టం." మధు ఆలోచనల నుంచి మనసును మరల్చుకోవాలనుకునే శేఖర్ ప్రయత్నం, ప్రయత్నంగానే వుండి పోయింది. రోజు కొక్కసారైనా వెళ్ళి మధును చూసి పలకరించిరాందే మనసుకు శాంతి కలగటంలేదు.

ఈ వారం రోజుల్లో శేఖర్ మనసే మిటో పూర్తిగా అర్థమైంది చంద్రానికి. ముఖ్యంగా శ్రీధర్‌గారు వచ్చిన రోజు జరిగిన సంఘటనతో కొంత అర్థమైనా,

మధుమీద యింతటి ఆరాధన, ప్రేమ పెంచుకున్నా డనుకోలేదు. అయినా శేఖరెక్కడ ? మధు ఎక్కడ ? తను ఎలా వూహించగలుగుతున్నాడు ? ఈ బంధం శాశ్వత మయ్యేదేనా ? రావు బహద్దూర్ రఘుపతిరావుగారి ఏకైక పుత్రుడు శేఖర్. అంతటి ఆస్తికి ఏకైక వారసుడు. మధు...తల్లీ దండ్రీ ఆఖరికి ఆదరించిన ఆత్మీయుల్ని కూడా పోగొట్టుకున్న దురదృష్టవంతురాలు, అనాధ. ఈ పెళ్ళికి రఘుపతిరావు గారి నొప్పించడం ఎవరికీ సాధ్యం కాదు. ఆ విషయం శేఖర్‌కు తెలీదా ? తెలిసీ యింతగా అభిమానాన్ని పెంచు కుంటున్నాడెందుకు మధు మీద ? మధు కూడా శేఖర్ మీద అదే అనురాగం వుందా ? ఏమో ?? అది చంద్రం వూహ కందటంలేదు. ఒకవేళ మధూ, శేఖర్ ల మధ్య అనురాగం వాళ్ళు పరిచయమైన తొలి క్షణం నుంచీ వుందేమో ! తనే గ్రహించలేదేమో ! ! ఆలోచనలతో చంద్రం బుర్ర వేడెక్కి పోతుండగానే శేఖర్ వచ్చాడు.

నెమ్మదిగా లేచి శేఖర్‌ను అనుసరిం చాడు చంద్రం. యిద్దరి మధ్యా మౌనం రాజ్యం చేస్తోంది. ఆఖరికి మౌనాన్ని ఛేదిస్తూ శేఖర్ మాట్లాడాడు.

"చందూ ! రేపే కదూ పెద్ద కర్మ ? శ్రీధర్ అంకుల్ ఏమైనా లెటర్ వ్రాశారా ? వస్తున్నారా ?" తలెత్తి శేఖర్‌వైపు చూసిన చంద్రానికి శేఖర్‌లో చాలా మార్పు కనిపించింది. మొట్ట మొదటిసారిగా డిగ్రీ పూర్తిచేసుకొని వురకలువేసే వుత్సాహంతో జలపాతంలా గంగాపూర్‌లో దూకిన శేఖర్‌కూ... నిరాశా, నిస్పృహలతో ఏదో పోగొట్టు కున్నట్లు దీనంగా వున్న ముఖం పొలాల వెంట అతిగా తిరగడంతో తెల్లటి శరీరం, రంగు మారి, గోధుమ వర్ణానికి తిరిగింది. అలసట అణువణువునా జీర్ణించుకున్నట్లున్న శేఖర్‌ను చూస్తుంటే చంద్రం మనస్సు జాలితో నిండిపోయింది.

నెమ్మదిగా శేఖర్ చుట్టూ చేయివేసి, "అవును శేఖర్ రేపే పెద్ద కర్మ. శ్రీధర్‌గారు రావడం లేదుట. ఆఫీసులో ఏదో యిన్స్పెక్షను వుందట శిరీష్, సుషమ వస్తున్నారని వ్రాశారు బహుశా రేపు తెల్లవా రీపాటికి వస్తారేమో !" అని ఓ క్షణం ఆగి, "శేఖర్ ఒక టడుగుతాను నిజం చెప్పు. ఇన్నాళ్ళ స్నేహంలో నువ్వు నా దగ్గర దాచిం దేదీ లేదు. నీ మనసులోని బాధేవిటిరా?" అంటూ శేఖర్‌ను తనవైపు తిప్పుకొని నిలదీస్తున్నట్లడుగుతున్న చంద్రం కళ్లలో ప్రతిఫలించిన ఆపేక్షకు శేఖర్ మనస్సు చలించింది.

"చెబుతానురా చందూ ! నీకు గాక నా బాధ మరెవరికి చెప్పుకోను ?" అంటూ అంత కాలంగా తన మనస్సును

మధస్తున్న విషయం, తన అంతరంగాన ప్రేమతరంగాలు సృష్టించి, తన హృదయ స్పందనగా మారిన మధును తను మర్చిపోలేక పడుతున్న బాధ, అన్నీ వివరంగా చంద్రంతో చెప్పేసి బరువు దించుకున్నట్లు ఫీలయ్యాడు శేఖర్. ఎన్నాళ్ళని బాధను మనసున దాచి భరించగలడు ? ఆత్మీయుడైన చంద్రం ముందు తన హృదయఘోష విన్పించిన తర్వాత కొంత మనశ్శాంతి కలిగినట్లైంది. మౌనంగా శేఖర్ చెప్తున్న మాట లింటూ అతని మథనను అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తూ గంగానదీ తరంగాల్లోకి దృష్టి సారించి ఆలోచిస్తున్న చంద్రం తొడపై తల పెట్టుకొని యిసుకలో వెల్లకిలా పడుకుని నీలిమాకాశంవైపు చూస్తూ రిలీఫ్‌గా ఫీలవుతున్నాడు శేఖర్. చాలా రోజుల తర్వాత మనసుకు, శరీరానికి కొంత విశ్రాంతి లభించి నట్లైంది.

"శేఖర్ ! నువ్వు మధును పెళ్ళి చేసుకుంటే ... హృదయపూర్వకంగా ఆశీర్వదించి, ఆనందించే మొట్టమొదటి వ్యక్తిని నేనే. మొన్న శ్రీధర్‌గారితో నేను చెప్పిన మాటకూడా విన్నావు. అయితే నాన్నగారిని యీ పెళ్ళికి ఒప్పించడం మన మనుకున్నంత తేలిక కాదు. రఘుపతి నాన్నగారి పంతాలు పట్టుదలలు నాకు తెలియనివి కావు ఆయన తన పంతాన్ని ఎలా నెగ్గించు కోగలరో నాకు వూహ తెల్సినప్పటి నుంచీ చూస్తున్నాను. నీ ఆశ నెరవేరాలని నా కోరిక. అయితే అది మన మను కున్నంత తేలికగా నెరవేరేది కాదని నా అభిప్రాయం," అంటున్న చంద్రం మాటలను మధ్యలోనే తుంచేస్తూ లేచి కూర్చున్నాడు శేఖర్.

"చందూ ! నాకు నాన్నగారిమీద నమ్మక ముంది. ఆయన యింతవరకూ నా యిష్టానికి వ్యతిరేకంగా ఏదీ చేయలేదు. చదువు విషయంలో కూడా ఆయన నా యిష్టప్రకారమే చదివించారు. ఆయనకు నన్ను యింజనీర్ని చేయాలనే కోరిక మొదటినుంచీ వుండేది. కానీ నేను చిన్నప్పటినుంచీ పొలం పనులమీద యింట్రస్ట్ చూపేవాడిని. గోపాలం గారిని నాకు తోచిన ప్రశ్న లన్నీ వేసే వాడిని. నా అర్థంలేని ప్రశ్నలకు చిరు నవ్వుతో ఆయన ఓపిగ్గా సమాధానాలు చెబుతుండేవారు. నాన్నగారు నన్నక్కడి నుంచి లేపి, వెళ్ళి చదువుకొమ్మని విసుక్కునేవారు. నాకు వూహ తెల్సిన తర్వాత ఆయన ఏనాడూ నా ఇష్టానికి వ్యతిరేకంగా ఏ పనులూ చేయలేదు. యీ విషయంలో కూడా నాన్నగారు నా యిష్టానికి వ్యతిరేకంగా చెయ్యరనే నా విశ్వాసం."అని నిశ్చయంగా చెబుతున్న శేఖర్‌లోని ఆత్మవిశ్వాసం, తండ్రిపై నున్న అపార నమ్మకం హర్షించ

దగినవే. కానీ ఒక్కసారి పరిస్థితులు మనిషి విశ్వాసంపై దెబ్బతీసి తను వేసే అంచనాలను తలక్రిందులు చేస్తాయి. ఆ దెబ్బకు కొందరు తట్టుకోగలుగుతారు. మరి కొందరు తట్టుకోలేరు. అయినా విధి విచిత్ర విలాసానికి పావులు కాకుండా తప్పుకోడం ఎవరికీ సాధ్యం కాదు అనుకుంటూ,

"మరి... మరి మధు విషయం! తనసలు వివాహానికే సుముఖంగా లేదుగా శేఖర్?" అంటున్న చంద్రం మాటలు అప్పటివరకూ ఎంతో ఉత్సాహంగా, విశ్వాసంగా చెబుతున్న తన మాటలన్నీ వృధా అన్పించేలా చేశాయి శేఖర్‌కు. అయినా మాటలు కూడదీసుకుంటూ నెమ్మదిగా చెప్పాడు.

"చందూ! ప్రస్తుత పరిస్థితుల్లో మధును ఆ విషయమై ప్రస్తావించి, చికాకు పర్చడం నాకూ యిష్టంలేదు. కొన్నాళ్ళు పోయిన తర్వాత ఈ దుఃఖాన్ని మరపించి నేను మధును నా దాన్నిగా చేసుకోగలనన్న గట్టినమ్మకముంది. అందుకు స్నేహితుడిగా, మధుకూ, నాకూ, హితుడిగా, నీ సహకారం కావాలిరా" అంటూ అర్థింపుగా చూస్తున్న శేఖర్ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని ఆప్యాయంగా నొక్కుతూ-

"తప్పకుండా వుంటుంది శేఖర్! నేను శ్రీధర్‌గారికి యిచ్చిన నా మాట ప్రకారం మధుకూ నీకూ వివాహమైన తర్వాతే నా వివాహం. సరేనా?" అంటున్న చందూని ఆప్యాయంగా కౌగలించుకున్నాడు శేఖర్. ఇద్దరూ లేచి ఓరకమైన తృప్తితో యిళ్ళకు బయలుదేరారు.

సావిత్రమ్మ కర్మకాండలన్నీ పూర్తయ్యాయి. ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. శాంతను మరో రెండురోజులుండమని ఆపేశాడు చంద్రం. రాజేశ్వర్ వ్యాపారం గొడవలేవో వున్నాయని వెళ్ళిపోయాడు. తనకు చాతనైనంతలో కర్మకాండ గొప్పగానే ముగించాడు చంద్రం. తల్లి తర్వాత తల్లి సావిత్రమ్మ మరణం చంద్రాన్ని చాలావరకూ కృంగదీసింది. అయినా ధైర్యంగా తిరుగుతూ నేర్పుగా పనులన్నీ చేయిస్తున్నాడు. తండ్రిద్వారా విషయాలన్నీ వినివున్న సుషమకు చంద్రంవైపు చూస్తుంటే అతను తనకంటే ఎంతో వున్నతుడుగా తను అందుకోలేని ఆదర్శ శిఖరాల నధిరోహించిన ఆదర్శపురుషుడిగా కన్పిస్తున్నాడు. ఏకాంతంగా కలుసుకొని మాట్లాడాలంటే ఆ హడావుడిలో అందరిమధ్యా అవకాశం కలగటంలేదు.

రా గా నే మామూలు పలకరింపులయ్యాయి. తనకు ఏడ్చేవాళ్ళను ఎలా వోదార్చాలో తెలీదు. గంభీరంగానో, శోకదేవతలాగో కూర్చుని వుండే మధు దగ్గర కూర్చోవాలంటే మరీ భయంగా వుంది. కాలం స్థంబించినట్లుంది. ఇంతక్రితం రెండుసార్లు గంగాపూర్ వచ్చినా,

ఆ అనుభవంలోని అనుభూతులు అను క్షణం ఆనందం కల్గించేవిగా వుండేవి. ఏటి వొడ్డున షికార్లు, మావిడి తోటల్లో చిన్నపిల్లల్లా వేసిన గంతులు, శాంత పెళ్ళిలో చేసిన అల్లరీ, అప్పుడప్పుడు కావాలని చంద్రం బెదిరిపోతున్నా అల్లరిగా అతన్ని ఏడిపించాలని తను దగ్గర కెళ్ళి కూర్చోవడం అతను భయంగా ఎవరైనా చూస్తున్నారేమోనని చుట్టూ చూడటం, అంతలోనే ఆపుకోలేని ఆవేశంతో ఆ విశాలమైన బాహువుల్లో యిముడ్చుకొని వుక్కిరిబిక్కిరి చేయడం, తను తప్పించుకొని పారిపోవడం చూసి చంద్రం అల్లరిగా నవ్వడం...తను వెక్కిరిస్తూ ముందుకు పరుగెట్టడం, అది మధూ కనిపెట్టి ఏడ్పించడం లాంటి మరపురాని మధురాతి మధుర స్మృతులే మిగిల్చింది గంగాపూర్.

కానీ యిప్పటి పరిస్థితి సుషమ వూహకందనిది. ఆ యింటినీ ఆ వూరినీ, ఏదో నిశ్శబ్దత లాంటిది ఆవరించినట్లుంది ఆ వాతావరణంలో వూపిరాడనట్లుగా వుంది సుషమకు. శిరీష్‌కు రోజంతా శేఖర్ వాళ్ళింటికి వెళ్ళి, బజార్ల వెంట తిరిగి ఎలాగో ప్రొద్దుపోయేది. తండ్రి తను వచ్చేటప్పుడు మధును కనిపెట్టుకొని వుండమని, మధుకు సంతోషం కలిగించేట్లుగా వుండమని మరీ మరీ చెప్పడంవల్ల ఎటూ వెళ్ళలేకపోతోంది సుషమ. ఒకసారి మాత్రం శేఖర్‌తో వాళ్ళింటికి వెళ్ళి వచ్చింది. శ్యామలాదేవి కూడా ఓ సారి వచ్చి మధును పలకరించి వెళ్ళారు. శాంత కూడా సంతోషంగా తిరగటంలేదు. శాంత పెళ్ళిలో సావిత్రమ్మగార్ని తనూ చూసింది. సుషమ. అప్పటికే ఆవిడ చాలా నీరసంగా కన్పించారు. పదిరోజులైనా ఆ యింట్లో అందరూ అంతగా మర్చిపోలేకుండా వున్నారంటే ఆవిడ ప్రభావం వాళ్ళమీద ఎంత వుందో అర్థంచేసుకోగలదు మధు మామూలుగా మాట్లాడుతున్నా, మునుపటి కళాకాంతులు ముఖంలో కన్పించడంలేదు. వుత్సాహం వురకలువేసే మధులో ఏదో పెద్ద మార్పు వచ్చినట్లుగా అన్పించింది.

సుషమ, శిరీష్ వచ్చి మూడురోజులైంది. కానీ సుషమకు మూడు యుగాలైనట్లుగా వుంది. శేఖరన్నయ్యలో కూడా ఏదో మార్పు కన్పిస్తోంది. ఆలోచిస్తూ ఒంటరిగా దక్షిణపు గదిలో పడుకున్న సుషమ ముఖంమీద చిరుజల్లులా నీళ్ళు పడటంతో కళ్ళు విప్పి చూసింది. ఎదురుగా చంద్రం నిలబడి వున్నాడు. చేతిలో గ్లాసు. చిన్నగా నవ్వుతూ "ఏం సుషమా! నీ సుందర స్వప్నాన్ని చెదరగొట్టలేదు కదా?" అంటూ నీళ్ళగ్లాసు చేతి కిచ్చాడు.

"ఏవిటిది?" అంటూ గ్లాసందుకున్న సుషమ నిమ్మకాయరసం చూసి "మీరు

తెచ్చారెందుకూ ? నేను తెచ్చుకునే దాన్నిగా" అంది.

"ఆహా ! పర్వాలేదే బస్తీ అమ్మాయికి పనులొచ్చన్నమాట" అంటూ చిలిపిగా నవ్వుతున్న చంద్రాన్ని చూసి, వచ్చాక మూడు రోజులకు మనస్ఫూర్తిగా నవ్వింది సుషమ. "కూర్చోండి" అంటూ మంచం వైపు చూపించింది.

"అహా ! అమ్మో ! అప్పుడే!... నా కంత ధైర్యంలేదు. నిజం చెప్పాలంటే నా పైద నాకు నమ్మకంలేదు. వూరికే నీకు దగ్గరగా చూస్తూ కూర్చోవాలంటే...నీ సమక్షంలో అది నాకు సాధ్యమయ్యే పనికాదు దేవీ !" అంటూ నెమ్మదిగా బుగ్గన ఓ చిటిక వేసి, యింతలో శాంత పిలవడంతో త్వరగా బయటకు వెళ్ళిపోయాడు. సుషమకు మళ్ళీ శరీరంలోకి ప్రాణ మొచ్చినట్లుగా అన్పించింది. మనసు ఆనందంతో తేలిపోతుంటే లేచి చావిట్లోకి వెళ్ళింది. ఎదురుగా శాంత వస్తూ..."ఎక్కడికి వదినా ?" అని అడిగింది.

"అబ్బ ! వదినా, గిదినా అనకపోతే సుషమా అనలేవూ ?" అంటూ విసురుగా వెళ్ళిపోయింది.

ఆశ్చర్యంగా సుషమ వెళ్ళినవైపే చూస్తుండిపోయింది శాంత.

తన సంతోషానికి అంతరాయాన్ని కల్గించిన శాంతమీద కోప మొచ్చి విసుక్కుందే కాని తర్వాత తను తప్పుగా అన్నానని బాధపడింది సుషమ. మధ్యాహ్నానికి శేఖరింటినుంచి యిల్లు చేరిన సుషమకు మనసులో ఏదో సంకోచంగా వుంది. శాంత ముఖం చూడాలంటే. తనలా విసుక్కోని వుండవల్సింది కాదు. వాళ్ళన్నయ్యను పెళ్ళి చేసుకోబోయే తను వదిన కాక మరేమౌతుంది శాంతకు. పాపం ! తనలా అన్నందుకు శాంత ఎంత బాధ పడిందో ? ఆలోచిస్తూ మధు గదివైపు అడుగులు వేసిన సుషమ వాకిట్లోనే ఆగిపోయింది.

లోపల్నించి చంద్రం బుజ్జగింపుగా మాట్లాడుతున్న మాటలు విన్పిస్తున్నాయి.

"తిను మధూ ! ఎన్నాళ్ళిలా వుంటావు ? నువ్వు సరిగ్గా భోంచేసి ఎన్ని రోజులైందో తెల్సా ? పిన్నీ, బాబాయి పోతే నీకింక ఎవ్వరూ లేరని నువ్వెందుకనుకోవాలి ? నీకు నేను లేనా మధూ ! నీ కెప్పటికీ తోడు నీడగా నేనుంటాను మధూ ! ధైర్యంగా వుండాలి. నువ్వు దిగులుగా వుంటే శ్యాం కూడా ముఖం విప్పి తిరగటంలేదు. నా మాట విను మధూ, కొంచమైనా తిను." అంటూ పళ్ళెంలోంచి ఓ ముద్ద చేతిలోకి తీసుకొని మరో చేత్తో మధు గడ్డం పట్టుకొని బ్రతిమిలాడుతున్నాడు.

మధు అవిరామంగా కురుస్తున్న

కన్నీళ్ళను తుడుచుకొనే ప్రయత్నం కూడా చేయకుండా చేతుల్లో తల దాచుకొని ఏడుస్తోంది. శోకమూర్తిలావున్న మధు తలపై చేయివేసి నిమురుతూ "మధూ! నా మాట వింటావా లేదా? సరే నేను కూడా లేననుకుంటే, నీ యిష్టమొచ్చినట్టు నువ్వుండు" అంటున్న చంద్రం నోటికి చెయ్యడ్డంపెట్టి-

"ఒద్దు బావా! అంత మాటనకు. తింటాను" అంటూ పళ్ళెం చేతుల్లోకి తీసుకుంది.

చెమ్మగిల్లిన కళ్ళను వొత్తుకుంటూ పై పంచతో ముఖం తుడుచుకుంటూ బయటకు అడుగువేయబోయిన చంద్రం వాకిట్లో శిలాప్రతిమలా నిలబడిపోయిన సుషమను చూసి నవ్వడానికి ప్రయత్నిస్తూ "అరే! సుషమా! ఎంతసేపైంది నువ్వొచ్చి? యింకా భోజనం చేయలేదు కదూ! పద పద భోంచేద్దాం. శిరీష్ ఎక్కడ?" అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తూ వంటింటివైపు వెళ్ళిపోయాడు. ఒక్కసారి వెనక్కు తిరిగి సుషమ వైపు చూసి వుంటే...అంత మామూలుగా వెళ్ళిపోయుండేవాడు కాదు చంద్రం.

భోజనానికి కూర్చున్నారంతా. శాంత వచ్చింది సుషమను పిలవడానికి. ఓ క్షణం తటపటాయించి "సుషమా! భోజనం చేద్దురుగాని రండి. అన్నయ్యవాళ్ళు

కూర్చున్నారు.మిమ్మల్ని పిలుస్తున్నారు" అంది తల వంచుకొని శాంత.

తనంతక్రితం అన్న మాట వల్లే శాంత అలా పిల్చినా ఒక్కసారిగా తను పరాయిదాన్ననే భావం కలిగింది. తనను వాళ్ళంతా చాలా దూరం చేస్తున్నట్లుగా అన్పించింది. ఇంతలో మధు వున్న గదిలో కెళ్ళిన శాంత "వదినా పెరుగు తీసుకు రానా ? నేనంత సేపు బ్రతిమిలాడినా భోంచేయలేదు. అన్నయ్య చెబితే తింటు న్నావు కదూ !" అంటోంది. అప్పటికే అసూయా జ్వాలల్లో దహించుకుపోతున్న సుషమను ఈ మాటలు మరింత దహించి వేస్తాయని తెలిస్తే శాంత అలా అని వుండదు. గిర్రున అక్కడినుంచి తమ కోసం ఏర్పాటు చేసిన దక్షిణపు గదిలోకి వెళ్ళిన సుషమ బాగ్ సర్దటం మొద లెట్టింది. లోపల్నుంచి చంద్రం పిలుస్తు న్నాడు "శాంతా ! శాంతా !" లోపలి కెళ్ళిన శాంతతో "సుషమ ఏదమ్మా ! భోజనానికి రాలేదేం ?" అన్నాడు. తల వంచుకొని భోంచేస్తున్నాడు శిరీష్. 'సుషమను నేను పిలవను. నువ్వే పిలు వన్నయ్యా' అనాలన్పించినా శిరీష్ ముఖం చూసి ఆపుకొని "పిలిచా నన్నయ్యా ! తనెందుకో దక్షిణపు గది లోకి వెళ్ళింది."

మాటలన్నీ వినిపిస్తూనే వున్నాయి సుషమకు. బాగ్ అక్కడ పడేసి మంచ మెక్కి పడుకుంది. కన్నీళ్ళు ఆపుకుందా మన్నా ఆగటంలేదు.

"నీకు ఎవ్వరూ లేరని నువ్వెందుకు బాధపడాలి ? నీకు నేను లేనా మధూ !" ప్రపంచంలో వున్న ప్రేమంతా ఆ రెండు మాటల్లో నింపుతూ చంద్రం అన్న ఆ మాటలే పదే పదే చెవుల్లో మారుమోగుతున్నట్లై తలగడలో తల దూర్చి వెక్కి వెక్కి ఏడుస్తోంది సుషమ. తను మనసిచ్చిన వాడిమీద తనెరిగిన మధుమీద నమ్మకం లేకుండా అతి సాధారణమైన ఆడపిల్లలా అతి వలందరికీ వుండే మామూలు అసూయా ద్వేషాలతో మనసు నింపుకొని ఆక్రో శిస్తోంది, ది సోకాల్డ్ సివిలైజ్డ్ జంటిల్ మాన్ శ్రీధర్స్ డాటర్. కాలేజీ చదువులు చదువుకున్నా....సంస్కారహీనురాలిలా విలపిస్తోంది.

చంద్రం అన్నంచేత్తో అలాగే లేచి వెళుతుంటే శిరీష్‌కు కోపం వచ్చింది, ఎంతకూ రాని చెల్లెలిమీద. సుషమ వున్న గదిలో అడుగుపెట్టిన చంద్రానికి ఆశ్చర్యంతో నోటమాట రా లే దు. 'సుషమ ఏడుస్తోందెందుకు ? ఎవరే మన్నారు ?' దగ్గరగా వెళ్ళి "సుషమా" అని పిలిచాడు. తలెత్తి కూడా చూడ లేదు. చంద్రానికి ఖంగారుగా వుంది విషయమేమిటో అర్థంకాక. సుషమ భుజం పట్టుకొని తనవైపు తిప్పుకుంటూ "సుషమా ! ఏం జరిగింది ? ఎందు కేడుస్తున్నావు ? ఎవరేమన్నారు ? నే నేమైనా పొరపాటుగా మాట్లాడానా ?

శాంతేమైనా నొప్పించిందా? మధు ఏమైనా అందా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు. ఆదుర్దాగా, అమాయకంగా, ఆప్యాయంగా, అలా అడుగుతున్న ఆ కంఠం వింటుంటే తన అనుమానాలన్నీ ఆధారం లేనివేమో అనిపించిందో క్షణం కళ్ళు తుడుచుకుంటూ లేచి కూర్చుంది సుషమ. "తర్వాత మాట్లాడుకుందాం, భోంచేద్దాం రా సుషమా! శిరీష్ ఎదురుచూస్తు న్నాడు" అంటున్న చంద్రం వైపు చూడకుండా బయటకు చూస్తూ సమాధానం చెప్పింది.

"నాకాకలిగా లేదు. మీ రెళ్ళి భోంచేయండి." అలిగిన చిన్నపిల్లలా మూతి ముడుచుకుని మాట్లాడుతున్న ఆ ముచ్చటైన ముఖం చూసి, చంద్రానికి ఓసారి దగ్గరకు లాక్కొని ముద్దుగా ముడిచిన ఆ ముచ్చటైన పెదాలమీద ముద్ర వేయాలనిపించింది. అది సమయం కాదని హాస్యంగా" పోనీ, నేను కలిపి తీసుకొచ్చి గోరుముద్దలు తినిపించనా ఎంచక్కా?" అంటున్న చంద్రం వైపు కోపంగా చూస్తూ "తినిపించేవాళ్ళకు తినిపించండి ఎంచక్కా నా కెందుకూ!" అంటూ విసురుగా లేచి వాకిట్లో కెళ్ళి పోయింది.

సుషమ మాటల కర్థమేవిటో? ఎందుకలా అంది? ఆలోచనలతో, అయోమయంగా, అక్కడే ఎండిపోతున్న చేత్తో నిలబడ్డ చంద్రంతో, భోంచేసి చేయి తుడుచుకుంటూ వచ్చిన శిరీష్ "అదేవిటి? అలా నుంచుండిపోయా రేమిటి? సుషమేదీ? దానికి ఆకలేస్తే అదే తింటుందిగానీ మీ భోజనం కానీండి, చంద్రం. నేను ఆకలికాగలేను. ఎంత సేపటికీ మీరు వచ్చే సూచనలు కన్పించకపోతే, నా భోజనం కానిచ్చేశాను" అన్నాడు.

"ఫర్వాలేదు శిరీష్!... అంటూ లోపలి కెళ్ళిన చంద్రం చెయ్యి కడుక్కోడం చూసి, "అదేంటన్నయ్యా! భోంచేయవేం?" అంది శాంత ఆదుర్దాగా. "ఈ పూట ఎందుకో నాకు ఆకలిగా లేదమ్మా!" అంటూ బయటకు వెళ్ళి పోయాడు.

ఆ సాయంత్రమే బయలుదేరుదా మంటున్న సుషమ వైపు విచిత్రంగా చూశాడు శిరీష్. అదేవిటి? నాన్నగారు నాల్గురోజుల్లో వచ్చేయమంటే కనీసం పదిరోజులైనా పడుతుంది డాడీ! అని చెప్పొచ్చి అంతలోనే కలకత్తా మీదకు గాలి మళ్ళిందా?" అన్నాడు నవ్వుతూ. ఆ సాయంత్రం వరకూ ఎవరితోనూ మాట్లాడలేదు సుషమ. అందర్నీ తప్పుకొని తిరిగింది. తన మనసేవిటో తనకే అర్థం కావడంలేదు. తండ్రి, "చంద్రం మధు పెళ్ళయ్యేంతవరకూ తనూ పెళ్ళి చేసుకోనన్నాడు" అని చెప్పినప్పుడు చంద్రం ఔన్నత్యాన్ని తలుచుకొని

మురిసిపోయింది. ఎవరో బాబాయి మేనగోడలి మీద అంతటి అభిమానంతో బాధ్యత స్వీకరించి అలా చెప్పాడన్న ప్పుడు అంతటి విశాలహృదయుడు తన వాడవబోతున్న అదృష్టానికి పరవశిం చింది. అతనికోసం జీవితాంతం ఆగ వలసి వచ్చినా తన కభ్యంతరం లేదని తండ్రిముందు నిర్భయంగా చెప్పింది. అదే వ్యక్తి మధుమీద చూపుతున్న ఆదరణ, ఆప్యాయతల్ని సహృదయంతో అర్థంచేసుకోలేకపోతోంది." మనస్సు కోతిలాంటి దంటారు. ఒక్కోసారి మంచిగా, మరోసారి చెడ్డగా, ఒకే విషయాన్ని వివిధ కోణాల్లో చూసి విమర్శించడం బహూశా ఆ మనసుకే చెల్లుతుందేమో ! !

అన్నయ్య అడిగిన ప్రశ్నకు సమా ధానం చెప్పలేదు సుషమ. "ఓ. కే. యాజ్‌యు" లైక్, అంటూ తన బాగ్ తీసుకొని సర్దుతున్న శిరీష్, శేఖర్ పిలుపుతో పని ఆపుజేసి వెనక్కు తిరి గాడు. "శిరీష్! త్వరగా కానివ్వరా వెళ్ళి పోదాం" అంటున్న శేఖర్ వైపు చూసి నవ్వుతూ" ఓహో నువ్వూ వస్తున్నా వన్నమాట ? అదీ కథ ! ఇంత హఠాత్తుగా చెల్లెమ్మగారికి చదువుమీద యింత యింటరెస్ట్ ఎలా పుట్టిందా అని నే నాలోచిస్తున్నాను." అంటూ సుషమ వైపు చూశాడు నవ్వుతూ. దగ్గరగా వచ్చి వీపున ఒక్కటి చరిచి "ఒరేయ్ ! నే నెక్కడికి రావడంలేదురా. మీరు మా యింటి కొస్తున్నారు. ఇంక సుషమ చదువువిషయ మంటావా ? మనకంతె వెయ్యిరెట్లు'నయం. ఏం సుషమా ?" అంటూ నిర్మలంగా నవ్వుతున్న శేఖర్ వైపు చూస్తూ "మళ్ళీ మీ యింటి కెందుకన్నయ్యా ! రోజూ వస్తూనే వున్నాము కదా ! ఇవ్వాళ వెళ్ళిపోదా మనుకుంటున్నాం కలకత్తా" అంటున్న సుషమ ఎదురుగా గుమ్మంలో కన్పించిన చంద్రాన్ని చూసి మాట మధ్యలోనే ఆపేసింది.

మధ్యాహ్నం అతను తన మూలంగా భోజనం చేయకుండా వెళ్ళాడని తెలిసి, మనసు పశ్చాత్తాపంతో నిండిపోయింది. తను చేసిన తెలివితక్కువతనానికి తనలో తానే సిగ్గుపడుతోంది సుషమ. శేఖర్ చంద్రంవైపు తిరిగి "ఒరేయ్ చందూ ! ప్పెళ్ళినేమిటిరా అప్పుడే బిఛాణా కట్టించేస్తున్నావు. మళ్ళీ యిప్పు డొదిలావంటే యింకో ఆరునెల్లవరకూ కన్పించరు. అంతవరకూ గ్యారంటీగా చెప్పగలను చందూ ! నీకు మరో విశేషం తెల్సా ? త్వరలో మన శిరీష్ అమెరికా అమ్మాయిని పెళ్ళిచేసుకో బోతున్నాడట. అమెరికా వెళ్ళి సెటిల్ అవ్వాలని వాడి ప్లాను. శేఖర్ చెబుతున్న మాటలేవీ విన్పించుకోకుండా వాడిన ముఖంతో సుషమ వైపే తదేకంగా చూస్తున్న చంద్రం—




## మా డాక్టర్ అన్నారు:
## "పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి మొట్టమొదట ఫారెక్స్ అలవాటు చేశాకనే ఏ ఇతర ఘన ఆహారాన్నయినా ఇవ్వవచ్చు".

**మొదట ఫారెక్స్ అని డాక్టర్లు అంటారు! ఎందువల్ల?**
3 నెలలు నిండాక పాపాయికి పాలు మాత్రమే తగినంత పోషణనివ్వలేవు. పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి తగినట్టు ప్రత్యేకంగా తయారుచేయబడిన ఘన ఆహారం ఫారెక్స్ అతడికి అవసరం.

**ఇంకా ఏ విధంగా ఫారెక్స్ పాపాయి అవసరాలకు సరిపోతుంది?**
మీ పాపాయి మెదడు, శరీరం పెరుగుదల కోసం ఫారెక్స్ సులభంగా జీర్ణమయ్యే ప్రొటీన్లను సరియైన ప్రమాణంలో అందిస్తుంది. శక్తి కోసం కార్బోహైడ్రేట్లు కూడా సమకూరుస్తుంది.

ఫారెక్స్‌లో మీ పాపాయి అవసరాలకు పూర్తిగా సరిపోయి. అతడి రక్తాన్ని ఆరోగ్యంగా ఉంచేందుకు తగినంత ఐరన్ ఉంది. దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్ $D_2$ కూడా తగినంతగా అందిస్తుంది ఫారెక్స్.

**3 నెలలు వచ్చాకనే ఎందుకు?**
ఆహారాన్ని సరిగా జీర్ణం చేసుకొనేందుకు పాపాయికి నమలడం అలవాటు కావాలి. లేకపోతే, నమలకుండా మింగి వేయడం వల్ల అతడి పెరుగుదల దెబ్బతినవచ్చు లేదా కడుపు నొప్పి రావచ్చు.

**"పెద్దలు తినే" ఆహారాన్ని ఎప్పటి నుంచి ఇవ్వవచ్చు?**
మొదటిసారిగా తప్పటడుగులు వేశాక పాపాయికి పళ్లు, కూరగాయలు, పప్పు, గుడ్లు ఇవ్వవచ్చు. కాని, అతడికి మూడేళ్లు వచ్చేవరకు ఫారెక్స్ అవసరం. అంచేత పాపాయి తినేవాటన్నిటిలో దాన్ని కలిపి పెట్టండి.




**పుష్టికరమైన, సంపూర్ణమైన పెరుగుదలకోసం పాపాయి మొట్ట మొదటి ఘన ఆహారం.**

గ్లాక్సో

ఇంటాస్-GF-58-1710 TL

"ఒరేయ్ దిష్టి తగులుతుంది ఏవిటా చూపు" అంటూ శేఖర్ ఒక్కటి వేశాక గానీ బాహ్య స్మృతి కలగలేదు. మళ్ళీ చెబుతున్న శేఖర్ మాటలు విని "చాలా సంతోషం శిరీష్. నాకు చెప్పలేదేం ?" అంటూ సంతోషంగా శిరీష్ నభినంది స్తుంటే ఆడపిల్లలా సిగ్గుపడిపోయాడు శిరీష్. మబ్బులు విడిపోయినట్లు దానం తటదే ఓ పెద్ద చిక్కు విడిపోయేసరికి చంద్రానికి హాయిగా అనిపించింది శ్రీధర్‌గారు మధును కోడలిగా చేసుకునే అభిప్రాయం వ్యక్తపరిచారు. శేఖర్ మధు లేకపోతే మరణమే శరణ్యమనేంత పిచ్చిగా మధును ఆరాధిస్తున్నాడు. వీటన్నింటి మధ్యా శిరీష్ మనసేమిటో, శ్రీధర్‌గారికి ఏమి బదులు చెప్పాలో తెలీక నిరంతరం ఆలోచనలతో సతమత మౌతున్న చంద్రానికి శేఖర్ శిరీష్‌ను గురించి చెప్పిన శుభవార్త అత్యంత ఆనందాన్ని కలిగించింది. ఓ క్షణం మధ్యాహ్నం సుషమ అన్న మాటలన్నీ మర్చిపోయాడు.

"శాంతా ! మధూ" అంటూ కేకలు పెట్టాడు. హడావిడిగా లోపలికొచ్చిన శాంత "ఏవిటన్నయ్యా ? మధు వదిన పడుకునుంది" అంటుంటే బదులేం చెప్పాలో అర్థంకాక అయోమయంగా అయిపోయి "ఏం లేదమ్మా. కాఫీ కలిపి పట్రా" అన్నాడు. మౌనంగా లోపలి కెళుతున్న శాంతను చూసి తనూ బయటకు వెళ్ళబోయింది సుషమ.

"తమ రెక్కడికి ? తమరిలా కూర్చోండి" అంటూ చెయ్యిపట్టుకులాగి మంచంలో కూలేశాడు చంద్రం. వెనక్కు తిరిగిచూసిన శాంత, నవ్వుతూ వెళ్ళి పోయింది. శేఖర్, శిరీష్ కూడా నవ్వడం చూసి వుక్రోషంగా చూసింది చంద్రంవైపు.

చిన్నగా నవ్వుతూ "సారీ సుషమా ! అలా చూడకు. భస్మమయి పోతానని భయంగా వుంది" అన్నాడు అర్థింపుగా. 'ఆ చూపుల్లోని కొంటెతనా నికి నవ్వకుండా వుండటం సాధ్యం కాలేదు, సుషమకు.

మళ్ళీ ఆ రాత్రి చాలా ప్రొద్దు పోయేంతవరకూ మాట్లాడుతూ కూర్చు న్నారు. సుషమా వాళ్ళు కలకత్తా వెళ్ళడం మరో రెండురోజులు వాయిదా పడింది. శేఖర్ వాళ్ళింటికి తీసుకెళతా నంటే చంద్రం వొప్పుకోలేదు. "రోజూ వస్తున్నారు గదా ! ఎక్కడుంటే నేంరా !" అన్నాడు. శేఖర్‌కు సుషమ, శిరీష్ వచ్చిన తర్వాత ప్రత్యేకంగా మధుని పలకరించడానికి సంకోచంగా వుంది. ఈ రోజు శిరీష్ తను ఓ అమెరికా అమ్మాయిని ప్రేమిస్తున్నట్లు, పెళ్ళిచేసుకోబోతున్నట్లు చెప్పి, ఆ విషయం శ్రీధర్ అంకుల్‌కి చెప్పే బాధ్యత తనమీద వేసినప్పుడు మనసు ఆనందంతో గంతులువేసింది

శ్రీధర్‌గారి దగ్గర సుషమకున్న చనువు శేఖర్‌కు లేదు. ధైర్యంగా





పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు...

సౌమ్యంగా పనిచేసే
# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
బాధను అతి త్వరగా తగ్గిస్తుంది

గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మకకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారి.




కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు వచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM 8410/2 TG

తనకు కావలసింది అడిగి పొందగలదు సుషమ. శిరీష్ అలా కాదు. తండ్రంటే కొంచం భయం. అందులోనూ యీ ప్రేమ వ్యవహారం కులాంతరమో మతాంతరమో కాక దేశాంతర వ్యవహార మయ్యేటప్పటికి మరింత భయంగా వుంది. తండ్రి ఎదురుపడితే గుండె లబ్ డబ్ లబ్‌డబ్ మని కొట్టుకోడం స్పష్టంగా తనకే విన్పిస్తున్నట్లై తప్పు కొని లోపలికెళ్ళిపోయేవాడు. అందుకే తనవల్ల సాధ్యంకాని పని అని తెలుసు కొనే, సుషమ తర్వాత అంత చనువు గానూ మాట్లాడే శేఖర్‌కు ఆ పని ఒప్ప జెప్పాడు శిరీష్. సుషమతో చెప్పా లంటే తనకంటే చిన్నదానిముందు తన ప్రేమ వ్యవహారం చెప్పాలంటే సిగ్గుగా అన్పించింది. దాని రికమండే షన్ అడిగితే చెట్టెక్కి కూర్చుంటుందని భయం. అందుకే వుపాయం ఆలోచించి అపాయం నుంచి కాపాడమని శేఖర్‌ని అర్థించాడు. ఆ అర్థింపే శేఖర్ పాలిట వరంగా మారింది.

అందరూ కూర్చొని చావిట్లో కబుర్లు చెప్పకుంటున్నారు. శాంత కూడా వచ్చింది. ప్రొద్దుటి తన ప్రవర్తనకు సిగ్గుపడుతున్న సుషమ శాంత రాగానే వుయ్యాలబల్లమీద ప్రక్కకు జరిగి, తన ప్రక్కన కూర్చోబెట్టుకుంది చిన్నగా నవ్వుతూ. శేఖర్ అడిగాడు, "మధు ఏంచేస్తోంది ఒక్కతే లోపల ?" "ఇందాక పడుకునుంది. నిద్రపోతుందో లేదో చూసొస్తాను" అని లోపలి కెళ్ళింది శాంత

కొంచంసేపటికి బలవంతంగా మధుని తీసుకొని వచ్చింది శాంత. అంతా సరదాగా మాట్లాడుతూ కూర్చొని వుండటంచూసి తనూ చిన్నగా నవ్వ డానికి ప్రయత్నిస్తూ, సుషమ ప్రక్కన వచ్చి కూర్చుంది మధు. మధు చేయి చేతుల్లోకి తీసుకొని చూస్తోంది సుషమ. పాలిపోయినట్లు తెల్లగావున్న ఆ చేతు ల్లోకి చూస్తూ ఏదో ఆలోచిస్తోంది. శాంత పెళ్ళప్పటికీ యిప్పటికీ మధులో చాలా మార్పు వచ్చింది. మొదట చూసి నపుడు చెంగుచెంగున గంతులు వేస్తూ తిరిగిన మధు, శాంత పెళ్ళిలో పంది రంతా తనే అయి తిరిగి, అందరి అవస రాలూ కనుక్కుంటూ, అందరి అభిమా నానికీ పాత్రురాలై తనకు మరింత సన్నిహితురాలైంది. ఇప్పుడు మధును చూస్తోంటే యింత త్వరగా మనిషిలో యింత మార్పు ఎలా సాధ్యమా ? అని ఆలోచిస్తోంది సుషమ మనసు.

ఇంతలో దూరంగా కూర్చున్న శేఖర్ లేచి వుయ్యాలబల్ల దగ్గరగా కుర్చీ వేసుకొని కూర్చుంటూ, "మధూ ! యీ రోజు కులాసాగా వుందా ! జ్వరమేం లేదుకదూ !" అని చిన్నగా అడిగాడు. మాటల్లో మునిగిన శిరీష్ గమనించక పోయినా, చంద్రం క్రీగంట శేఖర్‌ను

గమనిస్తున్నాడు. మధు ప్రక్కనే కూర్చున్న శాంత, సుషమలు కూడా చూస్తున్నారు. శిరీష్ మాటల్లో పడితే అవతలివాళ్ళు వింటున్నారా లేదా అనేది కూడా గమనించడు. ఎక్స్‌ప్రెస్‌లా చెప్పుకుపోతూనే వుంటాడు. కొన్ని మాటలు విన్నా అర్థం కావు. అంత స్పీడ్‌గా మాట్లాడుతాడు. వయసుతో పాటు మనసు పెరగలేదు. కుర్రతనం ఎక్కువ. చిన్నపిల్లాడిలా మాట్లాడు తుంటాడు.

ఓసారి తలెత్తి శేఖర్‌వైపు చూసి వెంటనే తలవంచుకుని, "ఈ రోజు జ్వరంలేదు. మీ నాన్నగారెలా వున్నారు? వారికి మధ్య వంట్లో బావుండటంలే దన్నారు" అంది మధు అతి మెల్లగా. "నాన్నగారు బానేవున్నారు ప్రస్తుతం. నీ ఆరోగ్యం జాగ్రతగా చూసుకో మధూ !" యిలా మెల్లగా సాగిపోతున్న సంభాషణ శాంతకూ, సుషమకూ ఆశ్చర్యాన్ని కలిగించింది. అసలు శేఖర్‌కు ఎదురుగా ఒక్క మధు తప్ప వేరెవ్వరూ లేనట్టు మిగతావాళ్లంతా ఏ బల్లల్లాగో, కుర్చీల్లాగో కనిపిసున్నా రేమో! అనే అనుమానం వచ్చింది చంద్రానికి. శేఖర్ కళ్లలో మెదిలే ఆరాధనాభావానికి కళ్లెత్తి చూస్తే మధుకు పిచ్చెత్తిపోయే దేమో ! అన్పిచేంత ఆర్తిగా ఆపేక్షగా చూస్తున్నాడు శేఖర్. ఇన్నాళ్లూ ఇంతటి ఆరాధనను, ఆరాటాన్నీ ఎలా అణచు కున్నాడా ! అని ఆశ్చర్యమేసింది చంద్రానికి.

"ఓ రోజేమైందంటే, మా ఫ్రండ్సుతో కలసి పిక్నిక్‌కు వెళ్ళాలని బయలు దేరాను. ఒకళ్ళు రామకృష్ణ మఠమంటే మరొకరు దక్షిణేశ్వర్ కెళదామని వాద నలు మొదలెట్టారు సరే ఎలాగూ చేతిలో కారుంది కనుక అక్కడికీ యిక్కడికీ కూడా వెళ్దామని బయలుదేరాం. మేం ఆరుగురమే వున్నాం. మొదట రామ కృష్ణా మఠ్‌కు వె॰ళ, అక్కడికి వచ్చిన టూరిష్ట్ బాచ్‌లను చూసి, స్కూలు పిల్లల్ని చూసి దడుచుకొని దక్షిణేశ్వర్ బయలుదేరాం. అక్కడయినా రద్దీ తక్కువ వుండాలని విశ్వేశ్వరుడిని వేడు కుంటూ ఎలాగో చేరాం. జనం కొంత తక్కువగానే కనిపించారు. అక్కడికి చేరగానే మాతో కొందరికి గంగానది స్నానం చేయాలనిపించింది. 'పాపాత్ము ల్లారా మీరు మునగండిరా గంగలోనే, నేను రాను.' అని నేను తమాషాగా చూస్తూ, కాళ్ళు మట్టుకు నీళ్ళలో వుంచి మెట్టుమీద కూర్చున్నాను యింతలో ఓ ఆడపిల్లల గుంపొచ్చింది. నేను పల్లీలు, చనా తింటూ దర్జాగా కూర్చుని హాయిగా జలకాలాడుతున్న మిగతా ఫ్రండ్సందరినీ చూస్తున్నాను. వచ్చిన అమ్మాయిల్లో యిద్దరు యిండియన్స్ కాదు. మరో అమ్మాయి యిండియన్, బహుశా ఆ అమ్మాయితో వాళ్ళిద్దరూ వచ్చివుంటారు.

వాళ్ళేదో మెట్టుమీద నుంచొని కాళ్ళు కడుక్కుంటూ మాట్లాడుకుంటున్నారు. నన్ను చూసి నవ్వుతున్నారు. నేను భయపడి నీళ్లలోకి దిగలేదని పిల్లకు ఎగతాళిగా వుంది కాబోలనుకొని కోపంగా వాళ్లవైపు చూసి చేసేదేంలేక నోట్లో పెట్టుకున్న గింజల్ని 'థు' అని వూసేశాను. అంతే ఓ అమ్మాయి చేత్తో సైగచేయడం, మరో అమ్మాయి నన్ను ముందుకు తోసేయడం, నేను నీళ్లలో పడటం, వాళ్ళు కిలకిలా నవ్వుతూ పరుగెట్టడం ఒకేసారి జరిగాయి. నేను నీళ్లలో పడగానే దూరంగా ఈత కొడుతున్న ఫ్రండ్సంతా 'పాపాత్ముడు పడ్డాడ్రోయ్' అంటూ నవ్వుతూ వచ్చి నన్ను చుట్టేశారు. వాళ్లకు నిజం చెప్పలేక, పారిపోతున్న అమ్మాయిల్ని పట్టుకోలేక నిస్సహాయంగా వాళ్ల చేతులు విడిపించుకొని "వూరికే మిమ్మల్ని హడలగొట్టాలని దూకానురా !" అన్నాను ఏడవలేక నవ్వుతూ. శిరీష్ వాక్ప్రవాహం ఆగింది. తను చెప్పింది ఎవ్వరూ వినడంలేదని తెలిసేసరికి తనే పగలబడి నవ్వాడు. ఎందుకు నవ్వుతున్నాడో తెలీని చంద్రం శాంతలు అప్రయత్నంగా నవ్వేశారు ఒకళ్ళ ముఖాలు ఒకళ్లు చూసుకొని. "నవ్వు అనేది ఓ అంటువ్యాధి లాంటిది. ఒకళ్ళు నవ్వితే ఇంకొకరు నవ్వకుండా వుండలేరు. ఎదుటి మనిషి నవ్విస్తే కారణం లేకుండానే, మనకు తెలీకుండానే నవ్వొస్తుంది. కానీ ఏడుపలా కాదు. ఏడుస్తున్నవాళ్ళను చూసి అందరూ ఏడవలేరు మరీ సున్నితమైనవాళ్ళు ఒకళ్ళు ఏడిస్తే చూడలేరు. వాళ్ళకూ ఏడుపొస్తుంది. కొందరు సినిమా చూస్తూ, పుస్తకం చదువుతూ, సన్నివేశాన్నిబట్టి నవ్వడం ఏడవడం చేస్తుంటారు. కొందరు ఏ భావమూ వ్యక్తం చేయకుండా చదువుకుపోతుంటారు. అది వాళ్ళ మనసుకున్న అతిసున్నితమైన రియాక్షన్స్ మీద ఆధారపడి వుంటుంది.

శాంతా,చంద్రం, శిరీష్ ల నవ్వులు విన్న సుషమ, శేఖర్, మధు కూడా నవ్వేశారు.

అంతా పూర్తిగా వినండి. మళ్ళీ ఎవరికి వాళ్ళు గుసగుసలు చెప్పుకుందే కాదు. అని మరోసారి వోపిగ్గా, మధ్య మధ్య కొన్ని జోక్స్ చెబుతూ తన దక్షిణేశ్వర్ గంగానది స్నాన, సాహస గాథను వివరించాడు శిరీష్. మళ్ళీ ఓసారి అంతా మనస్ఫూర్తిగా నవ్వారు.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO




## బహుమతి : రూ. 232

ఈ క్విజ్‌లో మొదటి అయిదింటికి నాలుగేసి సమాధానాలు ఇచ్చాము. అందులో సరైన సమాధానాన్ని మీరు ఎంచుకొని క్విజ్‌ను పూర్తిచేయాలి. మిగతా అయిదింటికి పాఠకులే సమాధానాలు 6 నుంచి 10 వరకూ ఇచ్చిన "డాష్" లలో వ్రాయాలి.

## 'క్విజ్' లో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు

1 సమాధానాలు "యువ" కూపనుమీద మాత్రమే వ్రాసి పంపాలి. కవరుమీద "క్విజ్" అని స్పష్టంగా వ్రాయాలి. అందులో క్విజ్ కూపను తప్ప మరేమీ ఉండరాదు. కూపన్‌లో ఎటువంటి దిద్దుళ్ళు ఉండరాదు. కూపన్లను పోస్టులోనే పంపాలి ఆఫీసుకు వచ్చి ఇచ్చేవాటిని స్వీకరింపబడవు.

2. ఒకరికంటే ఎక్కువమంది ఆల్ కరెక్ట్ సమాధానాల్ని పంపితే, వారికి బహుమతి సొమ్ము పంచడం జరుగుతుంది. సంఖ్య మరీ ఎక్కువైతే లాటరీ పద్ధతి అమలుపరుస్తాం.

3. సమాధానాలు సీలు వేసిన సొల్యూషన్‌తో సరిపోవాలి.

4. దీనికి సంబంధించిన విషయాలలో "యువ" సంపాదకునిదే తుది నిర్ణయం. క్విజ్ సమాధానాలను జనవరి సంచికలో ప్రకటిస్తాము. ఎట్లాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

5. మాకు కూపన్లు చేరవలసిన ఆఖరు తేదీ డిశంబరు 31. ఆ పై వచ్చిన వాటిని పరిశీలించడం జరగదు.

## జనవరి నెల క్విజ్

1. మనదేశంలో పోస్టుకార్డును ప్రవేశపెట్టింది.

ఎ) 1869 బి) 1879 సి) 1889 డి) 1899

2. ఖగోళ శాస్త్రానికి సంబంధించిన "పంచసిద్ధాంత" గ్రంథాన్ని వ్రాసింది.

ఎ) బ్రహ్మగుప్త బి) వరాహ మిహిర సి) అమరసింహ డి) ఆర్యభట్ట

3. ఫోటోగ్రాఫర్ ఫ్లాష్ బల్బులో ఇది ఉంటుంది.

ఎ) టంగ్‌స్టన్ బి) మెగ్నీషియమ్ సి) ప్లాటినమ్ డి) మెర్క్యురీ

4. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత వరల్డ్ ఛాంపియన్‌షిప్ (World Championship) పొందిన ఏకైక భారతీయుడు

ఎ) విల్సన్ జోన్స్ బి) పరిమల్ రాయ్ సి) అనిల్ నయ్యర్ డి) కార్నిసింగ్

5. "రేపు ఏపాటి కష్టం కలిగించే సుఖాలనైనా, నేడు అనుభవించక వదిలివేయడం మంచిది'' – పై మాటలు అన్నది.

ఎ) స్పెన్సర్ బి) పెరల్ బక్ సి) ఫీల్డింగ్ డి) సినెకా

6. మనదేశంలో మొట్టమొదటిసారిగా గుర్రపు పందాలను ప్రవేశపెట్టిన సంవత్సరము ____________

7. 'ఖురామ్ షిహాద్‌యుద్దీన్ మహమ్మద్' అంటే __________ పేరు.

8. ప్రపంచంలోకెల్లా జీడిపప్పు ______________ దేశంలో అధికంగా ఉత్పత్తి అవుతుంది.

9. దుర్గావతి ఇర్రిగేషన్ ప్రాజెక్టు __________ రాష్ట్రంలో ఉంది.

10 "శిథిలాలయం'' నవలా రచయిత __________

యువ

క్విజ్ కూపన్ - జనవరి '78

సమాధానాలు

1 - ☐ 2 - ☐ 3 - ☐ 4 - ☐ 5 - ☐

6 ............ 7 ............ 8 ............

9 ............ 10 ............

పేరు : ____________________

అడ్రసు: ____________________

____________________

____________________

